# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

4-3-83
150 పైసలు



28312

సెబాష్ రాముా మేచ్ ని గెలిపించావు—చొక్కా మురికైతే ఏంపోయిందని!






## హై పవర్ సర్ఫ్
## అమిత తెల్లగా ఉతుకుతుంది...అమిత తెల్లగా, కనువిందుగా!

సెబాష్ సర్ఫ్! అమ్మకి యిందులో పాలుంది—నిజానికి మురికిని తీసిపారేసే ఛాంపియన్ హై పవర్ సర్ఫ్ అమ్మకి తోడు. సర్ఫ్‌లో, మరింత చురుకుగా పనిచేసే పదార్థాలుండటం వల్ల. అది మురికినంతటినీ తీసేసి అమిత తెల్లగా ఉతుకుతుంది. ఇంత చేసినా మరి సర్ఫ్ మీ బట్టల్ని శ్రద్ధగా చూసుకుంటుంది, మీ చేతుల్ని సున్నితంగా చూసుకుంటుంది.

ఏ గృహిణినైనా అడగండి— ఉండటానికైతే వందలకొద్దీ పౌడర్లున్నాయిగాని తను నమ్మేది ఒక్క సర్ఫ్ మాత్రమేనని.




**తెల్ల బట్టలకి సెబాష్ తెలుపు, రంగు బట్టలకి సెబాష్ గెలుపు**

LINTAS.SU.253.2316 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 4–3–'83
దుందుభినామ సం. అధిక ఫాల్గుణ బ పంచమి
సంపుటము 75 : సంచిక 27
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
విడి ప్రతి వెల రు. 1–50
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



ముఖచిత్రం
నటి జయప్రద
(ఫోటో: ఆర్.కె. నరసింహం)


కథలు :

తెగిన పేగు ... 8
ఎండమావి ... 19
అడ్డదారులు (పెద్దకథ) ... 44
ఐస్ క్రయిమ్ ... 48
లవణం ... 57

సీరియల్ నవలలు :

జీవిత సమరం ... 12
అందానికి అవతలివైపు ... 26
జీవన్ మృతులు ... 52

వ్యాసాలు, శీర్షికలు :

ఉత్తరాలు—5, న్యూఢిల్లీ లేఖ—6, లోకం పోకడ—7, వారఫలం, వ్యక్తిగతం...—11, ప్రశ్నావళి—18, కొత్త గొంతులు—25, ఇ'వేమన' పద్యాలు — 29, బొంబాయి బైస్కోపు-30, స్క్రీన్ ప్లే అంటేఏమిటి?-32, సినిమా కబుర్లు — 36, సినిమా — 38, ...హీరో కృష్ణంరాజు-43, ధర్మ పథం-47, డాక్టర్ సలహాలు-56, ఎడ్లపందాలలో జాక్ పాట్—58, హైదరాబాద్ నోట్ బుక్-62, వంటలు—64, అవీ-ఇవీ-అన్నీ—65.

### ముఖచిత్రం

తేది 18—2—83 నాటి ఆంధ్రపత్రిక వారపత్రిక ముఖచిత్రం "పూర్ణిమ" ప్రకృతి సౌందర్యమంతా దోచుకుని ముచ్చటయిన రంగుల్లో రమణీయత తొణికిసలాడింది

పి. ఉమామోహన్ (కాశీబుగ్గ)

### ధన్యవాదాలు

జి వి. జి సేకరణలో 1982లో విడుదలలైన తెలుగు చిత్రాలను క్రమముగా ప్రచురించిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక"కు ధన్యవాదాలు.

బళ్లారి మహమ్మద్‌సలీమ్ (గుత్తి)

### కొత్త మలుపు

హిందూ మ్యారేజి యాక్ట్‌ను రాగాగ్నిలో (14 1 83) ద్విభార్యత్వం వో కొత్తమలుపు పరిస్థితుల ప్రాబల్యానికి లోనై వెదకబోయినతీగకాళ్ళకు చుట్టుకున్నట్టు రవిచంద్రకు సాహిత్య దొరికింది.

ఆనందప్రియ (ఖమ్మం)

### ముగింపు బాగుంది

సున్నితమైన శృంగారాన్ని అత్యంత మెళుకువగ మేళవించి పాటక లోకాన్ని మైమరపింప చేసిన చిట్టారెడ్డి సుర్యకుమారి నవల "రాగాగ్ని" ముగింపు ఎంతో బాగుంది.

ఆవుల రమణారెడ్డి (జమ్మలమడుగు)

### శవాలు

14.1.83 ఆంధ్రసచిత్ర వారపత్రికలో విడెంబీ అనే చోట 1952 లో దొరికిన శవాలను శాస్త్రజ్ఞులు పరిశీలించారు అని వ్రాశారు. చనిపోయినమనిషికిచర్మము,జుట్టు, మాంసముపోతాయి కదా! మరి ఆ శవానికి కట్టి ఉన్న గంతలు ఎలా ఉన్నాయి. ముక్కు స్థానంలో చెవుల స్థానంలో పుర్రెకు రంధ్రాలు ఉంటాయికదా మరిఈఫోటోలో ముక్కువలె కన్పిస్తుంది పెదవులు కనిపిస్తున్నాయి ఇది ఎలా సాధ్యం అని అడుగుతున్నాము. ఈశవాలు ముఖ్యంగా ఈ అమ్మాయి శవము 1900 సం నాటిది అయినట్లయితే శవం యొక్క పుర్రె, ఎముకలు మాత్రమే ఉండాలి కాని దాని మీద మాంసాదులు ఉండవుకదా! మరికొన్ని శవాలప్రక్క తాడు దొరికిందని వ్రాశారు. 1900 సం. కాలము ఆ తాడు ఎలా ఉంటుంది. 14సం. అమ్మాయి వ్యభిచరించటం సాధ్యంకాదుగదా! ఇది ఎలా సంభవము. మరియు కొన్నిశవాలలోని ఆహార పదార్థమును తీసి పరిశీలించారు అని వ్రాశారుకదా! 1900సం. ఆ ఆహారము ఎలా ఉంటుంది. ఆ అమ్మాయిని చంపిలేక జబ్బుచేసి చనిపోయి ఉండవచ్చునని వ్రాశారుకదా!మరి ఆ విషయంతెలిసినవారికి గంతలు (1900 సం) ఉన్నాయో కూడా తెలియాలి కదా! అన్ని విషయాలు విపులంగా తెలుపగలరని ఆశిస్తున్నాము.

సబ్బినేని హేమలత (నాగాయలంక)




### తొణకని స్వప్నం

"సుమలత" ముఖచిత్రం ఎంతో బావుంది. మమ్మల్ని ఎంతో ఆకట్టుకుంది. పెద్దకథ "తొణకని స్వప్నం" సరికొత్త శైలిలో సాగిపోతోంది. అమల మాటలు వింటుంటే, మాధవ్ సమాధానాలు చూస్తుంటే మాకే ఆశ్చర్యం కలుగుతుంది టి కుమార స్వామి (కరీంనగర్)

### తప్పు

27—1—83 వ తేదీ సంచికలో చిట్టారెడ్డి సూర్యకుమారి గారి "రాగాగ్ని" సీరియల్‌లో కుమారస్వామి తారకాసురుని కంఠాన్ని చేదించినప్పుడు అయిదు ముక్కలైన శివలింగము, భీమేశ్వరం (కాకినాడలో) 2 పాలకొల్లు 3. ద్రాక్షారామము . 4. కోటిపల్లి (తూ గో.) 5 అమరావతిలలో పడిందని వ్రాసారు అదితప్పు. ఆ అయిదు ముక్కలలో 2 పశ్చిమ గోదావరి జిల్లాలోను, 2 తూర్పు గోదావరిజిల్లాలోను, 1 గుంటూరుజిల్లా అమరావతిలోను వద్దాయి. అవి.

1. గునుపూడి (భీమవరం) 2. పాలకొల్లు —పశ్చిమ గోదావరి జిల్లా. 3. సామర్లకోట—భీమవరం 4. ద్రాక్షారామం — తూర్పు గోదావరి జిల్లా 5. అమరావతి— గుంటూరు జిల్లా.

కె. దుర్గాప్రసాద్, గునుపూడి (భీమవరం)

### ...ర్య తీసుకోవాలి

పాదిరి కుప్పం"లో జనవరి 5 వ ఎన్నిక రోజు సాయంత్రం జరిగిన భీభత్సం గురిం 4—2—83 వ తేదీ పత్రికలో మీరు ప్రచురించిన విషయాలు తక్కువేఅయినా బాగా ప్రచురించారు. పాదిరికుప్పంలోని హరిజనులకు జరిగి అన్యాయానికి ప్రగాడ సంతాపం తెలుపుతు దీనికి కారకులైన వారిని కటినంగా శిక్షించే చర్య తీసుకొనవలెనని క్రొత్త ప్రభుత్వాన్ని కో తున్నాను.

ఎస్ అన్‌సర్ హుస్సేన్ (గిరింపేట

### కథ

ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంక్రాంతిసంచి "ది లాస్ట్‌డేట్" అనే కథ నాకెంతగానో నచ్చింది వాస్తవ జీవితానికి అద్దం పడుతూ వుంది కులప్రా పదిక మీద సీట్లు రిజర్వేషను చేయటం కాకుం మెరిట్‌పై విద్య, ఉద్యోగావకాశాలు ప్రభుత్వ కల్పించాలి. సమానత్వం సమానత్వం అనే ప్రభుత్వం కులాలు,మతాలు అంటూ విడదీస్తు ఇప్పుడు చైతన్య,రేపు రాజా! ఇలా ఎందరో? మరె దరో? ఈ పరిస్థితికి అంతం లేదా ?

కడియాల సురేష్‌బాబు (మంగళగి

### అభిరుచి

ముద్దుగా బొద్దుగా ఆకర్షనీయంగా ఉ సరిత ముఖచిత్రం మమ్మల్ని ఆకట్టుకుంది

ఎస్. శివానంద్, ఎ. సతీష్‌బాబు (బెల్లంపల్లి

(66 వ పేజీ చూడండి)



# మనకొద్దీ నెహ్రూ వారసత్వం

ఇందిరాగాంధీ దక్షిణాదిలో ఓడిపోయి నెల దాటుతోంది కాని ఎవరూ "ఇందిర తరువాత ఎవరు ?" అని అడగటంలేదు. నెహ్రూ బతికిఉన్న రోజులలో ఇలాంటి ప్రశ్న అడిగేవాళ్ళు. జె యి న్ ల వార్తాపత్రికా సామ్రాజ్యంలో కొందరు ధీరులు తప్ప ఈ దేశంలో ఇంకెవరూ శ్రీమతి గాంధీ లేకపోతే బతకలేమనుకోవటం లేదన్నమాట. దీనిని బట్టి రాజకీయాలలో మనం ఒక దేశంగా ఎంత ఎదిగామో గ్రహించవచ్చు. విదేశాల వాళ్ళకి మాత్రం ఇక్కడి మార్పులు అంతగా అర్థం కావటంలేదు. 1975 నుంచి జరుగుతున్నదంతా వాళ్లకి అయోమయంగా ఉంటోంది. శ్రీమతి గాంధీ ఎన్నికలలో అపజయం పొందినప్పుడెల్లా వీళ్ళు భారత దేశం ముక్కలయి పోతోందనుకుంటారు.

భారతదేశం ముక్కలవదు. ఎందుకంటే, భారతదేశాన్ని సృష్టించిన వాళ్ళు లేదా నిర్మించిన వాళ్ళు ఇందిరాగాంధీ కారు, ఆమె తండ్రి కాదు. తామే ఈ దేశం కూలిపోకుండా నిలుపుతున్నట్లూ, తమ తరువాత ప్రళయం వస్తుందన్నట్లూ నెహ్రూలు మాటలాడుతూ ఉంటారు విదేశాలలో ఈ రకం ప్రచారం మరింత బాగా జరిగింది నెహ్రూ బతికి ఉండగానే "నెహ్రూ అనంతరం ఎవరు ?" అన్న పుస్తకం వెలువడింది. ఆ పుస్తకంలో జరిగిన వ్యాఖ్యలని నెహ్రూ ఖండించినట్లుగా నాకు తెలీదు అసలు ఆయనే ఆ పుస్తకం రచయితని ప్రోత్సాహించాడేమో కూడా. తెల్లతోలు ఉన్నవాళ్ళు ఏది రాసినా ఇక్కడి మేధావులకి నేరం అని నెహ్రూలకి తెలుసు కదా ?

"థాచర్ అనంతరం ఎవరు ?" అనీ; "రీగన్ అనంతరం వరు ?" అనీ; ఇంగ్లాండులో కాని, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో కాని అడుగుతారా ? రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులలోనే బ్రిటన్‌లో ఎవరూ "చర్చిల్ అనంతరం ఎవరు ?" అని అడగలేదు సరి కదా యుద్ధం ముగియగానే ఆయనని తొలగించి వేశారు — వోటు ద్వారా. చర్చిల్, రూస్ వెల్ట్ అంతటి వాళ్ళే అక్కర లేదనుకుంటే ఇక నెహ్రూల సంగతి ఏమిటి ?

ప్రపంచం భారతదేశాన్ని ఇంకా గుర్తించటంలేదు. పేదరికంలో మునిగిపోయి ఉన్న ఒక 19వ శతాబ్దపు దేశం భారతదేశం అనుకుంటారు విదేశీయులు ఎందరో. ఈ పేద దేశంలో చిన్న రాజులూ, బందిపోటు దొంగలూ, ఒకళ్ళనొకళ్ళు చంపుకునే మత–దురభిమానులూ తప్ప ఇంకెవరూ కనిపించరు వాళ్ళకి. ఈ చిత్రాన్ని రచించి ప్రపంచానికి ప్రదర్శించిన వాళ్ళు బ్రిటిషు వాళ్ళు. ఆ చిత్రమే ఇంకా ప్రపంచంలో చెలామణిలో ఉంది. పోయిన 35 సంవత్సరాలలో ఇక్కడ ఎంతో జరిగింది. అణు కేంద్రాలూ, ఉక్కు కర్మాగారాలూ, పచ్చ విప్లవాలూ, అంతరిక్ష ప్రయోగాలూ ఇక్కడ ఉద్భవించాయి. జరిగాయి. అయినా, ఇక్కడ కనిపించేది ఆకలితో మాడే వాళ్ళూ, బాలవితంతువులూ, తుపాకులు ధరించే మహారాజులూ — విదేశాల వాళ్ళకి.

విదేశాలలో భారతదేశాన్ని గురించి పుస్తకాలు వెలువడుతూ ఉంటాయి. వాటిలో ఇంచుమించు అన్నీ భారతదేశం యొక్క పేదరికాన్ని గురించే. ఇలాంటి పుస్తకాలని వేసేందుకే ప్రకాశకులు అంగీకరిస్తారు. ప్రపంచ బాంకు కన్నా దుర్మార్గపు సంస్థ లేదనిపిస్తుంది. ఈ సంస్థ ఎప్పుడూ భారత దేశం యొక్క దారిద్ర్యాన్ని గురించి నివేదికలు తయారుచేస్తూ ఉంటుంది. ఈ మధ్యనే ఆ సంస్థ నుంచి ఒక వ్యక్తి వచ్చి భారత దేశంలోని "నల్లధనా"న్ని గురించి ఒక నివేదిక తయారుచేశాడు. మన దేశంలో తప్ప నల్లధనం లేదా ఏమిటి ? కాని, ఈ గ్రంథానికి కావలసినంత ప్రచారం లభిస్తుంది. లభించేట్లు ప్రపంచ బాంకు వాళ్ళు చూస్తారు. నల్లధనం వల్లనే భారతదేశం వెనుకబడి పోయిందన్న అభిప్రాయానికి కూడా మంచి ప్రచారం లభిస్తుంది. దొంగ పరిశోధనలూ, దొంగ నివేదికలూ ఇలాగ వుంటాయి. "నల్లధనం" అంటారే అది లేని దేశమే లేదు అమెరికా, ఇటలీలలో ఇది మరీ అధికంగా చెలామణిలో వుంటుంది - ఈ యదార్థాన్ని వదిలి ప్రపంచ బాంకు భారతదేశం మీద మాత్రం పడుతుంది.




మన రాజకీయ వాదులూ, మన చదువుకున్న బాబులూ భారతదేశాన్ని చవకగా అమ్మేస్తారు. న్యూఢిల్లీకి వచ్చిన ఏ తెల్లతోలు మనిషి కయినా శ్రీమతి గాంధీ ఇంటర్‌వ్యూ ఇస్తారు; భారతీయ పత్రికా రచయితలకి మాత్రం ఇంటర్‌వ్యూలు దొరకవు. అమెరికా అధ్యక్షుడు విదేశాల విలేఖరులకి సాధారణంగా ఇంటర్‌వ్యూ ఇవ్వరు. అసలు, రీగాన్ పత్రికా విలేఖరుల సమావేశంలో విదేశీ విలేఖరులు ప్రశ్నలు వెయ్యటానికి వీలులేదు. ఇది ఇలాగ వుండగా, ఏ స్పెయిన్ — రుమేనియా నుంచి ఎంత చిన్న వార్తా సంస్థ ప్రతినిధి అయినా సరే కాని ఇక్కడి ప్రధాన మంత్రిని ఏవేవో ప్రశ్నలు అడగవచ్చు.

విదేశాల సహాయ సంస్థల సేవలని తల్చుకుంటే మన చదువుకున్న బాబులకి వళ్ళు తెలీదు. ఆ సంస్థల సహాయం లేకపోతే మనం నాశనం అయిపోతామని వీళ్ళ నమ్మకం కాబోలు. మన సమస్యలు మన చేతకాని తనంవల్ల వచ్చినవే కాని ఇంకెవరి వల్లనో వచ్చినవి కావని వాళ్ళు గుర్తించరు మన దేశంలో అవినీతి వుంది నిజమే - కాని, ప్రపంచంలో ఇంకెక్కడా లేదా ? శ్రీమతి థాచర్ ఫాక్‌లాండ్ సమస్య ఒక "భౌగోళిక సమస్య" అనేసి తమ చేతులు దులుపుకుని ఊరుకున్నారా ? లేదే ! ఐక్యరాజ్య సమితి

ఏమంటే అన్నదని ఆమె తను నౌకాదళాన్ని అక్కడికి పంపించారు. నెహ్రూ ఆమె స్థానంలో వుంటే "అక్కడ ఒక్క గడ్డిపోచ కూడా మొలవదు!" అని నిద్రలోకి మునిగి పోయేవారు.

కమ్యూనిస్టు దేశాలని తీసుకోండి—వాళ్ళకి మనలాగే డబ్బు కావాలి. కాని, దానికోసం వాళ్ళు ముష్టి ఎత్తరు ఈ విషయంలో కమ్యూనిస్టు దేశాల వాళ్ళని మెచ్చుకోవాలి. సోవియట్ రష్యాకి ప్రపంచ బ్యాంకులో సభ్యత్వం లేదు. ఆ సంస్థ వద్ద రష్యా అప్పు తీసుకోదు చీనా వాళ్ళు సభ్యులే కాని చేత చిప్ప పట్టుకుని తరచు వాషింగ్‌టన్‌కి వెళ్ళరు అమెరికా లేదా బ్రిటన్ నుంచి బెయిజింగ్ ( చీనా రాజధాని ) కి వెళ్ళే వ్యాపారులు నెలల పాటు కాచుకుని కూర్చుంటే కాని పెద్ద అధికారులని చూడలేరు. భారత దేశంలో తెల్లతోలు కనపడితే చాలు అధికారులు సంబరపడిపోయి పనులు చేసిపెడతారు — తమకి విదేశ పర్యటనో, తమ పుత్రుడికి వుద్యోగాలో దొరకవచ్చు కదా?

ఒక దేశంగా మనకి ఆత్మవిశ్వాసం తక్కువ. ప్రభుత్వరంగంలో ఏ సంస్థ నయినా తీసుకోండి, విదేశీ సహాయం లేకుండా దానిని నెలకొల్పారా? మనం 40 సంవత్సరాలుగా మోటారు కారులని తయారు చేస్తున్నాము. అయినాసరే, జపాన్ లేదా ఇటలీ సాయం లేనిదే కొత్త మోడలుని తయారు చెయ్యలేము అవతలి వాళ్ళు చేసేదే మనమూ చేస్తే మన మీద మనకి గౌరవం తగ్గుతుంది. రష్యా వాళ్ళకి ఇంత న్యూనతా భావం లేదు — వాళ్ళు (ఉదాహరణకి) అమెరికా వాళ్ళంతగా సాంకేతికాభివృద్ధి సాధించలేక పోయినప్పటికీ, వాళ్ళ తయారీలు అంత బాగా వుండవు కాని వాళ్ళకి అవే చాలు. మన శక్తి మీద ఆధారపడటం అంటే ఇంకేమిటి?

ఒక దేశంగా మనం మన ఇటీవలి గతం నుంచి విముక్తి చెందగలగాలి మనకి వద్దా నెహ్రూల వారసత్వం! అప్పుడే మనం మన కాళ్ళమీద నుంచోగలుగుతాము, ఎంతసేపూ పాశ్చాత్యులని ఆశ్రయించటం ఆపేస్తాము. ఇంతపనీ చేస్తామేమోననే పాశ్చాత్యుల భయం. మనం ఎదగటం వాళ్ళకి ఇష్టంలేదు. మనం స్వతంత్రులం కావటం వాళ్ళకి నచ్చదు. వాళ్ళ భయం సహేతుక మయినదే. మనం మన కాళ్ళ మీద నిలబడితేనే ఎదగ గలము!



# తెగిన పేగు

-పిడుపాటి ఉమామహేశ్వరమ్





'అత్తగారు మీతో ఏమన్నా మాట్లాడారా? కాబోలు. ఇందాకట్నించీ కాలుగాలిన పిల్లిలా తిరుగుతూ దేనికో తటపటాయిస్తున్నారు' అంది సావిత్రి.

ఎందుకన్నట్టు ప్రశ్నార్థకంగా చూసేడు సుబ్బారావు ఏమో అన్నట్టు పెదవి విరుస్తూ భుజాలెగరేసింది సావిత్రి

ఆవిడకీమధ్య సుస్తీగా ఉండి ఇప్పుడే కోలుకుంటోంది అంచేత దాదాపు రోజంతా పెరటి వేపు గదిలోనో, వరండాలోనో మంచం మీదే రోజులు వెళ్ళిపోతున్నాయి. సుబ్బారావు ఎప్పుడో వొస్తాడు ఆఫీసు నుంచి. స్నానమూ, భోజనమూ, ఆఫీసు ఫైల్సూ మధ్య ఎప్పుడో వెళ్ళి కాసేపు ఆవిడ పక్కన కూచుని మంచీ చెడూ మాట్లాడతాడు.

ఆవేళ -

సాయంత్రం నుంచే 'అబ్బాయి ఇంకా రాలేదా' అని చాలా సార్లు అడిగింది కోడల్ని నాగలక్ష్మి. తానూ రెండు మూడుసార్లు వీధి వేపు తొంగిచూసి వచ్చింది.

అందుకే సుబ్బారావు ఇంటికొచ్చి కాస్త స్థిమిత పడగానే, తనతో మాట్లాడడానికి తల్లి ఎందుకో ఆత్రుత పడుతున్నట్టు చెప్పింది సావిత్రి.

భోజనానికి సిద్ధం చేయమని చెప్ప బోతూన్న వాడల్లా ఆగి తల్లి దగ్గరకెళ్ళేడు సుబ్బారావు.

కృష్ణ పక్షపు చవితి వెన్నెల గుడ్డిదీపం కన్నా అన్యాయంగా ఉంది. కరెంటు లేక పోవడం మూలాన్నా గదిలోని లాంతరు తెచ్చి వరండాలో తగిలించి వెళ్ళింది సావిత్రి.

'ఎలా ఉందమ్మా ఒంట్లో' అడిగేడు సుబ్బారావు తల్లి పక్కనే మంచంలో కూర్చుంటూ.

'ఎంత సేపైందిరా వొచ్చి' అందామె సమాధానంగా. తల్లి గొంతు ఎందుకో కొత్తగా వినిపించింది సుబ్బారావుకి.

'ఇప్పుడే... పది నిమిషాలైంది... మందు పుచ్చుకున్నావా...'

'ఊ ...'

ఆ తర్వాత మాటల్లేవు.

తల్లి ఏమన్నా చెప్తుందేమోనని ఎదురు చూసేడు సుబ్బారావు ఆమె ఎందుకో మౌనంగా ఉండిపోయింది. ఆ మౌనంలో అస్పష్టమైన ఆమె గుంజాటనని మాత్రం మసక వెల్తుర్లో గూడా స్పష్టంగా చూడ గలిగేడు సుబ్బారావు

'ఎందుకో అడిగేవుట ...'

ఆవిడ జవాబివ్వలేదు. మార్చి మార్చి సుబ్బారావు మొహంలోకి మాత్రం తదేకంగా చూస్తోంది

తల్లి చేతుల్ని తన చేతుల్లోనికి తీసుకుని అభిమానంగా నిమురుతూ 'ఏమన్నా కావాలా' అనడిగేడు మృదువుగా... గొంతు తగ్గించి.

మరి కొద్దిసేపు మౌనం తర్వాత ఆవిడ మెల్లగా అంది—

# వారఫలం

4 -3-1983 శుక్రవారం మొదలు
10-3-1983 గురు వారం వరకు

♈ మేషం అన్ని విధాలా మేలు చేకూరుతుంది అవసరాలకు కావలసిన ధనం లభిస్తుంది ఉద్యోగంలో ఏవైనా మార్పులు రాగల అవకాశాలున్నాయి రాజకీయంగా మేలు చేకూరే అవకాశం గల వారం స్త్రీలకు: సాహితీ రంగంలో అవకాశాలు లభిస్తాయి

♉ వృషభం నూతన మిత్రులు చేరుతారు నూతన వస్తు సేకరణకు అవకాశం గలవారం అధికారుల నుండి కావలసిన పనులు సుకరంగా నెరవేర గలవు స్త్రీలకు: ఉద్యోగంలో నూతన మార్పులు రానున్నవి. చాలమందికి ఉద్యోగ మార్పులు, బదిలీలు చెప్ప దగిన అవకాశ మున్నది

♊ మిథునం: కళా సాహిత్య రంగాలలో అనుభవం గలవారికి సదవకాశాలు లభిస్తాయి వ్యాపారస్థులకు పురోగమించే మార్గాలు ఏర్పడుతాయి ప్రయాణ మూలకంగా వస్త్ర విక్రయానికి అవకాశం కొందరకు ఏర్పడ గలదు స్త్రీలకు ఆదరణ, అభివృద్ధి, ధనాదాయం లభించే మార్గ మున్నది

♋ కర్కాటకం. భిన్న మార్గాల ధనాదాయం చేకూరే అవకాశ మున్నది. రచయితలకు ఉత్తమ ఫలదాయక మైన వారం. వ్యాపారానుకూలతకు సుగమంగా ఉండగలవారం అపరిచితుల మూలాన ఏవైనా చిక్కులు ఏర్పడ వచ్చు జాగ్రత్త పడండి స్త్రీలకు: అన్ని విధాలా సదవకాశాలు లభించే మార్గ మున్నది

♌ సింహం. సజ్జన సాంగత్యం లభించే అవకాశం గలవారం. నూతన వస్తువులు సంపాదించు కొనుటకు అనువైన వారం చాల మంది విదేశ పర్యటనకు ప్రయత్నాలు చేస్తారు స్త్రీలకు విద్యా వైజ్ఞానిక రంగాలలో అభివృద్ధి, ఒకవేళ ధనాదాయం లభించ వచ్చు.

♍ కన్య వస్తు వాహన సేకరణకు చాలమందికి అవకాశం ఏర్పడ వచ్చు కొందరు దూర ప్రాంతాలకు ప్రయాణించే అవకాశా లుండ వచ్చు నూతనంగా భూమిగాని, యిల్లుగాని కొనుగోలు చేయుటకు కొందరు ప్రయత్నిస్తారు. స్త్రీలకు ఉద్యోగ ప్రగతి, సాహితీ ప్రక్రియ మూలాన లబ్ధి చేకూర గలవారం, గ్రహించండి

♎ తుల వృత్తి ఉద్యోగాలందు గాని, ధనాదాయ మందు గాని, రాజకీయ రంగాన గాని ఈ వారం చాలమందికి, ఈరాశివారికి రాణింపు గలదు నూతన వ్యక్తుల పరిచయం ఏర్పడ మన్నది స్త్రీలకు. అధికారుల మన్నన, ధనాదాయ మున్నది

♏ వృశ్చికం విలువగల వస్తువులు సేకరింప గలరు ధనాదాయ మున్నది. వారం చివరి రోజులందు, ప్రయత్న లోపం లేకుంటే కాని పనులు లేవు వ్యాపారం చేసేవారికి అనుకోకుండా ప్రయాణాలు తగులుతాయి స్త్రీలకు. అన్ని రంగాలలో అవకాశాలు అంది పుచ్చు కొన్నట్లు లభించగలవు

♐ ధనుస్సు. భూములు గాని, యిల్లు గాని కొనుగోలు చేయుటకు యత్నిస్తారు చాలమంది ఈ రాశి వారలకు కళారంగ ఖ్యాతి యినుమడింప గలదు అంతే కాకుండా ధనాదాయం కూడా సంభవం స్త్రీలకు నగలు కొనుగోలు చేయుటకు, వస్త్ర సేకరణకు అనువైన వారంగా గ్రహించాలి

♑ మకరం. మిత్రుల వలన గాని, బంధు వర్గీయుల వలన గాని కడకు అపరిచితుల వలన గాని ఏవో యిబ్బందులు తటస్థింప గలవు. పెద్ద మొత్తంతో, ఒకానొక వ్యాపారానికి దిగాలని ప్రయత్నిస్తారు, అది జరగక పోవటంతో బాధ పడుతారు స్త్రీలకు నగలు చేయించు కొనుటకు, ఉద్యోగ ప్రయత్నములకు అనువైన వారం.

♒ కుంభం ఉద్యోగంలో ఉన్నవారికి చాల మందికి చాల కాలంగా నిలచిన 'ప్రమోషన్' లభించే మార్గం కనిపిస్తుంది కొందరకు పిలవని పేరంటానికి పోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. స్త్రీలకు వార మంతా ఒడిదుడుకులతో జరిగి పోతుంది

♓ మీనం. చుట్టు ప్రక్కల వారితో గాని, బంధువులతో గాని గొడవలు రాకుండా చూచుకోండి మీకు ఒకటి రెండు రోజులు ఆర్థికంగా పరీక్షా కాలంగా కనిపిస్తుంది ఏ విధంగా చూచినా నిరుత్సాహంగా ఉంటుంది స్త్రీలకు ధన ధాన్య, వస్త్ర సేకరణకు అనుకూల వారంగా గ్రహించి, శ్రమించాలి

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# వ్యక్తిగతం



తెలుగు ఆడవారి కళ్ళు చాలా బాగా ఉంటాయి. వాళ్ళూ అందంగా ఉంటారు తమిళ వనితలకన్నా వాళ్ళే తమకి నచ్చారని పండిత నెహ్రూ ఒక ఉత్తరంలో సరోజినీనాయుడు కుమార్తె పద్మజా నాయుడుకు రాశారుట ఆ ఉత్తరంలోని ఈ మాటలని 'ఆర్గనయిసర్' పత్రికలో వేశారు



డాక్టరు చెన్నారెడ్డి పంజాబు గవర్నరు పదవి వదులుకుని మళ్లీ హైదరాబాదుకి వస్తున్నారెందుకు? ఈ ప్రశ్న ఎందరినో తహతహ లాడిస్తోంది



78 సంవత్సరాల పండిత కమలాపతి త్రిపాఠీకి ఒక కొత్త రకం ఉద్యోగమే దొరికింది శ్రీమతి గాంధీ ప్రతినిధిగా ఆయన కాంగ్రెసు [ఐ] వ్యవహారాలని చూసుకుంటారుట



వెస్టిండీస్ వెళ్తున్న భారత క్రికెట్ జట్టు నాయకుడిగా కపిల్ దేవ్‌ని క్రికెట్ కంట్రోలు బోర్డు ఏకగ్రీవంగా ఎన్నుకున్నది ఆల్ రౌండర్‌గా పేరు తెచ్చుకున్న ఈ అగ్రశ్రేణి ఆటగాడు ఇప్పటివరకు ఆడిన 48 టెస్ట్ పోటీలలో 1999 పరుగులు చేశాడు 185 వికెట్లని పడగొట్టాడు ఇంత తొందరగా తనకి ఇటువంటి అవకాశం వస్తుందని తానూహించ లేదని అన్నాడు కపిల్‌దేవ్ నిఖంజ్




నీరజ అలా తలుస్తూ మెల్లగ నిద్రలోకి జారుకుంది. పనిపిల్ల వచ్చి తలుపులు గట్టిగ తట్టే వరకు తెలివి రాలేదు నీరజ నిద్రలేచి తన తలంపులకు తానే విరక్తి చెంది నిట్టూర్చి మంచం మీంచి లేచింది. తన ఒంటరి బ్రతుక్కి తానే నవ్వుకుని లేచి వెళ్ళి తలుపు తెరిచింది

ప్రొద్దున్న కార్యక్రమం పూర్తి చేసుకుని వంటకు ఉపక్రమించింది. తొమ్మిదిన్నర అవుతుంది వంటగదికి మధ్యనున్న ద్వారం వద్ద కూర్చుని కూర తరుగుతూంది. డాక్టరు కృష్ణ వచ్చేడు చిరు నవ్వులతో

"హలో ! నీరజ !"

"రండి– ఆ కుర్చీలో కూర్చోండి "

డాక్టరు కృష్ణ సరాసరి వచ్చి నేలమీద గుమ్మం వద్ద కూర్చున్నాడు నీరజ నవ్వుతుంది

"అదేమిటి అలా అమ్మాయిలా వచ్చి కత్తిపీటకు దగ్గరగ నేలమీద కూర్చున్నారు. బాబ్బాబు – అలా కుర్చీలో కూర్చోండి. ఎవరైన చూస్తే నవ్విపోతారు "

"ఎవరు నవ్వినా పరవాలేదు నువ్వు నవ్వవు కదా ?"

"నేను నవ్వుతున్నా కదా "

"నువ్వు నవ్వితే నాకు ఆనందమే "

"అయితే ఉండండి స్ట్రాంగు కాఫీ చేసిస్తా మీ కాంప్లిమెంటుకు "

"గుడ్"

నీరజ అలా లేచి స్టౌ దగ్గరకు వెళ్ళగానే డాక్టరు కృష్ణ కత్తిపీటను లాగుకుని కాయల్ని తరగడం మొదలెట్టేడు. నీరజ ఇటు తిరిగి –

"డాక్టరుగారు ఏమిటా పని ?" అని తన ఖేదాన్నంత మరచి విరగపడి నవ్వడం మొదలెట్టింది.

"గుడ్ ! డాక్టరుగ నా విధిని నేను నిర్వర్తిస్తున్నాను."

"అంటే కూరలు తరగడమా ?"

"అందులోని ఆంతర్యాన్ని గ్రహించాలి నవ్వు నాలుగు విధాల బలాన్ని చేకూరుస్తుంది. హృదయం ఆహ్లాదంగా ఉంటే శరీరానికి ఏ జబ్బు రాదు. ఆరోగ్యంగా ఉండొచ్చు. డాక్టరుగ నీ ఆరోగ్యాన్ని నిన్ను నవ్వించి కాపాడుకోనిస్తున్నాను యామై కరక్టు ?"

"యస్ బట్ నో. ఆ బీరకాయల్ని చెక్కేస్తు సగానికి సగం తీసేస్తున్నారు. దట్ ఈజ్ రాంగ్,

(గత సంచిక తరువాయి)

బీరకాయల్ని గీరాలిగాని పెచ్చులు తీయనక్కరలేదు "

చక్కని చిక్కని కాఫీచేసి రెండు కప్పుల్లో పోసి ఒక కప్పును కృష్ణకు అందించి తనో కప్పును తీసుకుని మళ్ళీ గుమ్మంవద్ద కూర్చుంది

"కాఫీ ఎలాగుంది కృష్ణగారు ?"

"వెరీగుడ్– ఐ లవ్ యు "

"వెరీ గుడ్ కాఫీ గనుక ఐ లవ్ యు బదులు ఐ లవ్ ది కాఫీ అంటే బాగుండును "

"అదికాదు నీరజ– నిజంగ ఐ లవ్ యు ఎందుకు నా హృదయాంతరాళం నుండి వచ్చిన నా మాటల్ని పరిహాసంగ కొట్టిపారేస్తు నన్నిలా బాధిస్తావు ?"

"చూడండి డాక్టరుగారు ! ప్రొద్దున్న పది గంటలేనా కాలేదు పైగ నాకు చాల ఆకలిగా ఉంది త్వరగా వంట చేసుకుని భోజనం చేద్దామనుకుంటున్నాను ఈ ఆకలి కడుపుతో ప్రేమ కబుర్లను వినగలనా మీరే చెప్పండి "

"ఓకే– ఓకే ఏదో సందర్భంలో నా మనస్సులోని కోరిక చెప్పాలిగ అందుకే అవకాశం వచ్చింది కనుక చెప్పేసేను "

"ఇలా ఎన్నో సందర్భాలు వచ్చేయి మీరు చెప్పేరు కూడా."

"అవుననుకో – కాని నాకు సరైన జవాబు రాలేదింక అందుకే పట్టువిడవని విక్రమార్కుడిలా మరీ మరీ చెపుతున్నా, ఏనాటికైన నన్ను కరుణించి నన్ను పెండ్లి చేసుకుందికి ఒప్పుకుంటావని "

నీరజ కాస్సేపు నిశ్శబ్దంగ ఊరుకుంది ఆమె కంటివెంట నీరు కారజొచ్చింది ఆ కన్నీరును చూచి డాక్టరు కృష్ణ చకితుడయ్యేడు

"అదేమిటి నీరజ నిన్ను నా మాటలతో అంత బాధించేనా ఏడుస్తున్నావు ఐ యాం సారి ఇక ముందు అట్లాంటి ప్రేమ సంభాషణలు చేయనులే "

"అదికాదు కృష్ణగారు మీరు నన్ను భార్యగా స్వీకరిస్తానంటే నా కెంతో గర్వంగ, ఆనందంగి ఉంది. కాని మిమ్మల్ని భర్తగ పొందే అదృష్టం నాకు లేదు. అందుకే దుఃఖిస్తున్నా "

"అదేమిటి నీరజ–నీ మాటలు చాలా ఆశ్చర్యంగా ఉన్నాయి."

"నా గత చరిత్ర మీకు తెలియదు తెలిస్తే మీరా సాహసం చేయలేరు "

"వెర్రిదానా – ఈ కృష్ణుడి సంగతి నీకు తెలియదు ఎట్టి పరిస్థితిలోను వెనుకాడె వ్యక్తిని కాను "

"నేను డైవోర్సీని కావచ్చు, విడోనికావచ్చు– అప్పుడు ?"

"అప్పుడుకూడా నీనుండి పూర్తి వివరాలను తెల్సుకుని నామనస్సును సమాధాన పర్చుకుని నీమీద నాకున్న ప్రేమను చంపుకోక పెండ్లికి ఒప్పుకుంటాను నీ సంగతి చెప్పు ?"

సమయం వచ్చినప్పుడు నేనే మీదగ్గరకు వచ్చి చెప్తా అంతవరకు మీస్నేహాన్ని నేనెంతో గౌరవిస్తాను అన్నట్లు కృష్ణగారు ! నాకెంతో ఆకలిగ ఉంది ఆ కత్తిపీట ఇలాఇస్తారు గబగబా కూరలు తరిగి వంటచేసుకుంటాను. మీకేం మహారాజులు టిఫిన్ చేసివచ్చినట్లున్నారు ఎన్ని కబుర్లయినా చెప్తారు "

"అయితే నీకు వంటలో ఏమైన సహాయం చెయ్యమన్నావా ?"

"వంట సంగతి మీకేంతెల్సు "

"చూడు నీరజ నా సంగతి నీకు తెలియదు మా అమ్మనడుగు చెప్తుంది చింతపండు మగ్గతీసిస్తా. మిరపకాయలు చిక్కుతా. బియ్యంలో రాళ్ళు ఏరగలను మజ్జిగ చిలకగలను పోపుకు సామాన్లు సిద్ధం చేయగలను అన్నట్లు మరచే బోర్నవిట కలపగలను "

"వండర్‌ఫుల్–నాకిప్పుడు ఏమి సహాయం చేయనవసరం లేదుగాని నాదో రిక్వెస్టు "

"చెప్పు–హిమాలయపర్వతాలెక్కి తులసిమొక్క తేమంటావా ?"

"హిమాలయాలపైన తులసి మొక్కలుంటాయా ? ఇంతకీ పెరట్లో దొరకే తులసికోసం కొండలు ఎక్కనవసరంలేదుగాని మీరు ఇవాళ నా ఇంట్లో భోజనంచేయాలి "

"సారి నీరజ ! మరోనాడు తప్పక నీ చేతి భోజనం ఆరగిస్తా. ఇవాళ మా ఇంటికి మామేనమామ వచ్చేడు. అతనితో కలిసి భోజనం చేయాలి లేకపోతే అతను బాధపడతాడు "

"అంతేకాదు తన కూతుర్నిచ్చి పెండ్లి చేయరూ."

**జరిగిన కథ–3:** నీరజ తండ్రి పురుషోత్తం తల్లి పాము కాటుకు గురై మరణిస్తుంది నీరజ ఇంటర్ వరకు చదివి ఆపైన స్తోమత లేక ఆపేసింది వున్న ఒక్క అన్నా మిలటరీలో చేరిపోతాడు తండ్రి చేస్తున్న స్కూలు టీచరు ఉద్యోగంలోంచి రిటైరవుతాడు నీరజకు వచ్చిన సంబంధాల్లో తండ్రికి నచ్చక కొన్ని జాతకాలు కలవక ఒకటి తప్పిపోతాయి చివరకి దూరపు బంధువొకాయన సహాయంతో ఓ రెండో పెళ్లివాడితో నీరజ పెళ్లి చేయటానికి నిశ్చయించుకొంటాడు ఆమె తండ్రి. నీరజ పెళ్లి మోహన్ రావ్‌తో జరిగిపోతుంది. ఆ తర్వాత ఆమె తండ్రి మరణిస్తాడు. ఎంతో ఉత్తముడు అనుకొన్న తన భర్తకు లేని వ్యసనమంటూ లేదని, తన అత్త ఆడేదంతా నాటకమని తెలుసుకొంటుంది నీరజ

“భలేదానివి. అతని ముగ్గురు కూతుర్లు పెండ్లి అయిపోయి ముగ్గురేసి పిల్లల్ని కనేసారు. అందుకే నీవెంటపడ్డా.”

“బాబ్బాబు! బుద్ధితక్కువై మళ్ళీ పెండ్లి సంగతి ఎత్తేను. మళ్ళీ కథ మొదటికి తేవద్దు

మీరు బుద్ధిగ అలా కుర్చీలో కూర్చోండి నేను త్వరగ వంట చేసుకుంటాను”

“మాట్లాడకుండ అలా కూర్చోడం నాచేత కాదు అయ్యబాబోయ్!”

“ఏమయ్యింది?” నీరజ ఆశ్చర్యపోయింది అతడి ఆశ్చర్యాన్ని చూసి.

“మీ ఫ్రెండ్ నర్సు కాంతం వస్తూంది నన్ను చూసిందంటే మరింత గాభరాపడిపోయి చెప్పదల్చు కున్నది చెప్పలేకపోతుంది. మరి నే వెళ్ళొస్తా”

“మీ ఇష్టం”

ఈలోగా నర్సు కాంతం ఇంట్లోకొచ్చింది.

“నమస్కారం డాక్టరుగారు.”

“నమస్తే సిస్టర్,” అని మెల్లగ వెళ్ళిపోయేడు.

## 6

“ఏమిటి కాంతం—ఇలా వచ్చేవు?”

“మరేంలేదు నీరజ, నువ్వు నాకో ఉపకారం చెయ్యాలి. చూడు నాకు నీతో ఉన్న స్నేహం, చనువు మిగతా నర్సులతో లేవు అదేమో గాని నువ్వంటే నాకెంతో అభిమానం. నువ్వు నా చెల్లెలివి అనుకొంటున్నాను”

నీరజ సన్నగ నవ్వేసింది.

“చూడు నా పెద్దక్కా—ముందు ఆ ముఖానికి పట్టిన చెమట తుడుచుకుని అలా కుర్చీలో కూర్చో. ఒక కప్పు కాఫీ ఇద్దునా?”

“కాఫీ ఒద్దుకాని నాకో ఉపకారం చెయ్యి చాలు.”

“అదేమిటో చెప్పకపోతే ఎలా?”

“చెప్తా ఇద్దరు నర్సులు ప్రొద్దున్న డ్యూటీకి వచ్చేరు. మరో నర్సు మాణిక్యాంబగారి దగ్గరుం టుంది. ఇక మిగిలినవారు నువ్వు, సుశీల. సుశీల సంగతి తెల్సుకదా అదో తరహా మనిషి ముఖ్యంగ ఆ మెటర్నిటి వార్డు వదలి జనరల్‌వార్డుకి రావడ మంటే గింజాకుంటుంది.”









"ఎందుకు తల్లీ ఈ ఉపోద్ఘాతమంతా—అసలు గతి చెప్పరాదూ ?"

"చెప్తా – చెప్తా – పెద్దడాక్టరుగారి సంగతి ၊ తెలుసుకదా ఒకవేళ అడిగినా మీలో మీరు ్టు చేసుకోండి – నేనేమి సర్దుబాటుచేయలేను టారు"

నీరజ తన వంట తను చేసుకుంటూంది తం కూర్చోక నీరజ వెనుక ఇటు అటు తిరుగుతు ్రకుపోతూంది దాని ధోరణి దానిది మరి తాన్ని అసలు సంగతి అడిగి ప్రయోజనం లేదని ్టమొచ్చినట్లు చెప్పకపోనీమని నీరజ ఊ ్టడం తప్ప ఎదురు ప్రశ్న వేయడం మానుకుంది

"నీరజ ! నా మాట కాదనవని మాటివ్వు"

"సరే – మాటిచ్చేను చెప్పు"

"అసలు సంగతి నేను పెద్దడాక్టరుగార్ని శలవు గేననుకో యక్ష ప్రశ్నలడుగుతారు ప్రయివేటు ్రంగ్ హోమ్‌లో ఉన్న చికాకులు ఇవి అదే గవర్న ుటు హాస్పిటలయితే శలవు చీటీ రాసి ఎవరి న్నైన హాస్పిటల్‌కి పంపించేస్తే సరిపోతుంది ్డలా కాదు నేను పెద్ద డాక్టరుగారు వేసే ్నలకు జవాబు చెప్పలేను– ఎందుకంటే"

నీరజ చేతిలోని గరిటను గిన్నెలో పెట్టి ఇటు ౯ కాంతం ముఖంలోకి చూచింది

"అలా చూడకే–నాకు సిగ్గు వేస్తుంది"

"చూడనులే – చెప్పు"

"నాకు పెండ్లి చూపులే," సిగ్గు పడుతు ్ల దించుకుని చెప్పింది

"వెరీగుడ్" అని అమాంతంగ కాంతాన్ని లించుకుంది ఆనందంతో

"విష్ యు ఆల్ ది లక్"

"థాంక్సు నీరజ"

"అవును నీ డ్యూటి రాత్రి కదా– పెండ్లి పులయేక డ్యూటికి పోవచ్చుగ మరి శలవెందుకు?"

"అక్కడే ఉంది తిరకాసంత నా పెండ్లి పులు ఈ ఊరిలో కాదు విజయనగరంలో రేపు ్దన్న పది గంటలకు మా చిన్నాన్న గారింట్లో ్డికొడుకు బంధువులు ఆ ఊరిలో ఉన్నారు ుకే అతడు భిలాయి నుండి సరాసరి విజయనగరం ్నన్నాడు అక్కడ పెండ్లి చూపులయేక మళ్ళీ



## జీవిత సమరం

రాత్రి బండికి వెళ్ళిపోతాడట అందుకే మా చిన్నాన్న విజయనగరం రమ్మన్నాడు"

"పెండ్లి కొడుకు భిలాయిలో పని చేస్తున్నాడా ?"

"అవును – బి కాం పాసయేడు భిలాయి ఫ్యాక్టరిలో స్టోరుకీపరుగ పని చేస్తున్నాడు"

"అదృష్టంతురాలవే"

"అప్పుడే అనేయకు అతడు నన్ను నచ్చాలి, నేను అతడ్ని నచ్చుకోవాలి, కట్నకానుకల బేరం కుదరాలి"

"ఏమో నా మనస్సు చెప్పతూంది ఈ సంబంధం కుదురుతుందని"

"చాల థ్యాంక్సు నీరజ అసలు సంగతి చెప్పనే లేదు"

"చెప్పు మరి"

"నేను మధ్యాహ్నం బస్సులో విజయనగరం వెళ్తున్నాను అందుకే నేను ఇవాళ రాత్రి డ్యూటీ చెయ్యలేను రేపు రాత్రి డ్యూటీకి వస్తాను నువ్వు దయచేసి నా డ్యూటీ కూడ నీ డ్యూటీ తరువాత చెయ్యాలి – ఏం చేయగలవా ?"

"కాంతం నువ్వు కోరుతున్నప్పుడు నేను కాదన గలనా అలాగే చేస్తాను"

"చాల థ్యాంక్సు నీరజ !" అని మీద పడబో యింది

"నన్నేమి కౌగలించుకోకు ఇప్పుడే పచ్చడికల్పిన చేతులు, ఈ చీరకు కాస్త చింతపండు అంటిఉంది ఈ వంటి వాసనలన్ని నీకు అంటుతాయి నీ చాకింటి చీర పాడవుతుంది జాగ్రత్త"

"నే నిప్పుడే వెళ్ళి పెద్ద డాక్టరుగారితో చెప్పి అతని పెర్మిషను తీసుకుని పోతాను చాలా థాంక్స్ నీరజ"

"ఆ ఉండుండు కాస్సేపు నిన్నను ఆ ఫైర్ ఏక్సిడెంటు భార్యాభర్తలు ఎలాగున్నారు?"

"ఆ వసుమతి నిన్న రాత్రి చనిపోతుంది అను కున్నాను రాత్రంత ఒంటిమీద తెలివిలేకపోయిన పాపం అలా బాధతో మూలుగుతూనే వుంది నేను రౌండ్లు తిరిగి సుమారు రెండు గంటల రాత్రికి తిరిగి వచ్చేసరికి కండ్లు మూసుకునే సన్నగ గొణిగింది– 'నాకు చావాలని లేదు– నన్ను బ్రతక నీయండి,' అని పాపం ఆమె పరిస్థితికి ఆమె బాధా కరమైన ఆ మాటలకు నా కెందుకో కండ్లనీరు చిమ్మిందంటే నమ్ము నీరజ !"

నీరజ బాధతో అలా గోడకు ఆనుకుని నిల్చుండి పోయింది

"చనిపోలేదుగాని ఈ రాత్రి గడపగలదు అనుకోను నువ్వు మరోలాగనుకోకు గాని నా కేమని పిస్తుందంటే ఆమె చనిపోవడమే మంచిది అంతగ కాలిన శరీరంతో బ్రతికినా చాలా బాధలుంటాయి అదో నరకమే"

నీరజ ఏదో ఆలోచిస్తు అన్నాది–

"అవును ఆమె చనిపోవడమే మంచిది మరి ఆ బాబ్జి ఎలాగున్నాడు ?"

"అతడికి తెల్లవారుఝామున తెలివి వచ్చింది నన్ను పిలిచేడు 'సిస్టర్ నా భార్య ఎలాగుంది ? బ్రతుకుతుందా?' అని అడిగేడు చాల ఆందో ళనతో"

"బ్రతికే ఉంది," అన్నా

"అలాగా అయితే నేను ఆవిడతో మాట్లాడ వచ్చా" అన్నాడు

"ఆవిడకు ఒంటిమీద స్పృహలేదు తెలివి వచ్చేక మాట్లాడవచ్చు–" అన్నా కాస్సేపు ఆలో చించి– 'సిస్టర్ ! ఆవిడ బ్రతుకుతుందా?' అని అడిగేడు 'బ్రతికే ఆశలేదు,' అన్నా – నిట్టూర్పు విడిచి కర్ళు మూసుకుని పడుకున్నాడు ఇవాళ ప్రొద్దున్న నేను డ్యూటీ అయిపోయి వచ్చేస్తుంటే మళ్ళీ పిలచేడు మంచం దగ్గరకు వెళ్ళాను– 'సిస్టర్ ! నన్నెప్పుడు రిలీవ్ చేస్తారు హాస్పిటల్ నుండి ?' 'మరో రెండు రోజులు పడ్తాయి ఆ కాలిన జాగాలకు మందు రాస్తునే ఉండాలి ఇంజక్షన్సు ఇవ్వాలి కాంప్లికేషన్సు రాకుండ చూసు కోవాలి లేకపోతే ఇప్పుడు బాగున్న చర్మం కూడ పాడవచ్చు' అన్నా అతడి ముఖంలో భయం స్ఫురిం చింది అంతే నీరజా నేను వెళ్తామరి"

నీరజ అలా కాసేపు అలా ఆలోచిస్తూ ఉండి పోయింది

నీరజ వంటపూర్తయ్యేక భోజనంచేసి నవల చదువుతూ అలా పడుక్కుంది

మధ్యాహ్నం మూడు గంటలయేసరికి నీటుగా

ముస్తాబై డ్యూటీకి వచ్చింది నీరజ అయిదు నిముషాలకు డాక్టరు కృష్ణ, నర్సు సుశీల డ్యూటీకి వచ్చేరు పెద్ద డాక్టరుగారి దగ్గరకు వెళ్ళేరు అతడితో మధ్యాహ్నం నాలుగున్నరకు అన్ని వార్డులలోకి రౌండ్సుకు వెళ్ళేరు ఆసరికి బాబ్జి మేలుకునే ఉన్నాడు వార్డు ఫినాయిలుతో కడగడంవల్ల ఘాటు వాసన వస్తూంది ఆఘాటువాసన నీరజకు పడదు ఒ గంట గడుస్తే ఆవాసన ఘాటితగ్గిపోతుంది వార్డులలో ఫేనులు జోరుగానే తిరుగుతున్నాయి ఆ వాసనకు నీరజ రుమాలును తీసి ము క్కు కు మూతికి అడ్డగపెట్టుకుంది తలమీద తెల్లనిస్కార్ఫ తెల్లనిచీర, ముఖానికి మధ్యన తెల్లని రుమాలు, ఆమె కండ్లుమాత్రము మిలమిల మెరుస్తున్నాయి ఆమె నుదిటమీద ఎడంప్రక్కన సన్నటి గంటుమచ్చ

"మిష్టర్ బాబ్జి! హౌడుయుఫీల్ ?" అని పెద్దడాక్టరు మధుసూదనరావు గారు అడిగేరు .

పెద్దడాక్టరు వెనకాల డాక్టరుకృష్ణ, డాక్టరు సారధి, నర్సు సుశీల, నర్సు నీరజ తెల్లకాగితాల పేడు బాల్‌పాయింట్ పెన్నులతో నించున్నారు అవసర మైతే డాక్టరుకు అందివ్వడానికి

" ఈ చేతులు చాలా బాధపెడుతున్నాయి డాక్టరుగారు నొప్పి, మంట ముఖ్యంగ రాత్రి ఎలా గడపడమా అన్నదే నాభయం నిన్నరాత్రి తెల్లవారు ఝూము ముందరే తెలివివచ్చింది అప్పటినుంచి ఈ బాధను భరించలేక చాల కష్టపడ్డాను "

"సరే—డోంట్ వర్రీ డాక్టరు కృష్ణగారు! రాత్రి తొమ్మిది గంటలకు ఒక మార్ఫిను ఇంజక్షను ఇవ్వండి సాయంత్రం ఒక పెన్సిలిన్ ఇవ్వండి మందు మళ్ళీ ఎప్పుడు రాసేరు ?"

"మధ్యాహ్నం రెండు గంటలకు కాలిన స్థల మంతా మందు రాసేరు సార్!"

"గుడ్! మిస్టర్ బాబ్జి మీరేమి గాభరాపడకండి మీకు బాధ తెలియకండ రాత్రంత నిద్రపోతారు రెండు రోజులు పోతే అంత బాధుండదు "

"డాక్టరుగారు! నా భార్య వసుమతికి ఫరవా లేదా ? ఆమెకేమి ప్రాణాపాయం లేదుకదా," చాల ఆందోళనతో అడిగేడు

"మేము ఆమెను బ్రతికించడానికే ప్రయత్ని స్తున్నాము తరువాత భగవంతుడిదయ మీరు ఆమెను మంటలనుండి రక్షించడానికి చాల ప్రయత్నిం చేరుట "

"అవునండి—ఆమెతోబాటు నేను పూర్తిగ కాలి పోయినా బాగుండును ఇద్దరం కలిసే చనిపోదుము "

"గుడ్! ఐఎప్రిషియేటుయువర్ లవ్‌ఫర్‌హెర్ మీరు చింతించకండి వుయి విల్‌డు అవర్ బెస్టు."

డాక్టరుగారు పక్క బెడ్డుమీదున్న పేషంటు దగ్గరకు నడచేరు అందరి పేషంట్లను అలా చూస్తు వసుమతి బెడ్ వద్దకు వచ్చేడు

"ఈమెకు పెన్సిలిన్ ఎయిటి లాక్సు మరో ఇంజక్షను ఇవ్వండి మిల్కులో హార్లిక్స్ కలిపి ఫీడింగ్ అయేక మళ్ళి సెడేషనులోనే ఉంచండి లేకపోతేబాధను తట్టుకోలేక కొలాప్స్ అవొచ్చు బట్ విత్ ఎ కవరేజ్ ఆఫ్ సిక్స్టీ పెర్‌సెంట్ బర్న్సు ఇట్ ఈజ్ డిఫికల్ట్ ఫర్ హెర్ టు సర్‌వైవ్ కాని. ప్రయత్నించి చూద్దాం నర్స్ నీరజ ఈమెను దృష్టిలో ఉంచుకోండి ఒకవేళ రాత్రి మెలకు వచ్చి ఏమైన స్టేట్‌మెంటు ఇస్తే రికార చేసుకోండి డాక్టరు కృష్ణ ఇట్ ఈజ్ బెట ఇఫ్ యు రికార్డు ఇట్ ఇన్ ది ప్రెసెన్సు ఆఫ్ పోలీస్ ఇన్స్‌పెక్టర్ అన్నట్లు అతడి స్టేట్‌మెంట తీసుకున్నారా ?"

"ప్రొద్దున్న పదిగంటలకు పోలీస్ ఇన్స్‌పెక్టర రామరాజుగారొచ్చి బాబ్జిగారి స్టేటుమెంటుని డాక్ట మురళి సమక్షంలో రికార్డు చేసుకున్నారుట అతడ వెళ్ళిపోతూ నాకు చెప్పేడు. ఆ సరికి మీరు ఏద అర్జంటు కేసుపైన పక్కగ్రామం వెళ్ళేరు "

"ఓ కె "

రౌండ్సు అయేక ఎవరి వార్డులలోకి వాళ పోయేరు సాయంత్రం నాలుగుగంటలకు ఆ పెద్దావి ఇన్ని బిస్కట్లు, కాఫీ తీసుకునివచ్చింది నీర దూరంగ వార్డులో ఉంది ఎవరికో మందులిస్తు పెద్దావిడ రాగానే డాక్టరుని అడిగింది

"డాక్టరుగారు — మా కోడలు వసుమతి ఎ గుందండి ?"

"స్థితిలో మార్పేమిలేదండి ఇంకా పూర్తి తెలివిరాలేదు "

"బ్రతుకుతుందంటారా ?"

"ఏమి చెప్పలేం — ఆ అమ్మాయి బాగాకా పోయింది ముఖంకూడ కాలిపోయుంటే నిన్న చనిపోయేది భగవంతుడి దయవల్ల ముఖం కాలలేదు మేం శాయశక్తులా ప్రయత్నిస్తున్నాము ఆ తరువాత ఆమె అదృష్టం కూడ కలసిరావాలి

"ఏమదృష్టమో — ఒళ్ళల్లా కాలి కురు

ఽయింది బ్రతుకుతే జీవితమంతా బాధపడాలి ఽంతే – అంతా ఆ భగవంతుడి దయ !" అని గార్డులోని ఆ కొడుకు దగ్గరకు వెళ్ళింది ఆ కోడలు ౹ స్థితిలో ఉందో చూడడానికి కూడ ఆసక్తి చూపలేదు

"బాబ్జీ ! ఎలాగుందిరా నాయనా ?"

"ఒంట్లో బాగానే ఉంది కాని ఈ చేతులు ాగా కాలడంవల్ల చాల బాధ, మంటగ ఉంది"

"డాక్టరుగారు ఏమన్నారు – ఎన్నాళ్ళకు ంయమవుతాయన్నారు ?"

"హాస్పిటల్‌లో మరో నాల్గురోజులుంటే ాలన్నారు మరే కాంప్లికేషన్సు రాకుండా చూసుకుని ంపిస్తామన్నారు."

"ఒరే వసుమతి బ్రతికేటట్టు లేదురా"

"ఎవరన్నారు ?"

"ఇప్పుడే డాక్టర్ను అడిగేను"

"పాపం ! ఇంత చిన్న వయస్సులోనే మీకు చాల పమాదం జరిగింది," అని ఒదార్పుగ అన్నాడు పక్క ఁడ్‌లోనున్న మరో పేషెంటు.

తల్లి, కొడుకు అతడి వైపు చూచేరు మరేం వాబు చెప్పలేదు వాళ్ళ సంభాషణ అందుకోక 'వడం వల్ల ఆ పేషెంటు ఉత్సాహం నశించింది.

"సిస్టరు !" అని నీరజను పిలచేరు

ముఖం రుమాలుతో తుడుచుకుంటు వచ్చింది ఃకావాలన్నట్లు చూస్తు

"మా అబ్బాయింకా రాలేదు బహూశా ఏదైన ిపడి ఉండిపోవచ్చు దయచేసి వార్డు బాయ్‌ని ంపి ఓ కప్పు కాఫీ తెప్పిస్తారా ?"

"సరే" అని తిరిగి వెళ్ళబోయింది

ఆమెను జాగ్రత్తగ చూస్తున్న బాబ్జీ – ిస్టర్ !" అని పిలచేడు.

"ఏం ?"

"సిస్టర్— మీ పేరు ?"

"నా పేరు లక్ష్మి— పూర్తి పేరు ఎస్. ఎన్ ఓ్మ," అని గంభీరంగ చెప్పింది.

"అమ్మాయి ! నీ నుదిటి మీద ఆ గంటేమిటి?" ౹ పెద్దావిడ అడిగింది

"అదాండి— అది నా ఏడవ ఏట ఓ పెద్ద ుప్పైతే ఆపరేషను చేసేరు. ఆ గంటు అలా ఃడిపోయింది. ఇంకా ఏమైన వివరాలు కావాలండి?"

# జీవిత సమరం

"అది కాదమ్మ కోపం తెచ్చుకోకు మాకు తెల్సిన ఒకామె నీలా కాస్త స్ఫురిస్తే అడిగేము — మరోలాగనుకోకు"

"అదిసరే – ఆరు కావచ్చింది మీరు వార్డు లోంచి వెళ్ళిపోవాలి మీరు మళ్ళీ రేప్రొద్దున్న ఎనిమిది గంటలకు రావచ్చు ఇదీ ఈ హాస్పిటల్ రూల్ — మరోలాగనుకోకండి," అని చెప్పేసి స్త్రీల వార్డు లోకి చకచకా నడుచుకుంటూ వెళ్ళిపోయింది

బాబ్జీ తువ్వాలుతో మెల్లగ ముఖం తుడుచు కున్నాడు చమట కాస్త పట్టగ ఆ తల్లి కొడుకుని చూసింది

"ఆ అమ్మాయి కాదురా – గొంతుక మారింది, ఆ నడక వేరు"

"ఏదో ఆ చూపు అలాగే ఉంటే అనుమానం కల్గింది"

"భయం లేదురా అదెక్కడ— ఈ చకచకలాడే నర్సెక్కడ. ఏదో కాస్త మనిషిని పోలిన మనుష్యు లుండొచ్చు టైమయింది నేను వెళ్తా, రేపొస్తా"

పెద్దావిడ వార్డులోంచి వెళ్లిపోవడం నీరజ గమనించింది నీరజకు వాళ్ళ అధిక ప్రసంగం చాల కోపాన్ని కల్గించింది

రాత్రి ఎనిమిది గంటలకు పేషంట్సుకు రొట్టి, పాలు వార్డు బాయ్‌సు వచ్చి ఇచ్చిపోయేరు రాత్రి కాగానే బాబ్జీ కాలిన స్థలాలు నొప్పి, మంట ఎక్కువ కాగానే బాధతో కాస్త మూలగడం మొదలు పెట్టేడు డాక్టరు కృష్ణ వచ్చి నిద్రకు ఓ మార్ఫిన్ ఇంజక్షను ఇచ్చిపోయేడు

వసుమతికి కూడా ఓ ఇంజక్షను ఇవ్వబోతుంటే నీరజ వారించింది.

"డాక్టరుగారు! ఇంజక్షను వద్దండి ఎలాగో కష్టంమీద పాలు పట్టేను ఆమె స్థితి, ఆమెపల్సు ఆమె బాధ చూస్తుంటే ఈ రాత్రి ఆమెకు గడు స్తుందని అనుకోను పరీక్షించి మీరే చెప్పండి"

డాక్టరు కృష్ణ నీరజ ముఖంలోకి దీక్షగా చూసి, పేషంటు వద్దకు వెళ్ళి వసుమతిని పరీక్షించేడు

"అవును నీరజ ఆమె బ్రతికేటట్లు లేదు మహా అయితే మరో ఆరు గంటలు బ్రతకొచ్చు"

"చూడండి డాక్టరు ! ఇలా రండి మీతో మాట్లాడాలి," అని డాక్టరు వెంట రాగా వార్డు ప్రక్కనున్న నర్సుల, డాక్టర్ల రూములోకి తీసుకుని వెళ్ళింది

"డాక్టరుగారు! నాకో ఉపకారం చేయగలరా ?"

"చెప్పు— తప్పకుండా చేస్తాను"

"నేనివాళ కాంతం డ్యూటీకూడా చేస్తున్నాను– అంటే ఈ రాత్రంత ఇక్కడ డ్యూటీలో ఉంటాను మీరు నాతోబాటు ఈ రాత్రంత ఇక్కడ డ్యూటీ చేయగలరా ?"

కాస్సేపు డాక్టరు ఆలోచించేడు

"అయితే నేను తొమ్మిదిగంటలకు ఇంటికి భోజనానికి వెళ్ళినప్పుడు పెద్ద డాక్టరుకి చెప్తాను ఈ పేషంటు వసుమతి పరిస్థితి ఏమీ బాగులేదని అందుచేత ఈ రాత్రంత డ్యూటీ చేస్తానని చెప్పి వస్తాను – సరేనా ?"

"మీరు మరో పనిచేయాలి మీ దగ్గర టేపు రికార్డరు, మైకు ఉంది కదు ? ఎప్పుడో మీరు పాటల్ని రికార్డు చేసినట్లు చెప్పేరు."

"అవును ఉన్నాయి – తెమ్మన్నావా ?"

"అది బ్యాటరి ఆపరేటడ్ రికార్డరేనా ?"

"అవును మొన్ననే కొత్త సెల్సు కూడ వేయించేను."

"గుడ్ – ఆ రికార్డర్‌తో ఓ కొత్త టేపు కావాలి."

"అలాగే అన్నీ తెస్తాగాని ఏమిటి విశేషం ? ఆమె ఏమైన స్టేట్‌మెంటిస్తే రికార్డు చేద్దా మనుకుంటున్నావా ?"

"అవును ఆమె స్టేట్‌మెంటులో కొన్ని ఆఘాయిత్యాలు బయటపడగలవని అనుకుం టున్నాను."

"అదేమి – అలా అంటున్నావు ? వాళ్ళిద్దరు అనుకూల, అనురాగ దంపతులని ఆ తల్లి చెప్పింది కదా !"

"సరే అదీ చూద్దాం – అదే కోడలు చెప్పిందీ విందాం"

"సరే – నీ ఇష్టమే కానియ్యి"

(ఇంకా ఉంది)






# సులభముగా ఇంగ్లీషు మాట్లాడుటకు




## బాలాజీస్ ఈసీ వే టు స్పీక్ ఇంగ్లీష్

బడిలో చదువుకునే విద్యార్థినీ, విద్యార్థులకు, ఇంగ్లీషు చదివికూడా వ్యాకరణ సంశయము గలవారికి, వ్యాకరణ లోపములు లేకుండా సరళముగా ఇంగ్లీషు మాట్లాడుటకు, వ్రాయుటకు, నేర్పించుటకు ఉపకరించే పుస్తకం!

ఉద్యోగులు, వ్యాపారస్థులు, ఇంగ్లీషులో ఎక్కువ పరిజ్ఞానము లేనివారికి, తెలుగుద్వారానే వ్యాకరణబద్ధంగా ఇంగ్లీషు నేర్చుకొనుటకు ఇది ఒక మంచి సాధనము!

ఈ పుస్తకం చదవడం ప్రారంభించగానే మీతోబాటుగా ఒక ఉపాధ్యాయుడు తోడున్నట్లే భావించగలరు!

*మీ ఊరిలోని అన్ని బుక్‌షాపుల లోను లభిస్తుంది. వెల రూ 19-50*

*వివరములకు*

**బాలాజీ పబ్లికేషన్స్**

103 పైక్రాఫ్ట్సురోడ్ మద్రాసు 600 014



**BALAJI PUBLICATIONS**
103, PYCROFTS ROAD
MADRAS-600 014

devi ads m/s 13

BELOVED BEST SELLER ON THE SCREEN





Bhaskar



క్రియేటివ్ కమర్షియల్స్

యండమూరి వీరేంద్రనాథ్

# అభిలాష

ఎ.కోదండరామిరెడ్డి  కె.యస్.రామారావు

ఇళయరాజా లోకేసింగ్

లక్ష్మీఫిలింస్

నైజాం: శ్రీ వెంకటకృష్ణ ఫిలింస్  సీడెడ్. వి.యం.సి

**Statement about ownership and other particulars about Newspaper**

## ANDHRA SACHITRA VARA PATRIKA

**FORM IV (See Rule 8)**

1. Place of Publication: VIJAYAWADA
2. Periodicity of its Publication: WEEKLY
3. Printer's Name: S. Nageswara Rao
   Whether citizen of India: Yes
   Address. 1, Luz Avenue, Mylapore, Madras-600004
4. Publisher's Name S. Nageswara Rao
   Whether citizen of India. Yes
   Address. 1, Luz Avenue, Mylapore, Madras.600004
5. Editor's Name S. Radhakrishna
   Whether citizen of India: Yes
   Address: 14-14-21, Mallikharjuna Rao St Gandhinagar, Vijayawada.520003.
6. Names and addresses of individuals who own the news. paper and partners or share-holders holding more than one percent of the total capital.
   1. Name: S. Kamakshamma
      Address: 1 Luz Avenue, Mylapore, Madras-600004
   2. Name S. Radhakrishna
      Address' 14-14-21, Mallikharjuna Rao St, Gandhinagar, Vijayawada.520003.
   3. Name. S. Nageswara Rao,
      Address 1, Luz Avenue, Mylapore, Madras-600 004
   4. Name. S. Rajeswari
      Address' 14-14-21, Mallikharjuna Rao St, Gandhinagar, Vijayawada.520003.
   5. Name: S. Seshamma
      Address: 1, Luz Avenue Mylapore, Madras-600004
   6. Name S. Sreeramamurty, Trustee, Kasinadhuni Nageswara Rao, Sivalenka Sambhu Prasad Dharma Nidhi
      Address. 42-45. Luz Church Road, Madras-600004
   7. Name: S. Ramayamma
      Address: 1 Luz Avenue, Mylapore, Madras-600004
   8. Name: P. Satyanarayana
      183/184. Rashtrapathi Road, Secunderabad.
   9. Name. D. Subba Rao
      Address. 1, Luz Avenue, Mylapore, Madras-600004

I, S. Nageswara Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**S. NAGESWARA RAO,**
Signature of Publisher.

1—3—1983




***ఎస్. ఆర్. వి – అనంతపురం***

మాదో పెద్ద సంసారం అందులో నల్గురు పెద్ద మనుషులు ఇంకా ఎన్నో పాత్రలు ఒకే సంసారంలో ఉన్నారు అందరి మనస్తత్వాలు తెలుపు తాను దానికి మీరు కథ రాస్తారా ?

★ నాకు కొంపలు కూల్చే కథలు రాయడం అలవాటులేదు జీవిత సంఘటనలని ఉత్తేజంగా వాడతానేగాని యథావిధిని దింపి ప్రాణాలతో చెలగాట మాడటం అలవాటు లేదు అయినా– ఎందరో మనసులు విప్పి మంచి చెడు చెప్పుకుంటారు, ఆత్మీయులని చెప్పుకుంటారేగాని– వీధికెక్కిస్తారని చెప్పుకోరు ఓదార్పుకోసమో భారం దించుకుందు కోసమో వెలిబుచ్చిన బాధలు వ్యధలు– నాకు కథలని పించవు యిలాంటి పిచ్చిప్రశ్నలు అడక్కండి

***బి వి. బి వి ఆర్ – బెళ్గలి***

ఈ మధ్య శ్రీరంగం శ్రీనివాసరావుగారు తానే ఆధునిక సాహిత్యానికి పిత నని తమ అనుయాయులతో సహా అనుకుంటున్నారు తాను యుగకర్తనని కూడా అంటున్నట్టు వింటున్నాము

★ ఎవరి భజన కూటాలు వారికి వుంటే – ఇదే సుఖం తమ తమ పొగడ్తలకి పైవారిపై ఆధారపడక్కరలేదు రావుగారూ !

***సిహెచ్ ఆర్ - సిర్పూర్ కాగజ్ నగర్***

అమ్మాయి వీధిన వెడుతుంటే ప్రతివాడు ఏదో మాట లంటారు ఆ సమయంలో వారి తోడ బుట్టిన వాళ్ళు జ్ఞాపకం రారా?

★ ఎందుకు రారు వస్తారు 'వాళ్ళనీ ఏ వెధవాయో యిలాగే అంటూంటాడ'ని అను కుంటారు ! 'తన' 'పర' విషయం వచ్చేసరికి మనిషి ప్రవర్తన చాలా గమ్మత్తుగా వుంటుంది

***టి. ఎస్. – తిరుపతి***

. ఇలా పరాయి ఆడదాన్నిస్మరిస్తూ భార్యలతో కోరికలు తీర్చుకునేవిధం రాయడంలో చిట్టారెడ్డి గారికి కలిగే ఆనందం ఎటువంటిది ? ఇద్దరు హీరోయిన్ల మధ్య హీరో శృంగారాన్ని కథలలో మలిచి చెప్పడం కాదు అవి ఆడవాళ్ల జీవితాలని ఎలా మార్చేస్తాయో చూపించాలి మగాళ్ళ పరాయి ఆడదాని జోలికి వెళ్లనీకుండా చేసే కథలేవీ మనవాళ్ళ రాయలేరంటారా ?

★ వ్రాయకలరు – అవి పాషనయితే !! సర్వ సాధారణంగా పత్రికలు 'యు' సర్టిఫికేట్‌కి తగి వుండాలి – ఎందుకంటే నట్టింట్లో పడేస్తే – నల్గురూ చూస్తారుకనుక కాని ఈమధ్య ఈరూలు ఎక్కువగా అతిక్రమించడంలోనే – అమలులో వుంటూంది. ఏం చేస్తాం ? ★

# ఎండమావి



యస్.వెంకట్ ప్రసాద్

''రోజూ యింత అవుతోంది ఆఫీసునించి వచ్చే సరికి? ఎంత పనివుంటే మాత్రం, ఇంటి దగ్గిర నీ కోసం ఎదురుచూసే ఓ తల్లి, చెల్లెలు వున్నారని గుర్తుంచుకోనక్కర్లేదా?'' సరస్వతి కొడుకుని మందలిస్తూ, అతను విడిచిన చొక్కాని అందుకుని గదిలో ఓ మూలగా వున్న క్లాత్ స్టాండ్‌కి తగిలించింది

''అబ్బ! రోజూ వుండేదే కదా యిది!'' అన్నాడు రాజు, విసుగుని దాస్తూ

''నువ్వు యింటికి పెందరాడ వచ్చేవరకు, రోజూ యిలా అడుగుతూనే వుంటా'' అంది సరస్వతి, మళ్ళీ మందలింపుగా

''ఆఫీస్‌లోనే ఏడు, ఎనిమిది అవుతుంటుంది తర్వాత స్నేహితులతో అలా హోటల్‌కి వెళ్ళి, ఓ కాఫీతాగి, యింత దూరం వచ్చేసరికి ఈ టైమ్ అవుతుంది నువ్విలా అడిగినప్పుడల్లా నేనిలా చెప్తూనేవున్నాను నువ్వు మళ్ళీ అదేపాట పాడతావు!''

''సరే నీతో నాకెందుక్కాని త్వరగా కాళ్ళు కడుక్కురా, భోజనం చేద్దువుగాని,'' అంటూ వంట గదిలోకి నడిచింది సరస్వతి

ప్రక్క గదిలోకి వెళ్ళి నిద్రపోతున్న చెల్లెలి వంక ఓ క్షణం చూసి, బాత్‌రూమ్‌లోకి నడిచాడు రాజు

* * *

రాజు భోజనం ముగించి, ఆ రోజు న్యూస్ పేపర్ తీసికొని గదిలోకి నడిచాడు అతడు తిన్న కంచంతీసి, వంటగదిని శుభ్రంచేసి వరండాలో కొచ్చింది సరస్వతి

ఓ వంటగది, దానికి ముందు ఒక చిన్నహాలు, దానిప్రక్కన హాలుకంటె కొంచెం పెద్దగది, ముందు చిన్నవరండా వుంటే అది ఆ యిల్లవుతుంది హైదరాబాద్‌కి పది కిలోమీటర్ల దూరంలో పట్నం వాసనగల ఓ పల్లెకాని పల్లె అది అక్కడ ఆ యింటి అద్దె వందరూపాయలు అద్దె తక్కువగా యిస్తూ నగరానికి కొంచెం దూరంగా, ప్రశాంతం వుండాలనుకునేవాళ్ళు, కొంచెం తక్కువలో స్థ దొరగ్గా స్వంతంగా యిల్లు కట్టుకున్న వుద్యోగస్తు వీళ్ళందరిమీద బ్రతికే కొందరు వ్యాపారస్తు వుంటారా చుట్టుప్రక్కల

కష్టపడి సరస్వతి రాజుకి చెప్పించిన చదువు అతను కష్టపడి తెచ్చుకున్న ఫస్ట్‌క్లాస్ డిగ్రీ ఐదు సంవత్సరాల క్రిందట ఓ ప్రభుత్వోద్యో దొరికింది రాజుకి అప్పట్నించి నగరశివార్లలో వుంటున్నారు అదే యింట్లో ఉద్యోగం దొరిక మూడేళ్ళకి ఒక మోపెడ్ కొనుక్కున్నాడు రా దానిమీదే రోజూ రానుపోను యిరవై కిలోమీట ప్రయాణం చేస్తుంటాడు చెల్లెలు హేమ ఇం దగ్గిర్లోవున్న హైస్కూల్లో పదో తరగతి చదు తోంది మరో ఏడెనిమిది నెలల్లో కాలేజీలో చే తుంది

నిద్రలో ప్రశాంతంగా, అమాయకంగా క స్తున్న హేమ ముఖంవైపు చూస్తూ ఏదో ఆ చనల్లోకి వెళ్ళిపోయాడు రాజు

'అమ్మ నెత్తురు పంచుకుపుట్టిన తామిద్ద ఆమె కార్చిన చెమటమీద ఆధారపడి యింతవ ఎదిగారు హేమ కాలేజీలోను, ఆపైన యు వర్శిటీలోను పై చదువులు చదవాలి చద చెప్పించగలడు తను పెళ్ళికి యింకా ఏడెనిమిదే పడుతుంది అప్పటికి తన ఆర్జనతో హే ఘనంగా పెళ్ళి చేయగలడు కట్నం ఎంతైనా హేమకి తగిన వరుడ్ని తేగలడు కాని కట్నంయి వరుడ్ని కొనుక్కురావడానికి అమ్మ కుంటుందా?

సాలోచనగా రూఫ్ వంక చూసాడు రాజు ప్రశ్నకి జవాబు తెలుసతనికి కాని సందర్భం వరకు వేచిచూడాలి, అనుకున్నాడు

నిజమే కట్నంతో అల్లుడ్ని కొనుక్కోవ సరస్వతి ఒప్పుకోక పోవచ్చు ఆమెది ఒక వి మైన మనస్తత్వం

* * *

సరస్వతికి పందొమ్మిదేళ్ళ వయస్సులో యింది అప్పటికి ఎస్ ఎస్ ఎల్ సి ప్యా యింట్లో పూరికే కూర్చోకుండా హిందీ పరీ కట్టి, పాసయింది కుట్టుమిషన్ మీద రో గంట కాలక్షేపం చేసేది న్యూస్ పేపర్ చదువు లోకంలో 'నిన్న' జరిగిందేమిటో తెలుసుకునేది తోను ఎక్కువగా మాట్లాడకుండా, ముభా వుండే సరస్వతిని చూసి తండ్రి భయపడు వాడు ఓ గవర్నమెంట్ ఉద్యోగిని చూసి చేసి, తన బరువు తీరిందని సంతృప్తి పడ్డాడు

పెళ్ళయ్యాక కొద్దికాలం సరదాగా గ యింది సరస్వతికి జీవితంలో పెళ్ళి ఒక మార్పు ఐతే, ఆ మార్పు కొద్దికాలం మామూలై పోయింది మళ్ళీ పెళ్ళికి ముందు కున్న హాబీలను పున ప్రారంభించింది ప్రై పి యు సి పరీక్షకు కూర్చుని, సెకండ్ క్లా సైంది, ఇంతలో ఓ కొడుకు పుట్టాడు ప్రమోషన్ మీద తాహసీల్దార్ అయ్యాడు పెరిగింది సౌఖ్యాలు పెరిగాయి

సరస్వతికి మొదట్నించీ సమాజంలో హోదా అర్థం లేనిదిగా కన్పడుతుండేది అవసరానికి మించిన సౌఖ్యాలంటే చికాకు కలిగేది సాదాగా గడిచిపోయే జీవితం ఆమె కోరుకునేది కాని భర్త పదవికి మించి హోదా వెలగబెడ్తుండేవాడు ఎన్నోరకాల విలాసాలకు అలవాటు పడ్డాడు

విసిగిపోయిన సరస్వతి ఒకరోజు భర్తని నిల దీసింది

"మీకొచ్చే జీతంతోనేనా యింత హోద వెలగ బెడుతున్నాం మనం? ఇన్నిరకాల సామాన్లు కొని తెస్తున్నారు! రోజూ అంత ఖరీదైన ఫారిన్ డ్రింక్స్ తాగి వస్తుంటారు! ఎక్కడదండీ మనకింత డబ్బు? "

ఆ మాటలువిన్న ఆమెభర్త తెల్లబోయాడు ఆ మాటలే ఆతనిక్రింద పనిచేస్తున్న ఏ ఉద్యోగో అని వుంటే, ఆతడ్ని పదహారు జిల్లాల ఆవతలకి ట్రాన్స్ఫర్ చేయించి వుండేవాడు అంత కోపం వచ్చిందా సమయంలో కోపం, ఆశ్చర్యం, అపనమ్మకం కలిగాయి

సరస్వతితో, "యివన్నీ నా జీతంలోనే వస్తున్నాయా, ఎలా వస్తున్నాయి – యివన్నీ నీకెందుకే? నా పదవికి తగ్గ హోదా నా కవసరం ఆ హోదాని నిలబెట్టు కోడానికి ఏదైనా చేస్తాను ఏదో ఒకటి చేస్తాను అదంతా నీ కెందుకు? ఏ భార్యయినా భర్తని ఏదో ఒకటి కొనిపెట్టండని పీక్కుతింటుంది కాని, యిలాంటి పిచ్చి ప్రశ్నలు వేయదు అనవసరమైన ఆలోచనలు కట్టిపెట్టి సంతోషంగా వుండడం నేర్చుకో నువ్వలా ఎప్పుడూ ముభావంగా వుండడం నా కిష్టం లేదు," అంటూ చకచక బయటికి వెడిచాడు

భర్త అన్న మాటలు పదే పదే గుర్తుకొచ్చాయి సరస్వతికి హోదా నిలబెట్టుకోడానికి ఏదైనా చేస్తానన్నమాట ! అంటే అవినీతికి, లచంగొండి తనానికి దిగజారుతారన్నమాట ! అలా దిగజారగా సంపాదించిన డబ్బుతో హోదాని కొనుక్కుంటారన్నమాట అసహ్యంతో ఒళ్ళు గగుర్పొడిచింది సరస్వతికి

ఆ తర్వాత ఆ నోట, యీ నోట వినగా తెలిసింది సరస్వతికి– భర్తకి అన్ని విలాసాలకు తోడు పరస్త్రీ వ్యామోహం కూడా వుందని ఆ విషయం తెలిసాక భర్త పట్ల మరింత ఏహ్యాభావం చోటు చేసుకుంది మళ్ళీ పురిటికి పుట్టింటికి వెళ్ళినప్పుడు ఆరునెలలు వుండిపోయిందక్కడే భర్త దగ్గరకి వెళ్ళాలనిపించేది కాదు కాని అంతకు మించి మరో మార్గం కన్పడలేదు తన పిల్లల్ని నిజాయితీపరులుగా తీర్చిదిద్ది, జీవితం అంటే సరైన అవగాహన కల్గించాలని నిర్ణయించుకుంది

అలా మరికొన్ని సంవత్సరాలు గడిచాయి భర్త ప్రవర్తనలో మార్పులేదు ఉన్నా, అది ఆమెకి నచ్చిన మార్పు కాదు తనలో భర్తంటే విముఖత మాత్రం పెరిగిపోయింది దాన్ని బయటికి కనబర్చకుండా ఏదో ఒక వ్యాపకం పెట్టుకునేది

ఒక రోజు అనుకోకుండా సరస్వతికో నిజం తెలిసింది భర్త, పెళ్ళిచేసుకున్న తనని కాకుండా, పెళ్ళిచేసుకోకుండా యింకో స్త్రీని తన స్థానంలో మరో చోట వుంచుకున్నాడని ఆ వార్త తెలిసాక

# ఎండమావి

సరస్వతి కోపంతో మండిపోయింది భర్త తనని అవమానించినట్లు భావించింది మర్నాడే భర్తని నిలదీసి అడిగింది

సరస్వతి ప్రశ్నకి ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదతనికి మౌనంగా వూరుకున్నాడు మళ్ళీ మళ్ళీ రెట్టించి అడిగింది బలహీనంగా 'ఊ' అన్నాడు కారణం ఏమిటని అడిగింది 'అది తన యిష్టం' అన్నాడు

"నాకు మీరంటే అసహ్యం !" అంది సరస్వతి

"ఐతే ఏం చేస్తావ్ ?" మొండిగా అన్నాడు

"వెళ్ళిపోతాను –"

"ఎక్కడికి ?"

"ఇక్కడికి దూరంగా "

"వెళ్ళి ఏంచేస్తావ్ ? అడుక్కుతింటావా ?"

"అంత ఖర్మ పట్టలేదు నాకు నా కాళ్ళమీద నిలబడి, నా పిల్లల్ని పెంచుకుంటాను వాళ్ళని నిజాయితీపరులుగా పెంచి చదువు చెప్పిస్తాను జీవితం అంటే ఏమిటో నేర్పుతాను "

"పిచ్చికాని పట్టిందా ?"

"ఏమన్నా అనుకోండి " సరస్వతి మాటలు ఆమె భర్తలో కలవరం కల్గించినా, రెండు రోజుల్లో వాటి గురించి మర్చిపోయాడు కాని సరస్వతి తన ప్రయత్నాలు ప్రారంభించింది తన స్నేహితురాలి ద్వారా హైదరాబాద్‌లో ఓ యిల్లు అద్దెకు తీసుకుని, భర్తకి చెప్పకుండా పిల్లలతో హైదరాబాద్ చేరుకుంది

ఆ చిన్న యింట్లో ఓ కుట్టుమిషన్‌తో తన స్వంత జీవితం ప్రారంభించింది ఆ మార్పుకి తట్టుకోలేని పిల్లల్ని ఓర్పుతో ఓదార్చింది క్రమంగా గతం మాసిపోగా ప్రస్తుతానికి అలవాటు పడిపోయారు పిల్లలిద్దరూ

చుట్టుప్రక్కల వున్న పిల్లలకి ట్యూషన్స్ చెప్పడంలో మంచి పేరు తెచ్చుకుంది సరస్వతి పదో తరగతి వరకు అన్ని సబ్జెక్ట్స్‌లోను, హిందీలో భాషాప్రవీణ వరకు ట్యూషన్స్ చెప్పేది నలుగురితో ప్రారంభమైన ఆమె పాఠశాల నాలుగు బాచ్‌లలో నలభైమంది వరకు పెరిగింది తను, యిద్దరు పిల్లలు సుఖంగా జీవించడానికి సరిపడ డబ్బు సంపాదించేది

సరస్వతి ఆశయాల కనుగుణంగా పెరిగారు పిల్లలిద్దరూ రాజు చదువులో చురుగ్గా వుండేవాడు గ్రాడ్యుయేషన్ అయ్యాక యూనివర్సిటీలో చేరమంది సరస్వతి రాజు అందుకు ఒప్పుకోలేదు ఉద్యోగ ప్రయత్నాలు ప్రారంభించాడు ఒక సంవత్సరం కాకుండానే ఓ ప్రభుత్వోద్యోగం సంపాదించాడు మొదటి నెల జీతం తెచ్చి తల్లిని కుట్టుపని మానేయమన్నాడు మరో రెండు నెలల తర్వాత ట్యూషన్స్ మానేయమని బలవంతం చేసాడు ఇన్ని సంవత్సరాలుగా పిల్లల్ని పెంచడంలో, చదివించడంలో పడ్డ శ్రమకి యికముందు విశ్రాంతి అవసరమని గట్టిగా వాదించాడు కొడుకు మాటలు సమంజసంగా తోచాయి సరస్వతికి ఇద్దరు ముగ్గురు అమ్మాయిలకి హిందీ పరీక్షలకి తర్ఫీదు మాత్రం యిస్తుండేది అదీ కేవలం తన కాలక్షేపం కోసమే

* * *

"అమ్మా ! రాజశేఖర్‌గారున్నారా ?"

ఎవరో ముసలాయన ఆయనకి తోడుగా ప్రక్కన ఓ పదేళ్ళ కుర్రాడు వాళ్ళని లోపలికి రమ్మని, కూర్చోమంది సరస్వతి

"రాజు యింకా యింటికి రాలేదండీ ! వచ్చేసరికి పొద్దుపోతుందికూడ "

ఆయన ఎందుకొచ్చిందీ అర్థంకాలేదు సరస్వతికి నగరానికి చాలా దూరంగా వుండడంవల్ల సాధారణంగా రాజు కోసం ఎవరూ యింటికి రారు బహుశ ఆయనకి పెళ్ళీడుకొచ్చిన ఒక కూతురు వుండి వుంటుంది రాజుని చూసి పోదామని వచ్చి వుంటారనుకొంది

"ఎక్కడ్నించి వస్తున్నారు ?" అడిగింది సరస్వతి

"హైదరాబాదేనమ్మా మాదీ నా పేరు గోపాలరావు రెండేళ్ళ క్రిందటే రిటైరయ్యాను కాళ్ళరిగేలా తిరిగినా యింతవరకు పెన్షన్ మంజూరు కాలేదు కాగితాలన్నీ చివరికి మీ అబ్బాయి దగ్గిరకొచ్చాయని తెలిసింది " అని కొంచెంసేపాగి, "వచ్చికూడ నెలదాటిందట ఆయన దగ్గిర పన్చేస్తున్న గుమాస్తా, ఒక వెయ్యిరూపాయలు లంచం యిస్తే పని అయిపోతుందన్నాడు నేనా పేదవాడ్ని ఆ పెన్షన్ డబ్బుతొస్తే తప్ప యిక నా సంసారాన్ని నడపలేను నా కష్టాలన్నీ మీ అబ్బాయి



## రాజ్‌బాబు అస్తమయం

రెండు దశాబ్దాలపాటు ఆంధ్ర ప్రేక్షక లోకాన్ని తన నవ్వుల జల్లులతో ముంచెత్తిన ప్రముఖ హాస్యనటుడు శ్రీ పుణ్యమూర్తుల రాజబాబు ఫిబ్రవరి 14వ తేదీ రాత్రి గం 8–30 లకి హైదరాబాదులోని సెయింట్ థెరెసా ఆస్పత్రిలో గొంతు కేన్సర్‌తో కన్నుమూశారు. ఆయన వయస్సు 47 సంవత్సరాలు, దాదాపు 550 చిత్రాలలో నటించారు. శ్రీ రాజ్‌బాబు ఎన్నో దానాలు చేశారు. నిర్మాతగా ఆయన 'ఎవరికి వారే యమునాతీరే, మనిషి రోడ్డున పడ్డాడు' వంటి ప్రబోధాత్మక చిత్రాలని నిర్మించారు. ఆయనకి భార్య, ఇద్దరు కుమారులు ఉన్నారు.







గారికి చెప్పుకుని ఆయన సహాయాన్ని కోరుదామని వచ్చాను ''

ఆశ్చర్యపడింది సరస్వతి రిటైరయ్యాక రెండేళ్ళవరకు పెన్షన్ రాలేదా ? రాజు దగ్గిరకి ఆ పేపర్లు వచ్చి నెలరోజులయిందా ? రాజు దగ్గిర పని చేసే గుమాస్తా వెయ్యి రూపాయలు లంచంగా అడిగాడా ? రాజు ఆ పేపర్లని నెలరోజులపాటు తన దగ్గిరే ఎందుకుంచుకున్నట్లు ?

''మీ అబ్బాయి నాకేమైనా సహాయం చెయ్య గలడా ? మిమ్మల్ని చూస్తుంటే – మీరు చెప్తే మీ అబ్బాయి మీ మాట కాదనరనిపిస్తోంది దయచేసి నాకీ మాత్రం సహాయం చేసిపెట్టమ్మా, మీకు జన్మంతా ఋణపడి వుంటాను'' అన్నాడాయన గద్గదంగా ఆ గోపాలరావు

సరస్వతి హృదయం చలించిపోయింది ఇటు వంటి పేదవాళ్ళకి సహాయపడడం కంటె యింకా ఏం కావాలి ? వెంటనే లోపలికి వెళ్ళి ఓ కాగితం తెచ్చి వివరాలు రాసివ్వమంది ఆయనతో అది చూసి ఎంతో సంతోషంతో ఆమెవైపు కృతజ్ఞతాపూర్వకంగా చూసాడు

రాజు అలాంటి పేపర్లని అంతకాలం తన దగ్గిర పెండింగ్ వుంచడం ఏ మాత్రం నచ్చలేదు సరస్వతికి బహుశ వాడి దగ్గిరకొచ్చే పేపర్లన్నీ అలాంటివేకావచ్చు రోజూ ఆఫీస్‌లో ఎంతసేపు కూర్చున్నా యింకా ఎంతో పని మిగిలిపోతూ వుండి వుండచ్చు కాని అలాంటి పేపర్లను అంతకాలం పెండింగ్‌లో వుంచడంవల్ల కిందవాళ్ళు దాన్ని అలుసుగా తీసుకుని లంచాలకాశిస్తుంటారు ఇంటికి రాగానే రాజుని ఝాడించేయాలనుకుంది సరస్వతి

ఆ గోపాలరావుకి రాజు తప్పకుండా సహాయం చేస్తాడని, ఆయన యిక చింతపడాల్సిన అవసరం లేదని గట్టిగా చెప్పి ఆయన్ని పంపేసింది

ఆ రాత్రి పదకొండు గంటలకి యింటికొచ్చిన కొడుకుని భోజనం దగ్గిర కదలేసింది సరస్వతి ఓ ముసలాయన తన యింటి అడ్రస్ తెలుసుకుని ఇంత దూరం వచ్చి తల్లికి చెప్పాడనేసరికి రాజుకి చాలా ఆశ్చర్యం వేసింది తల్లి వేసిన యక్ష ప్రశ్నలకి వూపిరాడలేదు కొంతసేపు తర్వాత అన్నాడు నెమ్మదిగా, ''గవర్నమెంట్‌లో పేపర్లు పెండింగ్ వుండడం సహజమేనమ్మా ఆయన అన్నట్లు, నువ్వనుకుంటున్నట్లు అవినీతి, లంచగొండితనం కూడ చాలా సహజమైపోయాయి అందువల్లనే నేను ఏ పేపర్లూ ఎక్కువ రోజులు పెండింగ్ వుంచను ఆయన పేపర్లు నా దగ్గర వుండి వుండవు ఐనా ఆయన దగ్గర్నుంచి వివరాలు తీసుకున్నావు కాబట్టి, అవి ఎక్కడ వున్నాయో వెతికి పట్టుకుని సహాయం చేస్తాను ''

''చెయ్యరా ! రెండేళ్ళు ఏ ఆదాయం లేకుండా కుటుంబాన్ని పోషించడమంటే యీ రోజుల్లో సామాన్యమైన విషయం కాదు ఆయన ఎంతకాలం ఎదురుచూసి, చూసి, చివరికి మనింటికొచ్చి ప్రాధేయ పడ్డాడు ! '' అని కొంతసేపాగి, ''మీ నాన్న దగ్గరే వుండివుంటే నీకు కష్టాలంటే ఏమిటో తెలిసేవి కావు కాని నా మూలంగా నీకు వాటిని తెలుసుకునే అవకాశం దొరికింది అందువల్ల పేదవాళ్ళ పట్ల కొంత సానుభూతి చూపిస్తూ వుండు మిగతా పని ఎంతవున్నా, వాళ్ళకి సంబంధించిన పనులు మాత్రం వెంటనే చేస్తూ వుండు !'' అంది సరస్వతి

రెండు రోజుల తర్వాత గోపాలరావుగారికి పెన్షను మంజూరు చేస్తూ, యిచ్చిన వుత్తర్వు కాపీని తల్లికి చూపించాడు రాజు ఆమె ఎంతో గర్వంగా చూసింది కొడుకు కళ్ళలోకి ''కీపిట్ అప్!'' అంది తల్లి భుజాలమీద చేతులు వేసి ఆమె కళ్ళల్లోకి చూసాడు రాజు ఆ చూపులకి అర్థం ఏమిటో తెలియ లేదు సరస్వతికి

ఆ మర్నాడు గోపాలరావుగారు, యింటికొచ్చి, సరస్వతికి కృతజ్ఞతలు తెలిపాడు ఆమె సంతోషానికి అవధుల్లేవు ఐతే అది ఎప్పుడూ అవ్యక్తంగానే మిగిలి పోతుంది తన కొడుకు యింకా ఎదిగి గొప్పవాడు కావాలని ఆమె ఆకాంక్ష గొప్పకి ఆమె నిర్వచనం మనిషిగా జీవితానికి పరిపూర్ణత సాధించడమే

చిన్నతనం నించి పిల్లలచేత సరస్వతి చదివించిన పుస్తకాలన్నీ అలా మనిషిగా బ్రతికి, మనిషిగా ఎదిగిన గొప్పవాళ్ళ జీవిత చరిత్రలే ఆమె లైబ్రరీ నిండా అలాంటి పుస్తకాలే అవి చిన్నతనంలో పిల్లలకు బ్రతుకు బాట వేస్తాయని ఆమె నమ్మకం జీవితం పట్ల సరైన అవగాహన కల్గించి, ఆత్మ విశ్వాసాన్ని పెంపొందిస్తాయని ఆమె విశ్వాసం పిల్ల లిద్దరూ ఆమె ఆశలకి ప్రతిరూపాలుగా పెరిగారు తరచు ఆ మాట గుర్తు చేసుకుని సంతృప్తి చెందు తుంటుంది సరస్వతి

* * *

సాయంకాలం నీరెండలో యింటి ముందున్న కొద్ది జాగాలో కుర్చీ వేసుకూర్చుంది సరస్వతి వీధిలో అటూ, ఇటూ పోయే జనాన్ని చూస్తూ అక్కడ వాహనాల విపరీత ధ్వనులుండవు ఫ్యాక్టరీ పొగ గొట్టాలు కన్పడవు అరుచుకుంటూ గుంపులు గుంపుగా పోయే వందలాది — వేలాది — జనాలు కనపడరు నగరానికుండాల్సిన లక్షణాలు లేకుండా ఓ పెద్ద నగరంలో భాగంగా వున్న ఆ ప్రదేశం అంటే సరస్వతి కెంతో యిష్టం కుర్చీలోంచి లేచి, వీధి వాకిలి దగ్గరకొచ్చి నిలబడింది హేమ క్లాస్‌మేట్ యింటికని వెళ్ళింది, ఇంకా రాలేదు

ఇంతలో ఓ అమ్మాయి సరస్వతిని చూసి అడిగింది, ''యిక్కడ రాజశేఖర్ అని '' ఆమె పూర్తి చేసేలోపు అందుకుంది సరస్వతి, ''యీ యింట్లోనే వుంటాడు, మా అబ్బాయే ! లోపలికి రండి '' అంది ఇద్దరూ వరండాలోకి నడిచారు ఆ అమ్మాయికి కుర్చీ చూపించి కూర్చో మంది సరస్వతి

''మీరు, రాజు ఒకే ఆఫీస్‌లో పన్చేస్తారా ?''

''ఔనండి ప్రక్క ప్రక్క సెక్షన్స్‌లోనే నా పేరు సుందరి '' అంది ఆ అమ్మాయి

సరస్వతి లోపలికి వెళ్ళి కాఫీ చేసి పట్టుకొచ్చింది ఒక గ్లాసు సుందరికి యిచ్చి, తనొకటి తీసుకుని ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది

''ఊరికి దూరంగా వుండడంవల్ల సాధారణంగా వాడి తోటి వుద్యోగులు కాని, ఫ్రండ్స్ కాని యింత దూరం రారు మీరు వచ్చేసరికి నాకెంతో సంతోషంగా వుంది ఈ రోజు మీరు ఆఫీస్‌కి వెళ్ళలేదా ?''

''వెళ్ళానండీ మధ్యాహ్నం కొంచెం తల నొప్పిగా వుంటే పర్మిషన్ తీసుకుని యింటి కెళ్ళిపోయాను అది కాస్తా ఓ గంటలో తగ్గిపోయింది సరదాగా మిమ్మల్ని చూసినట్లుం టుందని యిలా వచ్చాను '' అంది

''అంటే వాడు యింటికి యింత త్వరగా రాడని మీకు తెలుసన్నమాట ?'' అంది సరస్వతి నవ్వుతూ

"మగవాళ్ళు కదా. ఇంటికి త్వరగా వచ్చి ఏంచేస్తారు ? . అందులో బ్రహ్మచారి కూడ !" అంది సుందరి తనుకూడ నవ్వుతూ.

"మీకు పెళ్ళయిందా ?" ఆసక్తిగా అడిగింది సరస్వతి

తల అడ్డంగా వూపిందా అమ్మాయి

"అప్పుడే చేసుకోదల్చుకోలేదా ?"

"అదేం లేదు " ఆగింది సుందరి, సరస్వతి కళ్ళలోకి సందేహంగా చూస్తూ ఏమిటన్నట్లు చూసింది సరస్వతి

"నిజం చెప్పాలంటే రాజా, నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం మీకు చెప్పాడో, లేదో కాని. ."

"నాకు చెప్పలేదు. వెధవ — వాడే మిమ్మల్ని రాయబారం పంపివుంటాడు —" సరస్వతికి ఆ వార్త ఎంతో సంతోషం కల్గించింది. రాజుకి ఓ వ్యక్తిత్వం వచ్చిందన్న మాట !

"అదేం లేదులెండి నేనేవచ్చాను . జస్ట్ మిమ్మల్ని చూడాలని ." కొంతసేపాగి, నెమ్మదిగా అంది సుందరి, "మా యిద్దరి కులాలువేరు మా పెద్దవాళ్ళు ఒప్పుకుంటారో, లేదో తెలియదు నేను యింతవరకు తెలుసుకోలేదు కూడా మీ అభిప్రాయం ఏమిటి?"

సరస్వతికి సుందరి బాగా నచ్చింది మనిషి అందంగా వుండడమే కాక, ఎంతో ఆత్మవిశ్వాసం, ధైర్యం కలదిగా కన్పించింది.

"నాకేమీ అభ్యంతరం లేదు మీ పెద్దవాళ్ళని ఒప్పించడానికి ప్రయత్నం చేద్దాం వాళ్ళు ఒప్పుకోక పోయినా ఫర్వాలేదు మీ యిద్దలూ పెళ్ళి చేసుకుని యిక్కడే వుండచ్చు ." గంభీరంగా అంది సరస్వతి

కొద్దిక్షణాలు సుందరి ఏమీ మాట్లాడలేదు ఆలోచిస్తూ కూర్చుంది తర్వాత, "రాజుకి ఒక చెల్లెలుంది కదా! చెల్లెలి పెళ్ళఅయ్యాకే మన పెళ్ళి, అన్నాడు అదికూడ నిజమే అనుకోండి అనుకున్న దానికోసం ఎదురు చూడ్డంలో ఎంతో థ్రిల్ వుంటుంది కదా!" మాటల్ని జాగ్రత్తగా పేరుస్తూ అన్నది సుందరి

"దానిపెళ్ళి మీకేమీ అడ్డంకాదు అదియింకా చిన్నపిల్ల పై చదువులు చదువుకుంటుంది కూడ ఇంకా ఏడెనిమిదేళ్ళు పట్టినా పడుతుంది అప్ప టికీ సమాజం మారకపోతుందా యివ్వాళ మలాంటి యువతీ యువకులు ముందుకువచ్చి యీ అర్ధంలేని సాంప్రదాయాలకు ఎదురు నిలిస్తే ? "

సరస్వతి మాటలు సుందరికి ఆశ్చర్యం కల్గిం చాయి అలాంటి స్త్రీకి కోడలు కావడంకంటె తన క అదృష్టం ఏముంటుంది? అనుకుంది కాని రాజు మనస్తత్వం వేరు

ఇంతలో హేమ యింటికి వచ్చింది సుందరి, హేమ కొంతసేపు మాట్లాడు కున్నారు వాళ్ళిద్దరి దగ్గిర శలవుతీసుకుని బయల్దేరింది సుందరి ఆమె ర్ధం కానిదొక్కటే రాజుకీ, అతని తల్లికి చాలా భేదం వున్నది

రాజు స్వంత విషయాలన్నీ తనదగ్గిర గోప్యంగా వుంచుతున్నాడా, అని అనుమానం కల్గింది సరస్వ



# ఎండమావి

తికి. కాని ఆ అనుమానం ఎక్కువసేపు నిలబడ లేదు 'పిల్లలు తమ ప్రేమ వ్యవహారాల గురించి అంతతేలిగ్గా, తొందరగా తల్లి తండ్రులకి చెప్పరు. రాజు సిగ్గుపడి తనకావిషయం చెప్పివుండకపోవచ్చు లేదా తను ఒప్పుకోమోననే సందేహం కావచ్చు '

రాజు రాగానే సరదాగా కొద్దిసేపు ఏడిపించా లని, ఎదురుచూస్తూ కూర్చుంది హేమ రాజుతో మాట్లాడి పెళ్ళి వెంటనే నిశ్చయం చేయించాలని నిర్ణయించుకుంది సరస్వతి

కాని ఆరోజు రాత్రి రాజు యింటికి రాలేదు.

* * *

తెల్లవారాక కూడ రాజు ఇంటికి రాలేదు ఈ ఉద్యోగాలమీద కోపం వచ్చింది సరస్వతికి అంత ముఖ్యమైన విషయం మాట్లాడాలని రాత్రి కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తే రాజు రాకపోవడం— ఆమెకి నిరుత్సాహం కల్గించింది హేమ మామూలుగా స్కూల్ కి వెళ్ళిపోయింది

మధ్యాహ్నం భోజనంచేసి పడుకున్న సరస్వతికి ఎవరో తలుపు తడుతుంటే మెలకువ వచ్చింది లేచి వెళ్ళి తలుపు తీసేలోపు తలుపు పగిలేలా కొడుతున్నారు అవతలివాళ్ళు

## నిన్న - నేడు - రేపు

గత జ్ఞాపకాలను నెమరువేస్తూ
వృద్ధులు నిన్నలో బ్రతుకుతారు
పరిభ్రమించిన పరిస్థితుల నధిగమిస్తూ
మధ్య వయస్కులు నేడులో మనగల్గుతారు
భావి గూర్చి తలపోస్తూ
యువత రేపులో జీవిస్తుంది

— కావూరి సదాశివరావు

తలుపు తెరిచి చూసిన సరస్వతి ఒక్కక్షణం ప్రమాన్పడిపోయింది ఎదురుగా ఓ పోలీస్ ఇన్స్పెక్టర్, మరో కానిస్టేబుల్, యింకెవరో యిద్దరు, మామూలు దుస్తుల్లో

"ఎవరు కావాలి ?"

"రాజశేఖర్ వుండే యిల్లు యిదే కదా ?"

"అవును వాడికేమన్నా అయిందా ?"

"అది తర్వాత చెప్తాం మీరు అతని కేమౌతారు ?"

"రాజు తల్లిని నేను "

"మమ్మల్ని లోపలికి రానీయండి "

"సారీ ! దయచేసి లోపలికి రండి !" అంటూ హడావిడిగా అక్కడ మడిచిపెట్టిన కుర్చీలను వంగి వేయబోయింది.

"అవేమీ వద్దులెండి మేము మీ యిల్లు సోదా చేయడానికొచ్చాం" అన్నాడు ఇన్స్పెక్టర్

"దేనికి ?" గట్టిగా అరిచినట్లు అన్నది సరస్వతి

"కంగారుపడకండి అవినీతి ఆరోపణలమీద మీ అబ్బాయి నిన్న అరెస్ట్ అయ్యాడు మరికొన్ని ఆధారాల కోసం మీ యిల్లు సోదా చేయాల్సివుంది '

నోట మాట రాలేదు సరస్వతికి ఒక్కక్షణం మతిపోయినట్లన్పించింది సమాధానం వెతుక్కునే ప్రశ్నలు ఎన్నో ఒకటి వెంట ఒకటి ఆమె మనస్సుని తొలిచేసాయి 'రాజు అవినీతి ఆరోపణలమీద అరెస్ట్ కావడమేమిటి ?' అదేదో పెద్ద కుట్రలా తోచింది ఆమెకి నిజాయితీపరులకి చట్టంవేసే వురిశిక్షలా అన్పించింది

పోలీసులు యిల్లంతా సోదా చేసారు వాళ్ళకి విలువైన సామానేదీ కన్పడలేదు—ఓ ఫ్యాన్, పాతబడ్డ రేడియో, కొద్దిపాటి ఫర్నిచర్ తప్ప చివరికి అలమరలో ఓ బ్యాంక్ పాస్ బుక్ కన్పడింది అది హేమ పేరున వుంది దాదాపు ఐదు సంవత్సరాలుగా నెలకి వందరూపాయల చొప్పున జమ అవుతున్నది ఆ పాస్ బుక్ తీసుకుని ఇన్స్పెక్టర్ జేబులో పెట్టు కున్నాడు

వాళ్ళంతా సోదా పూర్తయాక వరండాలో కొచ్చారు సరస్వతి అలాగే నిలబడి వుంది ఆమె వైపు చూసి ఇన్స్పెక్టర్, "యీ బాంక్ పాస్ బుక్ తీసికెళ్తున్నాం దీని అవసరం తీరాక మీకు తిరిగి పంపేస్తాం కంగారు పడాల్సిందేమీ లేదు —" అన్నాడు

గొంతు పెగల్చుకుని అంది సరస్వతి "రాజు మీద వచ్చిన ఆరోపణలేమిటి ? జైల్లో వున్నాడా ? విడుదల చేసారా ?" క్లుప్తంగా వున్నాయి ప్రశ్నలు

"అతని మీద చాలా ఆరోపణలున్నాయి ఐతే నిన్న ఓ వ్యక్తి దగ్గర ఐదువేల రూపాయలు లంచం తీసుకుంటుండగా రెడ్ హాండెడ్ గా పట్టుబడ్డాడు వెంటనే అరెస్ట్ చేసాం ఆరోపణలన్నీ అవినీతికి సంబంధించినవే ఇంకా ఏమైనా వివరాలు కావాలా ?" కరకుగా వుంది ఇన్స్పెక్టర్ గొంతు

"రాజు అలాంటి వాడు కాదు చాలా మంది పేదవాళ్ళకి సహాయం చేసాడు అవినీతి, లంచగొండి తనం వంటి ఆరోపణలు వాడి మీద రావల్సినవి కావు " మూర్ఖంగా అంది సరస్వతి ఇన్స్పెక్టర్ చిన్నగా నవ్వాడు

"ఆ ఆరోపణలన్నీ కోర్టులో ఋజువౌతాయి నిన్న లంచం తీసుకుంటుండగా రెడ్ హాండెడ్ గా పట్టు బడ్డవాడు నిజాయితీ పరుడెలా అవుతాడమ్మా ?" అన్నడామె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ

వాళ్ళు వెళ్ళిపోయారు

సరస్వతి అక్కడే వున్న కుర్చీలో కూలబడి పోయింది ఆమె కళ్ళ ముందు తన ఆశలతో, ఆశ యాలతో కట్టుకున్న పెద్ద భవనం పేకముక్కల్లా కూలిపోతున్నట్టు అన్పించింది 'రాజు ఐదువేల రూపాయిల లంచం తీసుకోబోతుండగా పట్టు బడ్డాడా ? అబద్ధం అలా జరగడానికి వీల్లేదు ఎంతో పదిలంగా తను పెంచి పెద్ద చేసిన రాజు అలాంటి పనులు చేయడు తనకి తెలియకుండా యింతకాలం అంత క్రూరమైన విషయాలు రహ స్యంగా వుంచగల్గేవాడు కాదు తనకంత ద్రోహం చేయడు '

'కాని ఆ రోజు ఆ గోపాలరావు చెప్పిన విషయ మేమిటి ? రాజు క్రింద పని చేస్తున్న గుమాస్తా వెయ్యి రూపాయలు అడిగాడని అది రాజు చేయించిన పనేనా ? . మరి తను ఆ విషయం చెప్పినప్పుడు

# డి. ఆర్. ఎస్* కలిగిన
# క్రొత్త ప్రెస్టీజ్ ఒక్కటే అత్యంత
# భద్రమైన ప్రెషర్ కుక్కర్

క్రొత్త **ప్రెస్టీజ్**



**జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?**

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటచేయడం కూడా అంత నిరపాయ కరం ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రంద్వారా, గేస్కెట్ అపాయకర మైన స్థితిని చేరన ఆవిరి ఒత్తడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది జి ఆర్ ఎస్ అమర్చడంవల్ల 'క్రొత్త ప్రెస్టీజ్' పూర్తి భద్రతగల ఎకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది



**అది ఎలా పనిచేస్తుంది?**

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తడి అవసరానికి మించి ఉంటుంది సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది అయితే, ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది

'క్రొత్త ప్రెస్టీజ్'లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తడి అదికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి ఆర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తడిని అంతర్ముఖంగా భద్రంగా వదలివేస్తుంది.



**జి ఆర్ ఎస్ ఎందుకు అవసరం?**

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు దురదృష్టవశాత్తు, సేఫ్టీ ప్లగ్ నకిలీదో,అసలైనదో మీరు గుర్తించలేరు, ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు**

Patent pending
గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

Prestige
PRESSURE COOKER
Cook a whole meal in minutes

**100% భద్రత**



మామూలుగా వంటచేసే పద్ధతిలో జి ఆర్ ఎస్ జోక్యం ఉండదు.

ఉండనే ఉండదు అందులో మార్చడానికి ఏమీలేదు రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యథాస్థానానికి త్రోయడం మాత్రమే. తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా వాడగలిగే భద్రమైన కుక్కర్ — అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్".

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

**TTK తయారీ.**
**Prestige**



ప్రెస్టీజ్ భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

వెంటనే ఆ ముసలాయనకి సహాయం చేసాడే ? ... బహూశ తను చేస్తున్న పాడుపనులు బయట పడకుండా వుండడానికి తన దగ్గర నాటకం ఆడాడేమో ?.. '

కళ్ళు తిరుగుతున్నట్లన్పించి, కుర్చీలోంచి లేచి, నెమ్మదిగా మంచం వాల్చుకుని పడుకుంది సరస్వతి ఆమె ముందున్న ఆబ్జక్ట్స్ అన్నీ గిరగిర తిరుగుతున్నాయి. జ్ఞానం వచ్చాక ఎప్పుడూ కంటి తడి పెట్టని సరస్వతి కళ్ళనించి నీళ్ళు జలపాతాల్లా కారుతున్నాయి తన బ్రతుకులో భాగంగా, తన ఆశగా, తన భవిష్యత్తుగా పెంచి పెద్దచేసిన రాజా తన కింత ద్రోహం చేస్తాడా ? .

చేతులకి బేడీలు బిగించి, పోలీసులు రాజాని తనకెదురుగా తీసుకొని నిలబెడితే వాడినేమనగలదు? వాడ్ని వాడితండ్రి నుంచి వేరుపరచి నందుకు క్షమాపణ చెప్పుకుంటుంది. అంతే.

ఎంతో బలహీనంగా ఫీలయింది సరస్వతి. లోకమంతా ఓకటి, తనొక్కతె ఒకటి, అన్పించింది. తనకు కన్పించేదంతా అబద్ధం అనించింది. ఆ అబద్ధాలవెనుక దాక్కున్న నిజాలంటే భయం వేసింది

మరుక్షణంలో సరస్వతి కళ్ళకి హేమ కన్పించింది ఆమెలో మళ్ళీ ఆశ చిగిర్చింది. లేచివెళ్ళి ముఖం కడుక్కొని హేమకోసం ఎదురుచూస్తూ నిలబడింది.

*       *       *

"రాజా, ఏమిటాలోచిస్తున్నావ్? . యిలాంటివన్నీ మామూలేనోయ్!. . అంత సీరియస్‌గా తీసుకోకు ." అంటూ విస్కీ రెండుగ్లాసుల్లోకి వంచి, ఐస్ ముక్కలు వేశాడు మోహన్. మోహన్ రాజాకి సహోద్యోగి

ఆ సాయంత్రం కోర్టులో హాజరు పరిచారు రాజాని. అరగంట విచారణ తర్వాత రాజాకి బెయిల్ మంజూరైంది. వెంటనే మోహన్ దగ్గిరకొచ్చాడు

"ఈ విషయం ఏమాత్రం ముందుగా తెల్సినా ఏదో విధంగా మేనేజ్ చేసేవాడ్ని—" అన్నాడు రాజా గ్లాసులోని విస్కీని గొంతులో పోసుకుని.

"అయిపోయిందేదో అయిపోయింది. ఇప్పుడైనా అయిదువేలో, పదివేలో వాళ్ళముఖాన పారేస్తే కేస్‌వీక్ చేసేస్తారు. నిన్ను నిర్దోషిగా కోర్టు ప్రకటిస్తుంది. దానిగురించి బాధపడకు!" మోహన్ ధైర్యం చెప్పాడు

మరోపెగ్ గొంతులో పోసుకుని, లేచి నిలబడ్డాడు రాజా. అతనిముఖం ఎర్రగా కమిలిపోయింది. జుట్టు చిందర వందరగావుంది పాంటు, షర్టు మాసిపోయాయి.

"పోలీసులు మీ యిల్లు సోదా చేసిన విషయం, అక్కడ వాళ్ళకేమీ దొరకని సంగతి తెలుసానీకు?" మోహన్ ప్రశ్నకు సూధానంగా "తెలుసు" అన్నాడు రాజా.

'ఇప్పుడు యింటికి ఎలా వెళ్ళగలడు తను?' రాజాని వేధిస్తున్న ప్రశ్న అది 'ఇంత జరిగాక అమ్మకి తనముఖం ఎలా చూపించగలడు? యింత కాలం యిలాంటివేవీ తెలియకుండా దాయగలిగినా, యిప్పుడు అవన్నీ చాలా అసహ్యకరమైన పరిస్థితుల్లో బయటపడ్డాయి అమ్మని తనిక ఒప్పించలేడు '

మోహన్ వైపు నిస్సహాయంగా చూసాడు రాజా

'తన పతనానికి కారణం స్నేహితులేనా? కాకపోవచ్చు తన బలహీనతలు కావచ్చు అమ్మ తనకు వుద్బోధించిన వాటిని నిజాయితీగా తను నమ్మి వుండకపోవచ్చు తన నెత్తుటిలో తండ్రికున్న భాగం ప్రభావం కావచ్చు తనకలవడ్డ దురలవాట్లు కారణం కావచ్చు తాగుడు వ్యభిచారమీద అయ్యే ఖర్చుల కోసం కావచ్చు

"అసలు తనకీ దురలవాట్లెలా అబ్బాయి ? తనలో తను పెంచుకున్న ఒంటరితనంవల్ల కావచ్చు అకారణంగా తను తనకి, తల్లికి మధ్య దూరం పెంచుకోడంవల్ల కావచ్చు. తనలో అంతర్గతంగా వున్న తండ్రి ప్రతిరూపంవల్ల కావచ్చు '' బాక్ టు స్క్వేర్ ఒన్

"మోహన్ ఒక్కసారి యింటికి వెళ్ళొస్తాను నీ స్కూటరియ్యి ! "

"ఇంటికా ?. యిప్పుడా ? రేపు వెళ్ళచ్చు లేవోయ్ !"

"లేదు మా అమ్మని చూడాలి మా అమ్మకి చెప్పాలి — యిదంతా ఓ పెద్ద నాటకమని, నేనంటే

# కొత్త గొంతులు

టి.యల్. కాంతారావు

"నేను ఏం రాస్తున్నానో నాకు తెలుసు. నే నెందుకు రాస్తున్నానో నాకు తెలుసు. అది ఈ రచనలో మీక్కూడా అనిపిస్తే 'ఐతే నేమా పర్లేదన్నమాట' అని మురిసిపోతాను." - రేవతీదేవి.

'నా లోపల బాధలు నా వెలుపలి క్షత జగత్తు ఆక్రోశించిన కరుణా బీభత్సరవాలు' అన్నాడు తిలక్. రేవతీదేవిగారి మానసిక అంతర్ ప్రవృత్తికీ, బాహిరమైన సామాజిక ఆలోచనా విధానానికీ 'శిలాలోలిత'లోని ఖండికలు నిదర్శనాలు. భాష, భావన పరిపుష్టంగా ఉన్న వ్యక్తికి తన భావ ప్రకటనకు రచన వాహిక అవుతుంది. కేవల భావ ప్రకటన కవిత్వం కాదు. ఆలోచనాత్మక కళారూపం కవిత్వం. రేవతీదేవిగారు తనదైన అస్తిత్వంకోసం తపనపడిన కవయిత్రిగా కనబడుతుంది. సమాజపు అతి సాధారణమైన నీతి, నీయతుల సంకెళ్ళలో స్వేచ్ఛాకాంక్షితమైన అస్తిత్వం ఇమడదు. అప్పుడే సంఘర్షణ. ఆ సంఘర్షణలోంచి పుట్టినదే ఈ కవితలు. ఈవిడ కవిత్వం కోసమే కవిత్వం రాయలేదు. తనను మినహాయించిన సమాజంకాని, సమాజాన్ని మినహాయించిన తను కాని రేవతీదేవిగారి కవిత్వ లక్ష్యం కాదు.

వానచినుక్కి, ఎండపొడకి, చిరుగాలికి, పరిమళానికి ద్రవించే హృదయం ఆమెది. అస్తవ్యస్తపు సమాజ జీవితంలోంచి తన అస్తిత్వాన్ని అన్వేషించుకుంటూ మంచులో తడిసి, వెన్నెట్లో మెరసి, మౌనముద్రాంకితయైన రస యోగిని ఆమె.

మనసు, మనిషీ రెండూ వేరై దారి గోదారి కాగా ఈ సమాజంలో మనసు శిలా సదృశమైనప్పుడు నిష్ప్రాణిగా జీవించే వ్యవస్థలో మనిషి తనను తను వెతుక్కునే, గుర్తించే ప్రయత్నంలో ఎంతో వేదన, తపన, అశాంతి; వాటికి ప్రతిరూపమే ఈమె కవిత్వం. అంతం కాని జీవితం, తొందరగా అంతం కావాలనీ వాంఛిస్తూ, నిస్పృహ, ఒంటరితనంతో, నిజాయితీకై, స్వచ్ఛతకై, స్వేచ్ఛకై అటు దేవుడితోనూ, ఇటు మనిషితోనూ రాజీపడలేని మనస్తత్వం గల కవయిత్రి ఈమె. మనిషి మరలా గమనిస్తున్నప్పుడు జీవితానికి అర్థం ఉండదనీ, జీవిత యాథార్థ్య సాఫల్యానికి ప్రయత్నిస్తే సంఘంతో పోరాటం తప్పదనీ, సంఘం కంటె వ్యక్తి వ్యక్తిత్వం గొప్పదనీ, తానంగీకరించని నియమాలు తనకు వర్తించ కూడదనే స్వేచ్ఛా పూరిత వ్యక్తిత్వపు అస్తిత్వ వాదం ఈమెది.

"ఇంతకీ నేను పుట్టిందెప్పుడు
పుట్టినపుడు పుట్టినట్లా
చైతన్యం చిగుర్చినప్పుడు పుట్టినట్లా
చైతన్యం చిగురుకు తొలిసారి ఓడిపోయాను
అప్పటినుంచీ నిత్యం ఓడిపోతూనే ఉన్నాను
ఐనా
నన్ను ఓడిస్తున్న వాళ్ళెప్పటికీ
నన్ను గెలుచుకోలేరు



ఇది నా ఓటమిలోని
నా గెలుపు."

బహుశా ఇందుచేతనేనేమో కవితా సంకలనానికి 'శిలాలోలిత' అని పేరు పెట్టింది. ముక్కలు, పశువులు, శరీరాలు, చివరకు మనసులు కూడా ఎండిపోయిన సమాజంలో "మనిషికి తప్ప మరే ప్రాణికి నటించటంరాదు" కనుక మానవ జన్మ మహోత్తమమైనదని వెక్కిరింతగా చెప్పటంలో ఈ వ్యాపార సమాజం పట్లా, ఈ వ్యాపార జీవితం పట్లా రేవతీ దేవిగారి దృక్పథం అర్థం అవుతుంది.

ఈ నాగరికత, ఊపిరి, దేహం, ఆత్మ, గమ్యం సమస్తమూ డబ్బేనని, సంస్కృతి, విజ్ఞానం, వ్యాధులూ, చివరకు సత్యం, శివం, సుందరం డబ్బేనని నిర్ద్వంద్వంగా ఈమె కవిత నిశ్చయించింది. ఈ డబ్బు నాగరికతను తిరస్కరించి స్వచ్ఛతలోకి, పవిత్రతలోకి, మానవత్వంలోకి, స్వీయాస్తిత్వంలోకి పయనించాలని ఈమె ఆశ.

ఎవరికీ తెలియని సౌందర్య రూపాలను చూడాలని, నాదస్వరాలను వినాలని, స్నిగ్ధత్వాలను స్పర్శించాలని, పరిమళాల గాఢత్వాలను పీల్చాలని, రుచుల కమ్మదనాలను చవిచూడాలని, అనురాగ మానసాన్ని అద్వైతించుకోవాలనే ప్రత్యేక తపన ఈమెది. అట్లా అని కేవలం తన వైయక్తిక అస్తిత్వమే సర్వస్వమని మిగిలిందంతా శూన్యమనే భ్రమకాదు ఈమెది.

"అన్యాయాల్లేని అక్రమాల్లేని
దోపిడీలేని దగాలేని
అమానుషాల్లేని, అవమానాల్లేని
సామాజిక వ్యవస్థకోసం
మనిషి మనిషిగా బ్రతకటానికి
కావాల్సినవన్నీ అందరికీ సమకూర్చే
సామాజిక వ్యవస్థకోసం."

ఉక్కు శిశువుల్ని ఆవాహన చేస్తున్నది ఈమె. తనేమిటో తను సంపూర్ణంగా తెలుసుకోకుండానే, తన దైనదేదో తాను పొందకుండానే, రసజ్వలిత దాహంతో, సాంద్రలాలసా తప్త వేదనాస్తిత్వంతో ఈ లోకాన్ని వదిలేసింది శ్రీమతి రేవతీదేవి. ★

పడనివాళ్ళు నామీద పన్నిన కుట్ర అని; తొందరలోనే యీ మబ్బులు తొలగిపోయి అంతా క్లియర్ అయిపోతుందని..." అంటూ విస్కీ గ్లాసులోకి వంచుకుని పెగ్ గుక్క మింగాడు. స్కూటర్ కీస్ తీసుకుని బయల్దేరాడు.

"ఎక్కడికి వెల్తున్నాడు తను ?... నిజంగా అమ్మని చూడడానికేనా ? యిదంతా అబద్ధమని చెప్పడానికేనా ?... కాదు. ఇదంతా అబద్ధమని చెప్పలేడు. అమ్మకి అంతా తెలిసిపోయి వుంటుంది... అమ్మకి తన ముఖం చూపలేడు... అమ్మ చూపుల్ని భరించలేడు... తన జీవితం గురించి అమ్మ కట్టుకున్న ఆశల భవంతుల్ని పునాదుల్తోసహా పెకలించివేశాక, యింకా ఆమె ముందెలా నిలబడగలడు తను ?... ఏ ఆశయాల కోసం అమ్మ నాన్నని వదిలి, తన శ్రమతో పిల్లల్ని తన కనుగుణంగా పెంచుకుందో, ఆ ఆశయాలను నిలువునా హతమార్చాక, యింకా ఏ ముఖం పెట్టుకొని వెళ్ళగలడు ఆమె దగ్గరకి ?... నా... నా..."

స్కూటర్ వేగంగా పోతోంది. నలభై నించి అరవైకి, అరవై నించి ఎనభైకి వేగం పెరిగింది. వచ్చేపోయే వాహనాల్ని లెక్క చేయకుండాపోతున్నాడు.

"ఇంటికి వెళ్ళి అమ్మ కాళ్ళమీదపడి క్షమాపణ కోరుకుంటే ?... అమ్మ క్షమిస్తుంది. చేసిన తప్పుల్ని క్షమించడంలోనే దైవత్వ ముందంటారు. అమ్మ తప్పకుండా క్షమిస్తుంది. ఈ నకిలీ జీవితానికి, యీ బురద బ్రతుక్కి స్వస్తి చెప్పమ్మ... కాని... తనలో అంత నిజాయితీ, అంత ఆత్మవిశ్వాసం వున్నాయా ?... మళ్ళీ అమ్మకి 'నీ కొడుకు నువ్వాసించినట్లు గొప్పవాడౌతాడమ్మా ! మనిషిలా తలెత్తుకుని బ్రతుకుతాడమ్మా' అని ఆశలు కల్పించి, అందులో మళ్ళీ ఓడిపోతే ?... నా...నా... అమ్మకి తన ముఖం చూపలేడు... తలెత్తి ఆమె కళ్ళల్లోకి చూడలేడు..."

మరో నిముషంలో — ఎదురుగా వేగంగా వస్తున్న లారీకి ఎదురుగా — వెళ్ళిపోయాడు.

ఇక తల్లికి తన ముఖం ఎలా చూపించాలా అన్న దిగులు లేదు రాజుకి. ఆ ముఖం లారీ చక్రాలక్రింద పడి ముక్కలు ముక్కలైపోయింది. ★

సీరియల్

# అగాధానికి అవతలివైపు

కేవిఎస్వీ

## 6

అంతా చీకటిగా ఉంది అమ్మ పక్కన కూచుని ఉంది సుందరి అమ్మ ఒళ్ళో తమ్ముడు న్నాడు వాడు అప్పుడప్పుడూ ఏడుస్తున్నాడు అమ్మ సముదాయిస్తూ ముందుకు చూస్తోంది.

తెరమీద బొమ్మలు కదులుతున్నాయి.

సినిమా చూడటం చాలా కొత్తగా, వింతగా ఉంది సుందరికి చాలా మంది మధ్యన కూర్చుని ఉండటంచేత కాబోలు, ఉక్కగా అదోరకం వాసనగా ఉంది

లయబద్ధంగా పాట వినిపిస్తోంది తోటలోకి చంద్రుడొచ్చాడు. నీళ్ళలో చంద్రుడి నీడ మెరుస్తోంది. చేతిలో పూల గుత్తులు పుచ్చుకుని, తెల్లటి బట్టల్లో ధగ ధగమని మెరిసిపోతూ తోటంతా గెంతుతూ నవ్వుతూ పాడుతోంది ఒకామె

అమ్మ కన్న చిన్నగా ఉంది ఎంతో బాగుంది ఆమె నవ్వినప్పుడు పళ్ళు తళుక్కున మెరుస్తున్నాయి కళ్ళు పెద్దవిగా ఉన్నాయి ఆ కళ్ళను ఎక్కడో చూసినట్టు అనిపించింది సుందరికి తెరమీద ఆమె కళ్ళు అటూ ఇటూ తిప్పుతుండగా తనూ కళ్ళు తిప్పి చూసుకుంది

బాగా కళ్ళు తిప్పి చూసిన సుందరికి ఇంకో గమ్మత్తు కూడా కనిపించింది. తెరమీద ఆమె తెల్లటి చీరలో ఉన్నా, అది మామూలుగా అమ్మ కట్టుకునే చీరలా లేదు బొమ్మకు కట్టినట్టు బిగుతుగా, అంతా ఒంటికి అతుక్కుపోయి ఉంది

ఆమె నడుస్తున్నా గెంతుతున్నా కదులుతున్నా ఆమె వొళ్ళు భలే వింతగా అనిపిస్తోంది.

రవికెలోంచి ఆమె సొంపులు కన్పించేసరికి ముందు వరసల్లోంచి ఎవరో ఈలలు వేశారు. సుందరి కొంచెం భయపడింది. అమ్మ చేతిని తడిమి పట్టుకుని, "ఏంటమ్మా అదీ ?" అని అడిగింది "ఫ్! . మాట్లాడకుండా సినిమా చూడు ." అంది అమ్మ

సినిమాలో ఏవేవో అనుమానాలొస్తుంటాయి సుందరికి కొన్ని కొన్ని అసలు అర్థం కావు. అర్థం కానివి ఎవర్ని అడగాలో తెలియదు.

ఇంకోసారి ఇంకేదో సినిమా కెళ్ళారు.

చీకటిలో తెరమీద బొమ్మలు కదులుతూంటే, కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తోంది సుందరి

తెరమీద కనిపించే స్త్రీలు అందంగా ఉంటారు

అదిగో—ఆవిడ నవ్వుతోంది కళ్ళు వాలుస్తోంది ఆ కళ్ళు అలా వాల్చటం ఎంతో బాగుంది పలువరస సన్నగా కనిపిస్తూ తళుక్కు మంటోంది

ఆమె పక్కన దర్జాగా దలాకీగా ఒకతనున్నాడు అతనితో ఆమె ఆడుతోంది, పాడుతోంది ఇద్దరూ తోటంతా తిరుగుతున్నారు.

ఆమె పువ్వులను పొదివి పట్టుకుని, తల కొద్దిగా వంచి, వాటిని వాసన చూస్తూ కళ్ళు వారగా అతణ్ణి చూస్తోంది.

అతను సూటిగా చూస్తున్నాడు, ఆమె వేపు ఆమెను చేతులతో తాకుతున్నాడు దగ్గరగా లాక్కుంటున్నాడు ఆమె—చేతులు అడ్డం పెట్టుకునే అతని చేతుల్లో ఒదిగిపోతోంది

ఆమె పైట తొలగుతోంది.

హాల్లో ఎవరో బిగ్గరగా అరిచారు

ఆమె అతన్నుంచి విడిపించుకోబోయి వెనక్కి తూలింది. అతను ఆమెను మెరుపుల దగ్గరికి లాగి గుండెలకేసి హత్తుకున్నాడు సుందరికి ఉన్నట్టుండి ఒళ్ళంతా జలదరించింది.

నిద్రపోయేప్పుడు సినిమాలో దృశ్యాలు తరచు గుర్తొస్తాయి సుందరికి.

## 7

ఎత్తుగా గంభీరంగా ఉంది హైస్కూలు భవనం. ఇక్కడా చిన్నపిల్లల మొదలు పెద్దపిల్లల దాకా చాలామంది ఉన్నారు.

**జరిగిన కథ—1** సుందరి చాలా అందంగా వుంటుంది ఆ పిల్ల కళ్ళు ఇంకా బావుంటాయని చూసినవాళ్ళంతా అనుకొంటుంటారు సుందరికి ఇంట్లో జరిగే తతంగం, బయటి వాతావరణం తెలిసీతెలియనట్టుగా వుండి ఎన్నో ప్రశ్నలకు దారితీస్తాయి ఇంట్లో ఏవో గొడవలు జరుగుతాయి. ఆ తర్వాత తల్లిదండ్రులతోపాటు గుంటూరు నుంచి ఆ వూరుకు వచ్చేస్తుంది సుందరి అక్కడ తండ్రి ఎలిమెంటరీ స్కూల్లో చేరుస్తాడు.

ఎలిమెంటరీ స్కూలునుంచి హైస్కూల్లో అడుగు పెట్టిన సుందరికి కొత్త అంటే బెదురు కాదుగాని, వింతగా మాత్రం అనిపిస్తోంది.

"ఇంక చదవటం ఆపెయ్యమన్నారే మావాళ్ళు ఇంట్లోనే ఉండి పనులు చేసుకోవాలట.." అంది సుబ్బులు, స్కూలు కెళ్ళేదారిలో చింతచెట్టుకింద వీడ్కోలు చెబుతూ, "ఇక మనం కలుసుకోలేం కదూ ?" అంది దిగులుగా ఏడ్పు ఏడ్పు అలిసిపోయినట్టు సుబ్బులు ముఖం చాలా నీరసంగా ఉంది.

"నువ్వు హైస్కూల్లో చేరకపోయినా మనం రోజూ కలుసుకుంటూ వుండొచ్చులే యేం " అంది సుందరి ఓదార్పుగా అదెలాగూ వీలుపడదని ఎందుకో అనిపించింది

హైస్కూల్లో వేరే పిల్లలతో పరిచయాలు కలిగాయి. సుబ్బులు అప్పుడప్పుడూ సుందరి ఇంటికి వచ్చినా, సుందరి ఆ పిల్లతో సరిగ్గా మాట్లాడలేదు క్రమంగా సుబ్బులు స్నేహం మాసిపోయింది

నాగలక్ష్మి హైస్కూల్లో చేరిందిగాని, సుందరి చేరినదాంట్లోకాక వేరే స్కూల్లో చేరింది. అప్పుడప్పుడూ వీధిలో తారసపడుతూ ఉంటుంది, అంతే.

రజని, నీరజ, శాంతి, వాసంతి — ఇలా కొందరు కొత్త స్నేహితురాళ్ళు ఏర్పడ్డారు సుందరికి

తను ఇతర అమ్మాయిలలాగా కాదు అందరిలోనూ తనకు ప్రత్యేకమైన స్థానం ఉంది — అని సుందరికి ఎప్పుడూ అనిపిస్తూ ఉండేది

కొత్త అమ్మాయిలు తనతో చనువుగా ఉండటానికి ప్రయత్నిస్తున్నారు అబ్బాయిలు కొందరు తనకేసి ప్రత్యేకంగా ఎందుకో చూస్తారు టీచర్లు పాఠం చెబుతూ మాటిమాటికీ తనకేసే చూస్తారు.

అద్దంలో ముఖం చూసుకుంటోంది సుందరి. అలా ఎంతసేపయినా చూసుకుంటూనే ఉండిపోవాలనిపిస్తుంది.

"ఏవిటే— అలా చూసుకుంటున్నావ్ ?" అంటుంది తల్లి

తల్లి చూడకుండా, ఎవరూ చూడకుండా— అద్దంలో చూసుకుంటుంది సుందరి

"అబ్బ . నీ కళ్ళు ఎంత బావుంటాయే సుందరీ..." నీరజ మాటలు గుర్తొస్తాయి

సుందరి కళ్ళు తిప్పుకుంది.

అద్దంలో సుందరి కళ్ళు తిప్పుతుంది

"సుందరీ — నీ కళ్ళు నిజంగా ఎంత బావుంటాయే!" అనుకుంది సుందరి,

ఒక దినం స్కూలునుంచి వచ్చేసరికి పక్కింటి ముందు బళ్ళు ఆగి వున్నాయి ఇంట్లోంచి సామాన్లు తెచ్చి వాటిలో సర్దుతున్నారు రమణా, కృష్ణ, వైదేహీ— దిగులుగా ఉన్నారు. సుందరిని చూస్తూనే ముఖాలు ఇంకా వ్రేళ్ళాడేసుకున్నారు.

"మేం వెళ్ళిపోతున్నాం. ." అన్నాడు రమణ

"సుందరీ... ఇంక నిన్ను చూడం కదూ?" అంది వైదేహి, గుడ్ల నీళ్ళు కమ్ముతుండగా. "మరే— ఇక్కడే— ఈ వూళ్ళోనే ఉండిపోనిమ్మని, మా నాన్న ఎంతగా అడిగినా ఆఫీసువాళ్ళు ఒప్పుకోలేదుట. ." అన్నాడు కృష్ణగాడు, గొంతు బొంగురుపోతుండగా.

సుందరికి ఏం చెప్పాలో తోచలేదు. అలాగే చూస్తూ నిలుచుంది

పిన్నిగారొచ్చి సుందరిని దగ్గరికి తీసుకుని ముద్దాడి, "దిగులుపడకే సుందరీ.. మళ్ళీ ట్రాన్స్‌ఫరు పెట్టించుకుని ఇక్కడికే వొచ్చెయ్యమూ " అంది

వాళ్ళు వెళ్ళిపోతున్న విషయం తల్లికి తెలీదేమో అనుకుంది సుందరి తెలిస్తే, వాళ్ళని ఉండి పొమ్మంటే– ఉండిపోరా వాళ్ళు?– అనుకుంది. కాని పైకి అనలేదు

రమణ బండిదగ్గరున్నాడు కృష్ణ వైదేహిలతో బాటు పిన్నిగారు సుందరి ఇంటికొచ్చింది. అమ్మ వాళ్ళతో నవ్వుతూ మాట్లాడింది, బరిణ తీసి, కుంకుమ పిన్నిగారి నుదుటను పెట్టింది గడపదాకా సాగనంపింది బళ్ళు కదిలాయి దూరమయ్యాయి మలుపు తిరిగాయి చూస్తూ నిలుచుంది సుందరి

ఆదివారమొస్తే ఏమీ తోచకుండా అయిపోతుంది సుందరికి

ఇదివరకు కాస్తంత వీలు చిక్కితే పక్కింటి కెళ్ళి ఆడుకుంటూ వుండేది

పక్కింటివాళ్ళు వెళ్ళిపోయిన లోటు ఇప్పుడు బాగా తెలిసివస్తోంది. ఆ ఇంట్లో కొత్తవాళ్ళు ఎవరో దిగారుగాని వాళ్ళందరూ పెద్దవాళ్ళే.

ఇదివరకటిలా తోడు ఎవరూ లేకపోయేసరికి తప్పనిసరిగా తమ్ముడితోనే ఆడుకోవలసివస్తోంది సుందరికి.

"అమ్మా – వీడి పేరేవిటమ్మా?" అని అడిగింది సుందరి

తల్లి వెంటనే ఏమీ మాట్లాడలేదు. కాస్సేపయాక, "వాళ్ళ నాన్న నడగాలి " అంది సన్నగా. ఆ మాటలో ఏదో రహస్యం ఉన్నట్టు అనిపించింది సుందరికి, ఎందుకోగాని

"నాన్నని నేను అడుగుతాలే "

"ఊఁహూఁ వొద్దు పోనీ నువ్వు చెప్పు సుందరీ ఏం పేరు పెడదాం? "

స్కూల్లో అబ్బాయిల పేర్లన్నీ గుర్తు చేసుకుంది సుందరి తమ్ముడికేది సరిపోతుందో తోచలేదు

మరుసటి రోజాకల్లా తమ్ముడికి పేరు పెట్టేసింది అమ్మ – "సురేష్ – అని పిలుద్దామే వీణ్ణి "

రెండు మూడు సార్లు ఆ పేరు పలికి చూసుకుంది సుందరి వాణ్ణి పిలిచి చూసింది. మెల్ల మెల్లగా ఆ పేరు తనదని గుర్తించేశాడు వాడు తమ్ముణ్ణి సుందరి పిలుస్తుంటే నవ్వుతూ చూస్తుంది తల్లి "ష్–ష్– అనవేంటే సుందరీ వాడి పేరు సురే – కాదు. సురేష్...ష్ ."

"ష్ " అంటుంది సుందరి

కళ్ళు చికిలించి నవ్వుతూ "ష్" అంటాడు 'సురేష్' కూడా

## 8

స్కూలు అయింతర్వాత సుందరిని ఇంటిదాకా దిగబెట్టి వెళ్దామని వచ్చారు రజని, శాంతి.

తల్లి గడపలోనే ఉండటం అంత దూరం మంచే చూసింది సుందరి.

"ఇక మేం వెళ్తాం సుందరీ –" అంది శాంతి

"లోపలికి రండమ్మా – కాస్సేపు కూచుని వెళ్దురుగాని –" అని పిలిచింది తల్లి. అలా అంటూ రోడ్డుమీదికి చూస్తూ, "సుందరీ ఆ అబ్బాయెవరు?" అని అడిగింది

సుందరి చూసేంతలో రజని, "అరె – మన సుధాకర్!" అంది ఆశ్చర్యంగా

వీళ్ళందరూ చూడటం చూసి ఆ అబ్బాయి తడబడుతూ వెనక్కితిరిగి తలొంచుకుని వచ్చినదారినే వెళ్ళిపోయాడు అతని చేతిలో పుస్తకాలున్నాయి

"అవునాంటీ! సుధాకర్! మా క్లాసబ్బాయే! మా వెనకే వచ్చాడన్నమాట అలాగే వెళ్ళిపోతున్నాడే " అంది శాంతి అమాయకంగా

అర్థంకాకుండా తల్లివేపు చూసింది సుందరి ఆమె సన్నగా నవ్వింది "సరేలే లోపలికి రండి " అంది

ఆ రాత్రి భోంచేస్తుండగా తండ్రి ఆ కబురూ ఈ కబురూ చెప్తూ మెల్లగా అన్నాడు "సుందరీ నీకు అందరూ ఆడపిల్లలేనా స్నేహం? అబ్బాయిలెవరూ నీ జట్టు ఉండరా? "

బేలగా చూసింది సుందరి గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నించింది ఒకరిద్దరు అబ్బాయిలు తనతో అప్పుడప్పుడూ మాట్లాడటం గుర్తొచ్చింది

"అబ్బాయిలు ఎవరైనా మాట్లాడితే వాళ్ళతో మామూలుగా మాట్లాడాలి. ఇవాళ రజని, శాంతి వాళ్ళని తీసుకొచ్చావు చూడు అట్లాగే అబ్బాయిలు స్నేహితులైతే వాళ్ళను కూడా మనింటికి తీసుకు రావాలి ఏం "

ప్రత్యేకించి తండ్రి ఈ విషయం ఎందుకిలా చెప్తున్నాడో అర్థం కాకున్నా, 'అలాగే' అన్నట్లు తల ఊపింది సుందరి.



సాయంత్రం తమ వెంటే సుధాకర్ రావటమూ తలొంచుకుని వెనుదిరిగి పోవటమూ గుర్తొచ్చింది.

రెండింటికీ ఏదో సంబంధంఉన్నట్టనిపించింది.

## 9

ఒక సాయంత్రం సుందరి తిరిగొచ్చేసరికి తల్లి ఇంట్లో ఎవరో ఒక కొత్త మనిషితో మాట్లాడు తోంది.

"చాక్లెట్ల అంకుల్ .. గుర్తున్నాడా సుందరీ ?. ." అంది తల్లి.

ఆయిన సుందరిని దగ్గరికి తీసుకుని బుగ్గలు పుణికాడు.

లీలగా ఏదో గుర్తొంది గాని, ఎంత ప్రయత్నించినా ఆయన్ని పోల్చుకోలేక పోయింది సుందరి.

అంతలో తండ్రి వచ్చాడు. వస్తూనే కొత్త మనిషిని చూసి ఆశ్చర్యపోయి, మాట్లాడకుండా లోపలికి వెళ్ళాడు వెళ్తూ, "సుందరీ ఇలా రా. " అని పిలిచాడు.

గొంతుల్ని బట్టి, కాస్సేపటికి ఆ 'అంకుల్' వెళ్ళిపోయినట్టు గ్రహించింది సుందరి.

ఆ తర్వాత చాలా సేపటిదాకా తల్లీ తండ్రీ వొకర్తో వొకరు మాట్లాడుకోలేదు

రాత్రి సగం నిద్రలో మెలకువొచ్చింది సుందరికి

తండ్రి అంటున్నాడు "పిల్లలు పెరిగి పెద్ద వాళ్ళవుతున్నారు ఇలా ఏం బావుంటుంది వూరు మారినా ధ్యాస వొదల్దా . ఆ మనిషిని మాత్రం రావద్దను అంతకయితే ఏదో వంకబెట్టి నువ్వే "

"చాల్లే " కోసినట్టుంది తల్లి గొంతు, "ఇంకెప్పుడూ రాడు సరేనా? అది చెప్పటానికే వొచ్చాడు . ఇంకా వంకబెట్టటం ఎందుకూ ? ఇప్పటికిట్లా తెల్లారింది ."

తల్లి గొంతు ఎంతో వింతగా అనిపించింది.

"సుందరీ . నువ్వింకా నిద్రపోలా ?"

కళ్ళు మూసుకు పడుకున్న సుందరి తలలో అస్పష్టమైన ఎన్నెన్నో భావాలు వలయాలు వలయాలుగా తిరగటం మొదలెట్టాయి.

తల్లీ తండ్రీ— ఎవరో మూడో మనిషి గురించి ఎందుకిట్లా తనకు తెలియకూడదన్నట్టు మాట్లాడు కుంటారు ?

ఏదో దృశ్యం ఏదో మాట. ఒక మధ్యాహ్నం . తల్లి ఏడుపు .

అలిసిపోయింది సుందరి అలాగే నిద్రపోయింది.

# అందానికి అవతలివైపు

## 10

బస్‌స్టాప్‌లో ఉదయపు ఎండ లేత బంగారంలా మెరుస్తోంది.

"అబ్బ... వచ్చావా సుందరీ నీకు గుడ్ మార్నింగ్ చెప్పాలని మా అన్నయ్య అరగంట నుంచీ కాచుకున్నాడు—" అంది పల్లవి, అన్నయ్య సుమంత్‌ను ఆటపట్టిస్తూ.

"గుడ్ మార్నింగ్ సుందరీ "

"మార్నింగ్ "

"సుందరీ— ఈ కోతి మాటలు నమ్మకు అసలే నా స్కూటర్‌కు స్టార్టింగ్ ట్రబులుంది ఇక్కడ ఈ మహాతల్లిని డ్రాప్‌చేసి అట్నుండా వెళ్ళిపోదామంటే — ససేమిరా అంది. నువ్వొచ్చేదాకా కంపెనీ కావాలట. తననే స్కూటర్ నేర్చుకొమ్మన్నా వినదు . " పచ్చ స్కూటర్ ప్రక్కనే పాలికేళ్ళ సుమంత్ తెల్లబట్టల్లో ఆకర్షణీయంగా ఉన్నాడు.

"సరే— ఇహ నువ్వెళ్ళొచ్చు—" అంది పల్లవి

సందిగ్ధంగా కదలబోయి ఆగిపోయాడు సుమంత్ : "పోనీలే — బస్సెక్కాండి — చూసి వెళ్తాను .."

నవ్వుకుంది సుందరి.

బస్సు రానే వచ్చింది. చెయ్యూపుతూ అన్నయ్యకు టాటా చెప్పింది పల్లవి. అతణ్ణి చూస్తూ కిటికీలోంచి నవ్వింది సుందరి

"ఎంత వరకు వచ్చింది మీ అన్నయ్య ఉద్యోగ ప్రయత్నం ?"

"అంటాడేగాని— వాడు దేన్నీ సీరియస్‌గా తీసుకోడు ఏం అవస్థలు పడతాడో మహానుభావుడు. నాన్నగారు ఇంజనీర్‌గా కాస్త వెనకెయ్యబట్టి ."

"ఆపవే బాబూ... కదిలిస్తే చాలు ఆరిందాలాగా మాట్లాడతావు..."

"అవునుగాని సుందరీ...ఈపైట కొత్తదా భలేవుంది నీకు .. రెడ్ అయినా బాగుంది నీకు.. నాకు బాగుండదు నాకు ఆరింజ్ అయితేనే. సరేగాని నువ్వు చీరలెప్పుడు కడతావ్ ? .."

"ఏం తొందర ?.. " ఎరగనట్టు అడిగింది సుందరి.

"తొందరేమరి" అంది పల్లవి, గడుసుగా చూపు దించుతూ.

"ఏయ్ పాడుపిల్లా ." అంది సుందరి స్నేహితురాలికేసి తెచ్చికోలు కోపంతో చూస్తూ

సుందరి చెవుల్లో లీలగా తల్లి గొంతు వినిపించి నట్టయింది — "చూడు సుందరీ ఆశలకు అంతు లేదు ఉన్నంతలో సర్దుకుపోవాలి మనం అందరికీ అన్ని బట్టలూ ఉండవుగా దానికేముంది ? శుభ్రంగా ఉండాలి. అంతే మనకు స్థితి ఉంటే బీరువానిండా బట్టలుంచుకుని, విడిచింది ఏడాదికిగాని కట్టకుండా దర్జా వెలిగించవచ్చు అంతవరకూ ఉతికి కట్టుకున్నా, తప్పేం ?"

"నీకో సంగతి చెప్పనా ?" అంది పల్లవి

"అదేంటే — అడగాలా వేరే "

"ఇందాకా నువ్వు దూరంగా వొస్తుంటే అన్నయ్యన్నాడూ. సుందరిని చీరలో చూడాలమందే పల్లూ అన్నాడు "

"ఊహూ. బాగానే ఉందే పల్లూ ఇట్లాంటి కబుర్లు చెప్పటానికి నువ్వూ బాగానే పొగయ్యావు అయినా, మీ అన్నయ్య ఇలా అనటమేం బాగులేదు .."

"కోపమొచ్చిందా ? మళ్ళీ వాడితో అనేవ్ చిన్నబుచ్చుకుంటాడు ఇంతకీ ఇందులో వాడి తప్పేంలేదు అలా చూడకు. ప్రామిస్‌గా చెప్తున్నా నా చీర గురించి మొదలయింది. జనరల్‌గా చీరల గురించి మాట్లాడుతున్నాం . సరిగ్గా అప్పుడే నువ్వు కనిపించావ్ మరి. "

"చాల్లే కాలేజొచ్చింది...దిగుమరి . అన్నకు తగ్గ చెల్లెలివే కదూ ? " బస్ దిగుతూన్న సుందరిలో సుమంత్ రూపం మెదిలింది. సన్నగా నవ్వుకుంది.

## 11

పల్లవికి దూరపు బంధువులమ్మాయి వీణ బియ్యే చదువుతోంది హాస్టల్లో ఉంటోంది.

బియ్యేస్సీ క్లాసు రూముల వరండా చివర నిలుచుని ఉంది వీణ

క్లాసు వదిలారు సుందరీ పల్లవీ నవ్వుకుంటూ వస్తున్నారు అలసట ఉన్నా సుందరి ముఖంలో ఉత్సాహానికేమీ లోటు లేదు.

"హాయ్ వీణా! హౌ ఆర్యూ ?. . క్లాసు ల్లేవేంటి ? —"

సుందరి దగ్గరికొచ్చి భుజంమీద చెయ్యేసింది వీణ "లాస్టవరు లేదు అందరూ వెళ్ళిపోయారు






## ఇవేమన పద్యాలు







నేను నీకోసమే కాచుకున్నా.. హాస్టలు కొస్తానన్నావుగా ఇవాళ... రా వెళ్దాం..."

"నేను మాత్రం ఇంటికెళిపోతున్నా " అంది పల్లవి కవ్వింపుగా.

"వొద్దు. నువ్వుకూడా ఉండు. నువ్వెళ్తే సుందరి కూడా నీతో వొచ్చేస్తుంది "

"బస్ దొరకదు మళ్ళీ —"

"ఆరు గంటల ట్రిప్‌లో వెళ్దురుగాని . ఏం సుందరీ ? "

"సుందరేగాని నా గొడవేం పట్టదన్న మాట అసలు మీకిద్దరికీ పరిచయం చేసుండాల్సింది కాదు నేను సరే— పదండి మరి అయినా నాకు తెలీకడుగుతాను— సుందరి అందంగా ఉంటుంది — వొప్పుకున్నాం ఎంతసేపు చూసినా ఆ ముఖమే కదా నువ్వేం మొగపిల్లాడివా "

పల్లవి మాటంకు చిరాకు పడుతూ చూసింది వీణ పసితనపు చాయలు ఏ మాత్రమూ వదలని ఆ ముఖంలో— ఒక్క సుందరి మాత్రమే తనని అర్థం చేసుకుంటుందనే భావం కనిపించింది. "చూడు సుందరీ ఎలా అంటుందో . అందుకే తనంటే నేను కేర్ చెయ్యను .." అంది

సర్ది చెబుతున్నట్టుగా అంది సుందరి "ష్ . నా మూలంగా మీరిద్దరూ గొడవపడతారెందుకూ ? డ్రాపిట్ ! వదిలెయ్యండి ! వేరే ఏమన్నా కబుర్లు చెప్పుకుందాం ..."

ముగ్గురూ హాస్టల్ మెట్లెక్కారు

ఎందరు ఆడపిల్లల మధ్య అయినా సుందరికి ప్రత్యేకమైన గుర్తింపు ఉందని తెలిసిపోతూనే ఉంటుంది సుందరి కళ్ళబడగానే వాలకాలు మారిపోతాయి. కొందరు వారగా అసూయగా చూస్తారు కొందరు ఎగాదిగా చూస్తారు, కళ్లలో మెచ్చుదల మెరుపులతో. కొందరు, "ఎవరా అమ్మాయి ?" అని ప్రక్కనున్న వారిని వాకబు చేస్తారు

జనం మధ్యగా ఉంటే గొప్పగా ఉంటుంది సుందరికి

"సుందరీ నేను నీ ప్రక్కన ఇంక నడవనే " అంది పల్లవి "నాకు చాలా జెలస్‌గా ఉంటుంది కనీసం నువ్వీ రెడ్ హాఫ్‌శారీ వేసుకున్నప్పుడన్నా నిన్ను అవాయిడ్ చేస్తాను ."

"పోనీ— నువ్వూ వో రెడ్ తెచ్చుకో—" అంది వీణ, కొద్దిగా అక్కసు కనబరుస్తూ

"చాల్లే. . ఇంతకీ నీ రూంలో మేత ఏమన్నా దొరుకుతుందా ? " మాట మారుస్తూ అంది పల్లవి.

## 12

"సుందరీ ఇంకా పడుకోలేదూ అర్థరాత్రయింది "

"ఇదుగో— ఈ ఛాప్టరు చదివేసీ "

పరీక్షలు ఇంకా రెండు నెలలున్నాయి. అయినా దీక్షగా చదువుతోంది సుందరి రేపు ప్రొద్దున్నే పరీక్ష— అన్నంత పట్టుదలగా చదువుతోంది.

తల్లి పలకరింపుకి జవాబు చెప్పినా, కాస్త అంతరాయం కలిగింది సుందరికి

చదువుతున్న పుస్తకం మూసేసి విశ్రాంతిగా కుర్చీలో వెనక్కి జేరగిలబడింది కళ్ళు మూసుకుంటే దృశ్యం కనబడింది, మాటలు వినిపించాయి ·

మామూలుగా అతి సీరియస్‌గా ఉండే మేథ్స్ లెక్చరర్ — హాఫియర్లీ టెస్ట్ పేపరు ఇస్తూ నవ్వుతూ అంటోంది "సుందరీ నువ్వు చాలా బాగా చేశావు కీపిటప్ కాలేజీ ఫస్టు మాత్రమే కాదు యూనివర్సిటీ ఫస్టు రావాలి నువ్వు..."

హాస్టలు వరండాలో భుజంమీద చెయ్యేస్తూ అంది వీణ "నీ అందం రహస్యం నా కెప్పుడో తెలుసు సుందరీ లోపల అద్భుతమైన తెలివి తేటలు లేకుంటే ఈ కళ్ళలో ఇంత ఆకర్షణుండదు యువర్స్ ఈజ్ ఇంటలెక్చువల్ బ్యూటీ "

నిజమైన అసూయతోనే అంది పల్లవి "దేవుడు ఎంత దుర్మార్గుడు ! ఉన్నవాళ్ళకే అన్నీ ఇస్తుంటాడు సుందరీ పోనీ నీ స్నేహితురాలిని కదా నీ అందంలోనో తెలివిలోనో కొంత వాటా నాకు ఇచ్చెయ్య కూడదా ? "

"బాగా చదువుకో సుందరీ " అమ్మ గొంతులో ఆశా, విశ్వాసమూ

"అక్కాయ్ స్కూల్లో నాకు లెక్కల్లో ఎప్పుడూ జీరో మార్కే రోజుకో గంట ట్యూషన్ చెప్పక్కాయ్! " తమ్ముడు సురేష్ అభ్యర్థనలో అభిమానం

సుందరి పెదవులమీద సన్నటి నవ్వు మెదిలింది "ఎంత మందికి నా మీద ఎన్ని ఆశలు!" అనుకుంది లేచివెళ్ళి మంచినీళ్ళు తాగింది ప్రక్కనే ఉన్న అద్దంలో సుందరి కనబడింది "ఎంతమందికి నీమీద ఎన్ని ఆశలు సుందరీ -" అంది సుందరి అద్దంలో సుందరితో

అందమైన కళ్ళు అలిసి బరువుగా మూతబడుతున్నాయి లైటార్పి పడుకుంది సుందరి

కళ్ళు మూసుకుంటే — చీకటిలో — తెరిచిన పుస్తకంలో అచ్చు గీతలు కదిలిపోతున్నాయి

(ఇంకా వుంది)

# బొంబాయి బైస్కోప్

శ్రీమతి దుర్గ

## మరో స్టార్ డైరెక్టర్

రాజ్‌కపూర్, మనోజ్‌కుమార్, దేవానంద్ ఇలాగ చాలామంది స్టార్స్, డైరెక్టర్స్ కూడా అయారు. జుబిలీ కుమార్‌గా పేరు తెచ్చుకొన్న విన్నటి రోమాంటిక్ హీరో రాజేంద్రకుమార్ కూడా డైరెక్టరవుతున్నాడు. లవ్‌స్టోరీ చిత్రంతో తను నిర్మాత అయాడు. కొడుకు కుమార్‌గౌరవ్‌ని హీరోని చేశాడు రాజేంద్రకుమార్. ఇప్పుడు 'సీతాకోకచిలుక'ని 'లవర్స్' గా హిందీలో అందిస్తున్నాడు. ఈ 'లవర్స్' పూర్తికాగానే ప్రారంభించే సొంత చిత్రానికి రాజేంద్రకుమార్ డైరెక్టర్ కూడా అవుతున్నాడు. చిత్రం పేరు 'గౌరవ్'. ఇందులో హీరో కుమార్ గౌరవ్.

"డైరెక్షన్ అంటే ఏందంట... జనానికి అర్థం అయేలా కత చెప్పడం... అంతే" అన్నారు కీర్తిశేషులు చక్రపాణిగారు. డైరెక్టర్‌గా రాజేంద్రకుమార్ ఏం కత చెప్తాడో ఎలా చెప్తాడో లెట్'స్ వెయిట్ అండ్ సీ...



కుమార్ గౌరవ్



దివ్య, రాజీవ్ కపూర్

## మరో కపూర్...

రాజ్‌కపూర్ తన కొడుకు రణధీర్‌కపూర్ (డబ్బూ)ని సొంత చిత్రం 'కల్ ఆజ్ ఔర్ కల్'తో చిత్రరంగ ప్రవేశం చేయించాడు. తన మరో కొడుకు రిషీకపూర్ (చింటూ)ని సొంత చిత్రం 'బాబీ'తో హీరోగా రంగ ప్రవేశం చేయించాడు. ఇప్పుడు రాజ్‌కపూర్ ఆఖరి కొడుకు రాజీవ్‌కపూర్ (చింపూ) కూడా హీరోగా రంగప్రవేశం చేస్తున్నాడు. అయితే రాజ్‌కపూర్ సొంత చిత్రంతో మాత్రం కాదు. నిర్మాత కైలాస్ చోప్రా, త్రిలోక్ చందర్ దర్శకత్వంలో నిర్మిస్తున్న 'శుక్రియా' చిత్రంతో రాజీవ్‌కపూర్ రంగప్రవేశం చేస్తున్నాడు. ఇందులో పద్మిని కొల్హాపూరి హీరోయిన్. రాజీవ్‌కపూర్ హీరోగా మరో చిత్రంకూడా ప్రారంభమయింది. ఎఫ్. సి. మెహ్రా నిర్మించే "ఏక్‌జాన్‌హైహమ్" అనే ఈ చిత్రానికి నిర్మాత కుమారుడు రాజీవ్‌మెహ్రా దర్శకత్వం వహిస్తున్నాడు. ఇందులో దివ్య అనే కొత్త అమ్మాయి హీరోయిన్.

రణధీర్‌కపూర్, రిషీకపూర్ ఇద్దరూ కూడా పేరూ, ప్రఖ్యాతల్లోగానీ, నటనలోగానీ, తండ్రి స్థాయిని అందుకోలేకపోయారు. మరి రాజీవ్‌కపూర్ ఏం చేస్తాడో... వేచి చూద్దాం...

## నిజమైనమిత్రుడు శత్రు...

సతీష్‌ఖన్నా అనే ఒక నిర్మాత 1979లో తన మిత్రుడైన వినోద్‌ఖన్నాతో 'కరన్' అనే చిత్రం ప్రారంభించాడు. చిత్రం ఆరంభానికి ముందు 'నీకెందుకు నేనున్నాను' అని హామీ ఇచ్చిన వినోద్‌ఖన్నా షూటింగ్ ఆరంభమయ్యాక షూటింగ్‌కి సరిగ్గా వచ్చేవాడు కాదు. ఏదో సాకు చెప్పేవాడు. 1981 వచ్చింది. మొత్తంమీద అప్పుడో రోజు అప్పుడో పూట షూటింగ్ చేస్తూ 11 రీళ్ళు చిత్రం తయారయింది. 1981లో హఠాత్తుగా అమెరికా వెళ్ళిపోయాడు వినోద్‌ఖన్నా. ఇదిగో వస్తున్నా అంటూనే నెలలు గడిపేశాడు. 1982 వచ్చింది. వినోద్‌ఖన్నా రాలేదు. నిర్మాతనే అమెరికా వచ్చి షూటింగ్ చేసుకోమన్నాడు. అప్పటికే అప్పుల్లో మునిగిన సతీష్‌ఖన్నా తనవల్ల కాదన్నాడు. ఈ చిత్రం నుంచి విరమించుకున్నట్టు తనకో ఉత్తరం పారేస్తే వేరే హీరోతో చిత్రం చేసుకుంటా నన్నాడు నిర్మాత. వినోద్‌ఖన్నా అదీ చెయ్యలేదు. 1982 కూడా ముగిసిపోతోంది. మిత్రుడు శత్రువు కావడంతో తన మరో మిత్రుడు శత్రుఘ్నసిన్హాని కలిసి జరిగినదంతా చెప్పాడు సతీష్‌ఖన్నా. అంతవరకూ తయారైన 11 రీళ్ళూ శత్రుఘ్నకి చూపించాడు. అందులో వినోద్‌ఖన్నా ధరించిన పాత్ర శత్రుఘ్నకి చాలా నచ్చింది. పైసా తీసుకోకుండా ఆ చిత్రంలో తను హీరోగా నటించి మిత్రుడైన సతీష్‌ఖన్నాకి సహాయం చేస్తానన్నాడు శత్రుఘ్నసిన్హా. 1982 ఆఖరులో 'కరన్' పేరు 'కార్‌నామా'గా మార్చి శత్రుఘ్నసిన్హా హీరోగా షూటింగ్ ప్రారంభించాడు సతీష్‌ఖన్నా.

ఈ సినీ మాయాబజార్‌లో అసమదీయులెవరో తసమదీయులెవరో గుర్తించడం చాలా కష్టం మరి...

శత్రుఘ్నసిన్హా



1983 బొంబాయి
బిజీ తార
జయప్రద

తాజా వార్తలతో పాటు
తాజా సినిమా కబుర్లు
అందించే
ఏకైక దినపత్రిక....




దినపత్రిక కావలసినవారు మా వారపత్రిక అమ్మేచోట అడగండి.
లేదా మా ఏజెంటును సంప్రదించండి.

GEET

# స్క్రీన్‌ప్లే అంటే ఏమిటి?

జి.వి.జి.

ఎప్పుడో జరిగినట్లు రాయబడినది "కథ "

ఇప్పుడు కళ్ళెదుట జరుగుతూన్నట్లు చూపించేది "సినిమా "

అంచేత, కథా శిల్పానికి, వెండితెర శిల్పానికీ ఎంతో తేడా ఉంది

తొలిసారిగా ఓ సినిమా స్క్రిప్టును చూసిన ఒక నాటక రచయిత "ఓస్— ఇంతేనా సినిమా స్క్రిప్టు అంటే? పేజీకి ఎడమ వైపున పాత్రల ఆక్షన్, కుడివైపున పాత్రల సంభాషణలు. . ఇంతే కదా?" అన్నాడట

అతను చెప్పింది కొంతవరకు నిజమే. కాని, మరొకటి ఉంది చాల ముఖ్యమైనదే ఆది అదే స్క్రీన్‌ప్లే,

రుచికరమైన వంట తిన్నవారు "వంటగదిలో ఉప్పులో పాటు మిగ్గిరెండు దినుసులూ ఉంటే, ఎవరైనా ఇంత రుచికరంగానే వండగలరు," అని తేలిగ్గా అంటారేగాని, ఆ పదార్థాలన్నిటినీ తగుపాళ్ళలో వేసే కనిపించని చెయ్యి గురించి ఆలోచించరు రుచికరమైన వంటను తయారుచేసే విధానం నేర్పే 'బోధిని' ఎలాంటిదో, సినిమాకు 'స్క్రీన్‌ప్లే' అంత ముఖ్యమైనది.

సినిమాలు వచ్చిన తొలి రోజుల్లో తెరమీద ఏ బొమ్మ కదిలినా ఆనందించేవారంతా రేవును వదలి నౌక వెళ్లే దృశ్యాన్ని కాని, ప్లాట్‌ఫామ్ మీదికి రైలు వచ్చే దృశ్యాన్నికాని— అందరూ సంభ్రమాశ్చర్యాలతో చూసేవారు అటువంటి షాట్‌లకు ఆ రోజుల్లో సినిమా స్క్రిప్టు అంటూ వుండేది కాదు— ఏవో డయాగ్రామ్‌లు తప్ప

తొలుదొల్త లూమియర్ బ్రదర్స్ నిర్మించిన "వాటరింగ్ ది గార్డెన్" హాస్య చిత్రంలో ఒక హాస్య సంఘటనకు మాత్రం ముందుగా స్క్రిప్టు తయారు చేయబడింది

ఒక తోటమాలి రబ్బరు గొట్టం ద్వారా మొక్కలకు నీళ్ళు పోస్తూంటాడు ఇంతలో ఒక కుర్రాడు వచ్చి ఆ హోస్‌ను తొక్కుతాడు నీరు చిమ్మడం ఆగిపోతుంది తోటమాలి తికమకలు పడుతూ ఆ రబ్బరుగొట్టం కొసను తనకళ్లెదురుగా ఉంచుకొని, అందులోకి అయోమయంగా చూస్తాడు అప్పుడు కుర్రాడు అప్రయత్నంగా ఆ హోస్ మీది నుంచి తన కాలును తీసేస్తాడు వెంటనే ఆ తోటమాలి ముఖంమీద పైప్ నీరు చిమ్ముతుంది అతను పూర్తిగా తడిసిపోతాడు

ఇదంతా లాంగ్ షాట్‌లో తీయబడింది

ఇదే తొలి స్క్రీన్‌ప్లే అనుకోవాలి

ఆ తర్వాత "ది గ్రేట్ ట్రెయిన్ రాబరీ" చిత్రం కోసం పోర్టర్ అనే అమెరికన్ స్క్రీన్‌ప్లే తయారు చేశాడు— అదీ అసంపూర్ణంగానే

ఫిలిమ్ ఎడిటింగ్‌లో ఒక పరిణతి ఏర్పడ్డాకే స్క్రీన్‌ప్లే ఆవశ్యకత గుర్తింపులోకి వచ్చింది "లాంగ్, మిడ్, క్లోస్" షాట్లతో రసస్ఫూర్తి కలిగించవచ్చని 'గ్రిఫిత్' అనే అతను చూపించిన తర్వాతే 'కొన్ని అసంపూర్ణమైన షాట్లను ఏరి, వరుసక్రమంలో కూర్చడం ద్వారా ఒక సన్నివేశాన్ని రక్తి కట్టించవచ్చు' అని అందరూ ఈ పద్ధతికి అలవడ్డారు

స్టేడియంలో గేలరీలో కూర్చొని క్రికెట్ చూసే వ్యక్తి క్రికెట్ బాల్‌ను 'కేచ్' పట్టడం దూరం నుంచి (లాంగ్ షాట్‌లో లాగా) చూసినా— ఆనందోద్రేకంతో లేచి నిలుచుంటాడు అదే సినిమాలో అయితే, ఆ కేచ్ పట్టడాన్ని ఏ క్లోస్ మిడ్ షాట్‌లోనో చూసినప్పుడే అంతటి రసాను భూతిని పొందగలడు.

"నువ్వీ కథకు ట్రీట్‌మెంట్ తయారు చేయాలి," అని సుప్రసిద్ధ దర్శకుడు స్వర్గీయ బిమల్‌రాయ్ అడిగితే, అదేమిటో తనకు తెలియదని చెప్పేశాడట ఓ యువ రచయిత అప్పుడు బిమల్ రాయ్ "ఈ కథ మొదటి నుంచి చివరి వరకు నీ కళ్ళెదుటే జరుగుతున్నట్లు ఊహించు నీకు తోచిన వాటిని కాగితంమీద నోట్ చేసుకో అదే స్క్రీన్‌ప్లే సంఘటనలు వాటంతటవే ప్రేక్షకుల హృదయాలకు హత్తుకు పోవాలేగాని, ప్రతి పాత్ర మానసిక స్థితి గురించి నువ్వు ప్రత్యక్ష వ్యాఖ్యానంగా చెప్పకు పోకూడదు చెప్పదలచుకున్నది— సన్నివేశాల ద్వారా, పాత్రల రియాక్షన్ ద్వారా చూచాయగా తెలియ జేయాలి ఇంతకు మించి సినిమా స్క్రిప్టుకు వేరే శాస్త్రమేదీ లేదు," అన్నాడట.

కథలను అల్లడం కన్నా— వాటిని తెరపై మలచడమే కష్టమైన పని

"ఆ సూర్యోదయం ఎంతో ఆహ్లాదకరంగా ఉంది ." అని కథకుడు ప్రారంభించాడను కోండి ఆ సూర్యోదయం అంతకన్నా ఆహ్లాదకరంగా ఉండేలా రసానుభూతి కలిగించడానికి స్క్రీన్‌ప్లే రచయిత ప్రయత్నిస్తాడు "దూరాన కొండల నడుమ సూర్యుడు ఉదయిస్తూంటాడు చెట్ల కొమ్మలపై పక్షులు కిలకిలా రావాలు చేస్తూంటాయి సమీపంగా కొలనులో వికసించే కలువలు సూర్యకిరణాలకు మెరిసి పోతుంటాయి పశువులను తోలుకుంటూ కాపర్లు వెళ్తూంటారు ఒక చెట్టుకొమ్మపై ఒక కుర్ర వాడు కూర్చొని పిల్లనగ్రోవి ఊదుతూంటాడు " ఇలా తన ఊహాపథంలో ఎన్నో అంశాలను షాట్‌లుగా సృష్టించుకుంటాడు అవన్నీ తెరమీద ఒక మనో హరమైన అనుభూతిని కలిగిస్తాయి

కథానాయికను గడుసు పిల్లగా కథకుడు సృష్టిస్తే, ఆ గడసరితనాన్ని చూపించడానికి కొన్ని సంఘటనలను రూపొందిస్తే గాని — నిరూపణ జరగదు కొంతమంది విద్యార్థులు కాలేజీ కాంపస్‌లో నిలుచొని ఉషారుగా మాట్లాడుకుంటూండగా — హీరోయిన్ పుస్తకాలు చేతబట్టి వాళ్ళ ముందు వెళ్తుంది అప్పుడొక కొంటె యువకుడు ఈల వేసి, ఆమెను పరిహసిస్తాడు అప్పుడు హీరోయిన్ ఆగు తుంది వాడికి బుద్ధి చెప్పాలని నిశ్చయించినట్లు తల పంకించి, గిరుక్కున వెనుతిరిగి వస్తుంది. చివరికి ఆ కొంటెవాడికి బలంగా లాగి ఒక లెంపకాయ వేస్తుంది

ఇలా ఆ హీరోయిన్ పాత్ర స్వభావాన్ని ముందే తెలియజేయవచ్చు ఒక వేళ ఆ హీరోయిన్ శాంత స్వభావురాలయితే — ఆ కొంటె కుర్రాడు ఈల వేసినప్పుడు ఆగినా— తర్వాత తల వొంచుకొని తన దారిన తాను వెళ్లిపోతుంది ఆ ఈలను ఖాతరు చేయని స్వభావం గలదిగా సృష్టించవలసి వస్తే, నిర్లక్ష్యంగా నడిచి వెళ్లిపోతుంది ఇలా పాత్ర స్వభావాన్ని స్క్రీన్‌ప్లేలో మలచవచ్చు

అలాగే—భగ్నహృదయుడైన హీరో, హీరోయిన్ గురించి చింతిస్తూ ఏ పాడుపడ్డ గుడి ముందో కూర్చొని ఉండగా అతన్ని వెతుక్కుంటూ ముదుసలి తల్లి వర్షంలో తడుస్తూ వస్తూందన్న దృశ్యానికి ముందు ఆకాశంలో మెరుపులు, వెంటనే ఉరుముల ధ్వని వర్షపు నీటిలో ఆ ముసలామె తప్పటడుగుల కాళ్ళు వగైరా షాట్స్‌తో ముందుగా ఒక గంభీర మైన వాతావరణాన్ని సృష్టించి, ప్రేక్షకుని ముందుగానే ఒక జలదరింపజేసే రసోద్రేకానికి సిద్ధం చేయవచ్చు

ఇలా ఒక కథలోని పెక్కు సన్నివేశాలను— ఒక త్రాటితో నడిపించేలా వరుసక్రమంలో ఏర్పాటు చేసుకోవడం స్క్రీన్‌ప్లే రచయిత బాధ్యత చివరన ఎడిటర్ కొన్ని సీన్‌ల వరుసక్రమాన్ని రసస్ఫోరక రీత్యా మార్చుకున్నా— కథా గమనం కుంటుపడని

'కుంకుమ తిలకం' విడుదల సందర్భంగా విజయవాడలో ఏర్పాటు చేసిన పత్రికా గోష్ఠిలో ప్రసంగిస్తున్న చిత్ర దర్శకుడు శ్రీ బి భాస్కర రావు నిర్మాత శ్రీ యడవల్లి విజయేంద్రరెడ్డిని కూడా చిత్రంలో చూడవచ్చు



# ఆనందభైరవిలో భైరవి మొక్కులు !

భైరవి గుడి దగ్గరకి పరుగున వచ్చింది సర్వేశ్వరశాస్త్రి గుళ్ళోంచి వస్తున్నాడు.

సర్వే — ఆగు నీ స్థానం అక్కడే . ఆలయ ప్రవేశం చేసి అపవిత్రం చెయ్యకు

భైరవి ఆగిపోయింది శాస్త్రి వెళ్ళాడు భైరవి కళ్ళు మూసుకుని దణ్ణం పెట్టుకుంటోంది

భైరవి — స్వామీ . ఆనంద్‌బాబు పరీక్షల్లో నెగ్గేలా ఆశీర్వదించు స్వామీ అదే జరిగితే నేను పది శుక్రవారాలు ఉపవాసం చేసి పొర్లుదండాలు పెడతాను స్వామీ

అంతలో బస్సొచ్చి ఆగింది అందులోంచి కరటకుడు దిగాడు మరో ఇద్దరు స్నేహితులొచ్చారు రిసీవ్ చేసుకోడానికి

ఒకడు — హలో — కరటకా వెల్‌కమ్ ! ఏరా పరీక్షలెలా రాసేవ్ ?

కర — తప్పకుండా ఫస్ట్‌క్లాస్‌లో తప్పుతాన్రా గ్యారంటీ .

రెండు — ఫస్ట్‌క్లాస్‌లో తప్పుతావా ?

కర — మరే

[కరటకుడు భైరవిని చూశాడు ]

కర — ఎవర్రా ఆ బ్యూటీ ?

ఒకడు — భైరవి అని. నారాయణశర్మగారి దగ్గర నాట్యం నేర్చుకుంటోందిరా

కర — భైరవి ! గుడ్

అంతలో జంఘాలశాస్త్రి గుడిలోంచి వస్తూ కరటకశాస్త్రిని చూసి,

జంఘాల — ఆడపిల్ల కనబడగానే ఆవగింజంతైనా ఆలోచించకుండా ఆరుబయట అలా ఆవురావురుమంటూ ఆవలిస్తే, అంబా అంటూ వెనగ్గా ఆవులొస్తాయి. అలాగ్గా కుళ్ళపొడుస్తాయి ముయ్యి ఎండిపోయిన నుయ్యిలా, ఎరువుతో నిండిపోయిన గొయ్యిలా ఉన్న నోరు ముయ్యి పట్నంలో ఇలా చూసినందుకే మావాడ్ని ఓ ఆడపిల్ల కొట్టింది ఓ చెంపదెబ్బ అందుకే చెంపన పెరిగింది తట్టెడు దిబ్బ ఇప్పుడే ఇంటికెళ్ళాడు మీ తాత ఇక నీకెందుకు ఈ సంచిమోత

ఈ సన్నివేశం కళ్యాణి ఆర్ట్స్ ఫిలింస్‌వారి 'ఆనందభైరవి' చిత్రంలోది

గిరీష్‌కర్నాడ్, కాంచన, రాజేష్, మాళవిక, నండూరి రామమోహనరావు, మరియు జె వి



ఆనంద భైరవి'లో మాళవిక

సోమయాజులు, జానకి ముఖ్య పాత్రలని పోషించారు

దర్శకత్వం జంధ్యాల, సంగీతం రమేష్ నాయుడు, నృత్యాలు శేషు, కళ భాస్కరరాజు, ఛాయాగ్రహణం యస్ గోపాలరెడ్డి, నిర్మాణ నిర్వహణ కె యస్ ఆర్ నిర్వహిస్తున్న ఈ చిత్రం లక్ష్మి ఫిలింస్ ద్వారా విడుదల అవుతుంది ★

---

విధంగా స్క్రీన్‌ప్లే రచయిత జాగ్రత్త పడాలి

పాత్రల స్వభావాన్ని, సన్నివేశాలను, అంతర్నాటకాలను, లింకులను— దర్శకుని అభిరుచి— ఆశయాల మేరకే కాక పాత్రలకు ప్రాణప్రతిష్ఠ చేసే నటీనటులను కూడా కొందరు స్క్రీన్‌ప్లే కర్తలు దృష్టిలో ఉంచుకొని రచన సాగిస్తారు కొంతమంది కేరెక్టర్ ఆర్టిస్టులను వారికి ప్రత్యేకమైన బాణీలోనే చూడగోరుతారు ప్రేక్షకులు ఒక్కోసారి ప్రధాన పాత్రలకు నూతన నటీనటులను ఎన్నుకున్నప్పుడు వారి ప్రతిభా విశేషాలను ప్రదర్శించడానికి అవకాశమిచ్చే విధంగా స్క్రీన్‌ప్లేను బేలెన్స్ చేసుకోవాల్సుంటుంది లేకపోతే — రాంగ్ కేస్టింగ్ అనిపించుకుంటుంది. పైగా సెట్‌లను, లొకేషన్‌లను కూడా మనోఫలకంపై గుర్తుంచుకోవాలి

అంతే కాదు, కెమెరా కోణాలు కూడా ఊహాపథంలో మెదలాలి లో ఆంగిల్, లేక హై ఆంగిల్ ఒక పూరి గుడిసె ముందుకు రాక్షసుడిలా బాకీ పీడించి వసూలు చేసుకోడానికి వచ్చిన విలన్‌ను చూపించాలంటే— కెమెరాను కాస్త 'లో ఆంగిల్'లో ఉంచవలసి వస్తుంది. అప్పుడు గుడిసెలో నివసించే పేద చేత "నువ్వు మనిషివి కావు, రాక్షసుడివి," అని సంభాషణల కర్త రాయడానికి అనువుగా ఉంటుంది

రూప ఛాయలు ప్రాముఖ్యం వహించడానికి ఈ విధంగా స్క్రీన్‌ప్లే తోడ్పడుతుంది కూడా

నిజ జీవితంతో పోలిస్తే, సినిమాల్లో సన్నివేశాల కాలపరిమితి చాలా తక్కువ కాని, ఒక సంఘటన తర్వాత వచ్చే మరో సంఘటనకు కాలపరిమితిలో ఎంతో తేడా ఉన్నట్లు తెరమీద చూపవలసి వస్తుంది ప్రతి సీమా పండాలి ఒక విషాదాంత చిత్రాన్ని మరీ బరువుగా ప్రేక్షకులు ఫీలవకూడదు బరువైన సన్నివేశాలకు నడుమ రిలీఫ్ కోసం హాస్య సన్నివేశాలను ప్రవేశపెట్టినప్పుడు కథా గమనానికి — ప్రేక్షకుల రసానుభూతికి భంగకరం కాకుండా చూసుకోవడం అత్యావశ్యకం ఈ విషయంలో చార్లీ చాప్లిన్ తర్వాతే ఎవరైనా

"ఎ బుక్ ఆన్ స్క్రీన్‌ప్లే రైటింగ్" గ్రంథకర్త యుజెనీ అభిప్రాయంలో వ్యంగ్యం కన్నా సున్నితమైన హాస్యాన్ని అధికసంఖ్యాకులు వాంఛిస్తారు

నిజ జీవితంలో అంతగా ఎవరూ పాడుకోరు. కాని, మన సినిమాలలో పాటలు ఉండాలి అందుకని పాటల కోసం కొన్ని సన్నివేశాలు సృష్టించవలసి ఉంటుంది ఇది కత్తిమీద సాములాంటిది కథా గమనానికి అడ్డుతగిలేలా పాటలను ప్రవేశపెడితే, అంతా రసాభాస అవుతుంది.

ప్రేక్షకులను క్లాస్, మాస్ అని రెండు తరగతులుగా విభజించారు ఐతే, మరి కొన్ని తరగతులు కూడా ఉన్నాయి కొందరు జీవితంలో ఎన్నో ఢక్కామక్కీలు తిని, గుండె బండబారినవారు మరి కొందరు వడ్డించిన విస్తరిలాంటి జీవితంలో ఏ చీకూ చింతా లేనివారు. ఇంకా— పరుల శ్రేయస్సు కోరని కరినాత్ములు ఆశావాదులు, నిరాశావాదులు, సంస్కారవంతులు, సద్గుణవంతులు, స్వార్థపరులు, మూఢులు, అవివేకులు— ఇలా విభిన్న తరహా వారుంటారు ఇంత మందికీ తృప్తి కలిగించాలంటే— వాళ్ళనెన్నో ఆలోచనలతో ముంచెత్తే విధంగా ఎంతో చమత్కార పూరితంగా స్క్రీన్‌ప్లే అల్లవలసి ఉంటుంది

కాని, ఒక ప్రముఖ హాలీవుడ్ దర్శకుని అభిప్రాయంలో ఎక్కువ మంది ప్రేక్షకులు నిరాశావాదులు అతృప్తిగా జీవయాత్ర సాగిస్తున్నవారే, తెరమీద మసలే పాత్రలతో తమను గుర్తింపు చేసుకోవాలని తహతహలాడే వారే ఈ కోవకు చెందిన ప్రేక్షకులు ఇలాంటి వారి ఆశలు, ఆశయాలు తెరమీద ఈడేరేలా చూపించడానికే చాలా మంది స్క్రీన్‌ప్లే రచయితలు కృతనిశ్చయులై ఉంటారు

సహజంగా జీవితంలో ఈతిబాధలతో విలవిలలాడుతున్నుకునే నిరుద్యోగికి లాటరీలో లక్షరూపాయలు రాకపోవొచ్చు కాని, అలా వచ్చినట్లు తెరమీద చూపిస్తే, ఈ తరగతికి చెందిన ప్రేక్షకులు ఎంతో తృప్తి, మానసికానందం కలుగుతాయి

అలాగే— సినిమా చూసే వ్యక్తి తనను గురించి తాను బాధపడేలా చేయాలేగాని, పాత్రను గురించి కాదు బాధపడవలసింది

సినిమాలు చూసి చూసి ప్రేక్షకుడు క్రమక్రమంగా పరిణతి పొందుతున్నాడు తనకు తాను ఆలోచించు కుంటానంటున్నాడు అంచేత, అతనికి స్క్రీన్‌ప్లే రచయిత సర్దుకోవాలి చాతుర్యం చూపాలి తను బాహాటంగా చెప్పకుండా తను అనుకుంటున్న విధంగా ప్రేక్షకుడు ఊహించగలిగేటట్లు రాయడానికి ప్రయత్నించడమే మంచిదేమో 'అలాకా రచయితే అంతా చెప్పేస్తే, ప్రేక్షకుడికి విసుగు పుడుతుంది గుండెలకు గుచ్చేట్లు చెప్పవలసిన సన్నివేశమైనా బహు సున్నితంగా, సూత్రప్రాయంగా చెప్పాలి లోకంలో అన్యాయం విలయతాండవం చేస్తోందని వీధిలోకెళ్ళి, "అందరూ దుర్మార్గులే!" అని అరిస్తే, ఒకడు కాకపోతే మరొకడైనా "ఎందుకయ్యా తిడుతున్నావ్ ?" అనకుండా ఉండడు కదా ?

పాత్రధారుల నటనా కౌశల్యం, ఛాయాగ్రహణ కలిగించే ప్రభావం, శబ్దగ్రహణం కలిగించే ఫలితం వాటిపై ఫిలిమ్ ఎడిటర్ నేర్పరితనం— ఇవన్నీ దర్శకుని సారథ్యంలో ప్రేక్షకుల హృదయాలపై చెరగని ముద్రలు వేస్తాయి. ఐతే, చక్కని రసస్ఫూర్తి కలిగించేలా ఈ వివిధ శాఖలను సమన్వయపరిచే నైపుణ్యం స్క్రీన్‌ప్లే రచయితకు ఉండితీరాలి సృజనాత్మక శక్తిగల వారికి ఇదొక ఛాలెంజ్ !




మద్రాసు అడయార్ గేట్ హోటల్‌లో 'ఫర్జ్ అవుర్ కానూన్' రజతోత్సవ వేడుకలు జనవరి 30 న జరిగాయి అమితాబ్‌బచన్ ముఖ్య అతిథిగాను, ధర్మేంద్ర బహుమతీ ప్రదాతగాను పాల్గొన్న యీ వేడుకలో హేమమాలిని, రతి అగ్నిహోత్రి, జితేంద్ర వగైరా ప్రసిద్ధ తారాగణం హాజరవడం నాటి సభకు ఎంతో నిండుదనం చేకూర్చింది 'ఫర్జ్ అవుర్ కానూన్'కి సంబంధించిన ముఖ్య సాంకేతిక నిపుణుల్లో లక్ష్మీకాంత్ ప్యారేలాల్, కాదర్‌ఖాన్, ఆనంద్‌బక్షీ, నటుల్లో అస్రాని – బొంబాయిలో అంతకు ముందు నాలుగైదు రోజులుగా ఆదాయపు పన్నుశాఖ జరుపుతున్న దారుణమైన దాడుల్లో ఇరుక్కుని రాలేకపోయారని ఆనాటి సభకు హాజరయిన ఒక ప్రముఖ బొంబాయి జర్నలిస్ట్ చెప్పారు

కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఏ యస్ ఆర్ ఆంజనేయులు, ఎం అర్జునరాజు నిర్మించిన 'ఫర్జ్ అవుర్ కానూన్' రజతోత్సవ సభలో ముఖ్య అతిథిగా వచ్చిన అమితాబ్‌బచన్ ప్రసంగిస్తూ "నేను అనారోగ్యంగా అపస్మారక స్థితిలో వున్నపుడు దేశంలోని అన్ని ప్రాంతాల ప్రజలకన్న దక్షిణాది రాష్ట్రాల ప్రజల ఎక్కువ ఆందోళన వెలిబుచ్చారు నా క్షేమం కోసం అనేక ప్రార్థనలు, పూజలు చేశారు వారందరి రుణం తీర్చుకోలేనిదైనా, నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుతున్నాను

## వెల్ ప్లానింగ్

"ఇక యీ చిత్రం 'ఫర్జ్ అవుర్ కానూన్' గురించి నేను 'శక్తి' అనే చిత్రంలో నటిస్తున్నప్పుడు చెప్పారు అదీ ఇదీ ఒకటే కథ అనీ, మొదలు పెట్టి నాలుగైదు మాసాల్లో పూర్తి కావడం జరిగిందనీ విన్నాను అప్పటికే 'శక్తి' నాలుగేళ్ళుగా నిర్మాణంలో వుంది నాలుగైదు మాసాల్లో పూర్తి కావడం ఆ వెను వెంటనే రిలీజ్ కావడం నాకెంతో ఆశ్చర్యం కలిగించింది అంటే దక్షిణాదిన చిత్రాలు నిర్మించే వారి ప్లానింగ్, క్రమశిక్షణ, చక్కని కృషి, ఫిల్మ్ మేకింగ్ పట్ల వారికున్న శ్రద్ధ ఎంతో గొప్పవని తెలుస్తున్నది ఈ చిత్రం 'శక్తి' చిత్రం కన్నా చాలా ఎక్కువగా వసూలు చేసింది ఈ చిత్రం 25 వారాల పండగ సందర్భంగా నాకీ అవకాశం కల్పించిన నిర్మాత అర్జునరాజుగారికి, దర్శకులు, తక్కిన సాంకేతిక సిబ్బందికి నా ధన్యవాదాలు" అన్నారు

## హుందాగా జరిగిన వేడుకలు!

ధర్మేంద్ర మాట్లాడుతూ "నేను యీ చిత్రాన్ని మూడు రోజుల క్రితమే చూశాను చక్కని సాంకేతిక విలువలతో గొప్పగా తీసిన యీ చిత్రం నన్నెంతో ముగ్ధుణ్ణి చేసింది ఈ సంస్థ నుంచి యింకా అనేక విజయవంతమైన చిత్రాలు రావాలని ఆశిస్తున్నాను" అని చెప్పారు

చిత్రంలోని ముఖ్య నటీనటులకు, సాంకేతిక నిపుణులకు ధర్మేంద్ర, పంపిణీదార్లకు, ప్రదర్శన శాలల అధిపతులకు కుమారి శ్రీదేవి షీల్డులను బహూకరించారు నాటి సభా కార్యక్రమాలను హాస్య నటుడు నాగేష్ నిర్వహించారు సాయంత్రం ఆరున్నరకు ప్రారంభమైన యీ కార్యక్రమం ఏ నసా లేకుండా అందంగా, ఎంతో హుందాగా గంటలో పూర్తి కావడం ఆహూతులకు ఎంతో ఆనందాన్ని కలిగించింది.

## అంతా అమితాబ్ కోసమే ......

ఈ కార్యక్రమానంతరం పూల్‌సైడ్ లాన్‌లో కాక్‌టైల్స్ పార్టీ, విందు భోజనం ఏర్పాటు చేశారు, నిర్మాతలు ఆ ఫంక్షన్ పూర్తి అయి అమితాబ్ పూల్‌సైడ్ లాన్‌లోకి వస్తున్నప్పుడు ఆయన్ని చూడాలని, ఫోటోలు తీయించు కోవాలని, ఆటోగ్రాఫ్‌లకని పిల్లలు, ఆడవాళ్ళు విపరీతంగా లోపలికి చొచ్చుకు వచ్చేశారు వారందరినీ కంట్రోల్ చేయడం శ్రమతో కూడిన పని అయినప్పటికీ దర్శకుడు శ్రీ కె రాఘవేంద్రరావు, బేచ్ బేచ్‌లుగా అమితాబ్ పక్కన నించోబెట్టి ఫోటోలు తీయించి ఆటోగ్రాఫ్‌లు యిప్పించారు— ఎంతో ఓపికగా

'ఫర్జ్ ఔర్ కానూన్' వేడుకలలో

నిర్మాత అర్జునరాజు, అమితాబ్, కృష్ణంరాజు, శ్రీదేవి



## మేముకూడా పోటీచేస్తే ఇంతే సంగతులు!

ఆదాయపు పన్ను శాఖ దాడులంటే జ్ఞాపకం వచ్చింది జనవరి 25 నుంచి బొంబాయిలోని సినిమా వారిమీద 'ఇన్‌కంటాక్స్' దాడులు ప్రతి రోజూ జరుగుతున్నాయి ఎవర్నీ విడిచిపెట్టకుండా చేసినవారి యింటిపైన మళ్లీ మళ్లీ దాడులుచేస్తూ మానసిక క్షోభకు గురిచేస్తున్నారట! అందుకు కారణం ప్రముఖ నటుడు శ్రీ యన్ టి రామారావు ఎన్నికలో కాంగ్రెస్‌ని చిత్తుగా ఓడించి ముఖ్యమంత్రి కావడమేనని అంటున్నారు ప్రజల్లో సినిమావారికున్న ప్రాబల్యం ఎటువంటిదో యీ ఎన్నికల్లో తెలుసుకున్న ప్రభుత్వం—ఇలా అనునిత్యం దాడులు జరిపి వారివద్ద ఇన్నికోట్ల నల్లడబ్బో, దొంగ బంగారమో పట్టుబడిందని ప్రజలకు తెలియబరచి సినిమావారి పాపులారిటీని అణగదొక్కాలని ప్రయత్నిస్తోందని బొంబాయి సినిమా వర్గ సభ్యులు ఆరోపిస్తున్నారు

ఇందులోని నిజానిజాలు ఎలా ఉన్నప్పటికీ — ఇన్‌కంటాక్స్‌వారి హెరాస్‌మెంట్ భరించలేక బొంబాయిలోని ప్రముఖ నటీనటులూ దేశంలో గొప్ప పేరుపొందిన సాంకేతిక నిపుణులూ కలిసి ఢిల్లీ ప్రభుత్వానికి ఒక మెమో పంపించారట! "ఇలా రోజూ మమ్మల్ని హెరాస్ చేస్తుంటే మేమంతా చేతులు కలిపి ఎవరికి సంబంధించిన రాష్ట్రంలో వారిని ఎన్నికల్లో నించుని మీ ప్రభుత్వాన్ని నామరూపాలు లేకుండా ఓడించడానికి విశ్వప్రయత్నాలు చేస్తాం మేము కూడా పోటీచేస్తే ఇక ఇంతే సంగతులు, ఆలోచించుకోండి!" అని ఇది చాలా గమ్మత్తుగా వుంది కదూ? ఇదివరకు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏదైనా చేసినా, చేయబోయినా 'ఇన్‌కంటాక్స్ రైడ్స్' జరిపిస్తాం జాగ్రత్త అని బెదిరించే ప్రభుత్వానికి — ఇపుడీ సినిమావారి తిరుగుబాటు బెదిరింపుకి ఏం చేస్తుందో వేచి చూడాల్సిందే!

## కృష్ణ గ్లామర్ రహస్యం.

ఫిబ్రవరి 2వ తేదీ ఉదయం రాధాకృష్ణా మూవీస్‌వారి తృతీయచిత్రం 'కోటి కొక్కడు' షూటింగ్ ప్రారంభం వాహినిలోని 8వ ఫ్లోర్‌దగ్గర సినిమా పరిశ్రమకు చెందిన ప్రముఖులు నించుని జట్లుజట్లుగా పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు ఇంతలో కృష్ణంరాజు ఆయన వెనక జయసుధ మేకప్‌లో వచ్చారు వారిరువురిపైనా ముహూర్తపు షాట్ తీయవలసి వుంది

"కృష్ణ రాలేదా?" అని అడిగారు కృష్ణంరాజు.

"రాఘవేంద్రరావుగారు వచ్చారు. కృష్ణగారు బయల్దేరారట" అన్నారు, ప్రొడక్షన్ నిర్వాహకులు.

కృష్ణంరాజు సమర్పించే యీ చిత్రానికి కృష్ణ క్లాప్, కె. రాఘవేంద్రరావు కెమెరా స్విచాన్ చేస్తారన్నమాట ! ఇంతలో కృష్ణ వచ్చారు. ఆయన కారు దిగి వస్తున్నప్పుడు "కృష్ణ చాలా స్లిమ్‌గా వున్నాడే, పదిహేనురోజులనాడు నేను చూసిందానికన్న బాగా స్లిమ్‌గా వున్నాడు. రోజూ రెండుసార్లు టిఫిన్ రెండుసార్లు భోజనం చేస్తాడు. అసలు ఎక్సర్‌సైజే చేయడు. అయినా ఇంత స్లిమ్‌గా ఎట్లా వున్నాడు?" అన్నారు, కృష్ణంరాజు ఆశ్చర్యం వ్యక్తపరుస్తూ.

వైజయంతీ మూవీస్ అధినేత అశ్వనీదత్ కల్పించుకుని !'ఇందులో ఆశ్చర్యపడాల్సిందేమీలేదు,



**ధర్మేంద్రతో దర్శకుడు**
**కె. రాఘవేంద్రరావు**

కృష్ణగారే ఒకసారి చెప్పారు. నెలకి 15 పాటలు, 15 ఫైట్స్ చేస్తున్నాను. అదే పెద్ద ఎక్సర్‌సైజు, వేరే ఎక్సర్‌సైజ్ దేనికి? అని" అన్నారు.

అప్పటికి 9 గంటలయింది. కృష్ణ క్లాప్, రాఘవేంద్రరావు స్విచాన్ చేయగా ముహూర్తపు షాటు కృష్ణంరాజు జయసుధలపై తీశారు. ఈ చిత్రం తొలిషెడ్యూలు ఫిబ్రవరి 25వరకూ జరుగుతుందని నిర్మాత జి. సత్యనారాయణరాజు చెప్పారు. జమున, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, సారధి తక్కిన ముఖ్యభూమికలు పోషిస్తున్న యీ చిత్రానికి కాశీవిశ్వనాథ్ మాటలు, వేటూరి పాటలు, రాజన్ నాగేంద్ర సంగీతం, భాస్కరరాజు కళా దర్శకత్వం నెరపుతున్నారు కొమ్మినేని శేషగిరిరావు దర్శకుడు

— మోహన్ కుమార్



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## జంధ్యాల తెలుగు, కన్నడ భాషల్లో రూపొందించే "ఆనందభైరవి"

"మా నృత్య ప్రధాన గీత — సంగీత భరిత చిత్రానికి జనవరి 1 నుంచి 25 వరకు తొలి షెడ్యూల్ పూర్తి చేశాం. రాజమండ్రి దగ్గరున్న కోరుకొండలోని లక్ష్మీ నృసింహస్వామి దేవాలయం గోదావరీ తీరంలోని సుందర ప్రదేశాల్లోనూ చిత్రీకరించాం. బెంగుళూరులో కూడా కొన్ని సన్నివేశాలను చిత్రీకరిస్తాం. మలి షెడ్యూల్ ఫిబ్రవరి 25నుంచి మార్చి 30 వరకు జరుగుతుంది. దీంతో షూటింగ్ ఘట్టం ముగిసినట్లే. తెలుగుతోపాటు కన్నడంలో కూడా ఈ చిత్ర నిర్మాణం జరుగుతోంది. తెలుగు చిత్రానికి కె. రవిప్రకాష్, టి. సునీత నిర్మాతలైతే కన్నడం వర్షన్‌కు ద్వారకీష్ నిర్మాత," అని తెలియజేశారు రచయిత, దర్శకుడు జంధ్యాల. మనం సృష్టించుకున్న పలురకాల అడ్డుతెరలను తొలగించుకోవాలని, ఆశయాలు బోధించడంకంటే స్వయంగా ఆచరించి చూపడం ముఖ్యమని చెప్పే ఈ చిత్రంలో సుప్రసిద్ధ నాటక ప్రయోక్త, నటుడు, దర్శకుడు, రచయిత గిరీష్ కర్నాడ్ నాట్యాచార్యుడు నారాయణ శర్మ పాత్ర నిర్వహిస్తున్నారు. ఇందుకుగాను ఈయన కొంతకాలంపాటు ప్రత్యేకంగా నృత్య శిక్షణ పొందారట కూడా. నాయికగా ప్రముఖ కథక్ నర్తకి మాళవిక నటిస్తోంది. ఇంకా కాంచన, రాజేష్, శుభకర్, నూతన్‌ప్రసాద్, హేమచందర్, వీరభద్రరావు, సుత్తివేలు, రచయిత పుచ్చా పూర్ణానందం, ఆకాశవాణి రామ్మోహనరావు, హరికథా సమ్రాట్ వీరగంధం వెంకట సుబ్బారావు నటిస్తున్నారు. స్వర్గీయ దేవులపల్లి, వేటూరి గీతాలకు రమేష్‌నాయుడు స్వరబద్ధం చేశారు. గోపాలరెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, శేషు నృత్యాలతో కె. ఎన్నార్ నిర్మాణ సారథ్యం వహిస్తున్నారు. కొండముది శ్రీరామచంద్రమూర్తి నవల "చిరునవ్వుల మరునవ్వడి" ఆధారంగా ఈ చిత్రం రూపొందించబడుతోంది.

## కృష్ణ నమర్పించే "ప్రజారాజ్యం'

"మార్చి 16న పద్మాలయ స్టూడియోకు ప్రారంభోత్సవం జరుగుతుంది. ఆనాడే "ప్రజారాజ్యం" చిత్రం కూడా సెట్స్‌కు వెళ్తుంది," అన్నారు పద్మాలయ స్టూడియోస్(ప్రై) లిమిటెడ్ వారితొలి చిత్రాన్ని నిర్మించే జి. హనుమంతరావు. సుమారు కోటి రూపాయల వ్యయంతో హైదరాబాదులో ఈ స్టూడియోను నిర్మిస్తున్న హీరో కృష్ణే "ప్రజారాజ్యం" చిత్రాన్ని కూడా సమర్పిస్తారు. ఈయనతోపాటు జయప్రద, రావు గోపాలరావు, సత్యనారాయణ, శ్రీధర్, నూతన్‌ప్రసాద్, అల్లు రామలింగయ్య, గిరిబాబు, ప్రభ, అరుణ, రాజ్యలక్ష్మి, కె. విజయ, అన్నపూర్ణ, కాకినాడ శ్యామల. జ్యోతిలక్ష్మి, జయమాలిని పాత్రధారులు. పరుచూరి సోదరులు సంభాషణలు రాస్తున్నారు. జె. వి. రాఘవులు సంగీతం, పి. దేవరాజ్ ఛాయతో, జి. ఆదిశేషగిరిరావు నిర్మాణ సారథ్యం వహించే ఈ భారీ చిత్రానికి ఎం. మల్లికార్జునరావు దర్శకుడు.



"చిత్రాన్ని మనం భారీ ఎత్తున నిర్మిస్తున్నాం! అందుచేత మన చిత్రంలో హీరో కిలో రెండు రూపాయల చొప్పున కాదు, పది రూపాయల చొప్పున బియ్యం కొంటాడు!"

'కిరాయి కోటిగాడు'లో కృష్ణ, శ్రీదేవి



'నువ్వు దక్షిణ దేశయాత్ర కోసం సెలవు పెట్టావు కదా...'

'అవును'

సుబ్బారావు లీవ్ ట్రావెల్ కన్సెషన్ మీద సౌత్ ఇండియా టూర్ వెయ్యడానికి ప్లాన్ చేస్తున్నాడు మరో పదిహేను రోజుల్లో పిల్లలకు సెలవు లివ్వగానే బయల్దేర బోతున్నాడు

'కన్యాకుమారి నుంచి తిరిగి వచ్చేటప్పుడు పాల్ఘాట్ దగ్గిర వూళ్ళో .. అదే ... మా ఊరిని... మా ఇంటిని ఓ సారి చూపిస్తావా'

సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు.

అప్పుడు గుర్తుకొచ్చింది తమ తండ్రి తమ తల్లిని అతి చిన్నతనంలోనే పాల్ఘాట్ నించి కొనుక్కు తెచ్చుకుని పెళ్ళి చేసుకున్నా డన్న విషయం. ఎప్పుడో సకృత్తుగా ఓ క్షణం ఈ విషయం గురించి అనుకోడమే తప్ప ఆమె మళ్ళీ అక్కడికి వెళ్ళిందీ లేదు ఎవరూ అక్కణ్నించి వచ్చిందీ లేదు. ఆమె ఇక్కడ జీవవాహినిలో కలిసిపోయి తెలుగింటి పండు ముత్తైదువగా మారిపోయిన డెబ్భైయేళ్ళ తర్వాత... ఇప్పుడు... ఇంత అభిమానంగా తూచి తూచి ఆగి ఆగి అడుగుతుంటే ... విచిత్రమైన అనుభూతితో సుబ్బారావు వొళ్ళు జలదరించింది.

యాభై అరవైయేళ్ళ క్రితం వరకూ గూడా ఆంధ్రదేశంలో కన్యాశుల్కం విపరీతంగా వుండెది. బోలెడు డబ్బు పోసి ఆడపిల్లల్ని కొనుక్కోలేనివాళ్ళు కేరళ దేశం వెళ్ళి పాల్ఘాట్ నించీ ఆడపిల్లల్ని కొనీ తెచ్చుకునేవారు చౌకగా. ఎంత కటువుగా వున్నా కొన్ని చారిత్రక అవసరాలూ, సత్యాలూ చిత్రంగా వుంటాయి. నాగలక్ష్మి ఆంధ్రదేశం ఆ విధంగా ఐదేళ్ళ వయసులోనే ఒక తెలుగింటి ఇల్లాలిగా తీసుకురాబడింది. వచ్చేక ఆమెకు ఇదే స్వర్గమైపోయింది. మళ్ళీ అక్కణ్నుంచి వచ్చి చూసినవారూ లేరు ఇక్కణ్నించి తీసుకెళ్ళి చూపించిన వారూ లేరు. ఒక్క తాళితో బంధం తెగిపోవడం ఎంత అమానుషం? పుట్టింటి మీదా, తల్లిదండ్రుల మీదా, తోబుట్టువుల మీదా, బంధు మిత్రుల మీదా ఆమెకున్న బంధాల్నీ, అనుబంధాల్నీ ఒక్క తాళిబొట్టు తెంచేసింది. వయసొచ్చేక ఆమెలో ఎప్పుడన్నా ఒక్కసారి పుట్టింటి వేపెళ్ళి చూపివద్దామన్న కోరిక కలిగేది. కానీ భర్త హయాంలో అత్తింటి వారు ఆ ఊహని మొగ్గలోనే తుంచేవారు. ఆ తర్వాత ఈ సంసారపు మాయలో పడి తన జన్మ వృత్తాంతాన్నే మరిచిపోయే స్థితికొచ్చింది. భర్త గతించేక కొడుకు ఆలనా పాలనలోకొచ్చింది. ఇన్నేళ్ళకి యాదృచ్ఛికంగా కొడుకు దక్షిణ దేశానికి ప్రయాణం కడుతున్నాడు. కొద్ది అటూ ఇటూగా ఆ దేశం మీదుగా ప్రయాణించ బోతున్నాడు అందుకే ఏన్నేళ్ళగానో విద్రాణమైయున్న కోరిక మళ్ళీ మేలుకొంది.

'అహ....నీ కేమీ ఇబ్బందిలేకపోతేనే....' అందావిడ మళ్ళీ మొహమాటంగా.

ఆ మాటలో అనేక అర్థాలు గోచరించి కదిలిపోయేడు సుబ్బారావు.

ఆ ఒక్క మాటతో — తను కేరళ ఆడపడుచై, అయిన వారికి దూరంగా వొచ్చేసి, తన రక్త మాంసాలు మరో కుటుంబానికి ధారబోసి తమ పుట్టింటి వారి దారిద్ర్యంవల్ల ఇన్నాళ్ళూ ఒకరి పంచన పని మనిషిగా తనను తాను భావించుకుంటూ, కన్నతల్లి, అధికారం లేదనుకుని మొహ మాటంగా తన వారిని చూడాలని తన మనస్సులో మాట ఆవిడ వెల్లడించిన తీరు .... సుబ్బారావుని కదిలించి వేసింది.

గుండెల్లో సుళ్ళు తిరుగుతూ మాటల్లో చెప్పలేని ఆమె ఆవేదన అతని గుండెల్ని మెత్తగా కోసింది.

ఆవిడ ఇక్కడి పిల్ల కాదని ఎవరో ఎప్పుడో సకృత్తుగా అనడం తప్పించి ఆ విషయం తమ జీవితాల్లో అంత ప్రాధాన్యం సంతరించుకోలేదు. ఇప్పుడిలా ఆవిడ నోరు తెరిచి అడుగుతుంటే ఆమె కన్నతల్లిలా కాక పరాయిదేశపు పరాయి ఇంటి ఆడపడుచులా కనబడి....తన వారిని చూచే స్వాతంత్రతనంలేక ఎన్నేళ్ళుగానో తపిస్తున్నట్టు కనబడి అతని హృదయం ద్రవించిపోయి కను కొలకుల్లో నీరు నిండింది.

ఇన్నేళ్ళకు తల్లి ఋణం తీర్చుకునే అవకాశం వచ్చినందుకు అతని మనసు ఆనందంతో పులకరించి పోయింది.

'వెళ్దామమ్మా ... తప్పకుండా తీసుకెడ తాను.'

చాలా విశ్వాసంగా చెప్పేడు సుబ్బారావు. ఆ ఆశ్వాసనకు ఆవిడలో కలిగిన ఆనంద ప్రకంపనాలకు అంతులేక పోయింది సంతోషంతో ఆవిడ గొంతు పూడుకుపోయి మా రాలేదు.

అలాగే చాలాసేపు మౌనంగా వుండిపో రిద్దరూ.

* * *

ఆ మర్నాటి నుంచీ ఆఫీసులో సౌతిండియ ట్రిప్ కొట్టి వచ్చిన వాళ్ళందర్నీ పాల్ఘా వెళ్ళే రూటు గురించీ, ఆ చుట్టుపక్క ఉన్న ఊళ్ళ గురించీ వాకబు చేయసాగే సుబ్బారావు. అతనడిగే ప్రదేశం పె టూరిస్టు పాయింట్ కాదు గాబట్టి వివర సరైన సమాచారం ఇవ్వలేక పోయేరు

ఒకరిద్దరు మాత్రం 'ముందు పాల్ఘా వెళ్ళు... ఆ తర్వాత చుట్టుపక్కల ఊళ్ళ గురించి అక్కడ వాకబు చెయ్ ... ఏదో ఆధారం దొరక్కపోదు' అన్నారు.

సుబ్బారావు కీ సలహా నచ్చింది.

ఆ విధంగానే ముందు మద్రా శ్రీరంగం మైసూరు, బెంగుళూర్లు కానిచ కుంటూ రామేశ్వరం, కన్యాకుమారీలు గూ కానిచ్చుకుని తిరుగు ప్రయాణం ప్రత్యేకంగా పాల్ఘాట్ కొచ్చి పడ్డాడు.

వొచ్చాడేగానీ స్టేషన్లో దిగేక ఎక్క కెళ్ళాలో, ఏం చెయ్యాలో పాలుబోలేదు.

ఆవిడకు తన ఊరు పాల్ఘాట్‌కు దగ్గరలోనే అని తెలుసు. తను పెద్దదయా భర్త ఆ ఊరి పేరు కూడా చెబుతూ వాడు గానీ ఇప్పుడు ముదిమి వల్ల జ్ఞాప రావట్లేదు. నోట్లో ఆడుతున్నట్టుగా ఉ గానీ పైకి చెప్పలేక పోతోంది.

సుబ్బారావు ఓ క్షణం ఆలోచించి నేరు రైల్వేబుకింగ్ క్లర్కు దగ్గిరికిపోయి తమ పరిస్థితి వివరించి అతని సాయం పాల్ఘాట్‌కు అతిసమీపంలో వున్న కుగ్రామ లిస్టు రాసుకొచ్చి ఒక్కొక్కటీ చ వినిపించేడు

'లేఙ్ఞాప్పోడి' అన్న పేరు వింటూనే ' అదే' అందావిడ ఆనందంగా.

సుబ్బారావుకి మనసులో అనుమాన కానీ — అలూ మాలూ లేని అనుమానం ఊగిసలాడేకన్నా దొరికిన ఆధారం ముందుకు పోడం మేలనుకుని, ఎందుకే మంచిదని బుకింగ్ క్లర్క్‌ని మళ్ళీ అడిగేడు ఆ ఊరి గురించి.

లేఙ్ఞాప్పోడి ఐదుమైళ్ళ దూరంగా లేదనీ, బహుశా అదే అయివుంటుంద

# తెగిన పేగు

ఆ ఊరు పోడానికి ప్రైవేట్ బస్ సర్వీస్ తప్ప రైలుమార్గం లేదనీ చెప్పి, విలా వెళ్లాలో అతి జాగ్రత్తగా చెప్పేడతను.

సుబ్బారావుకి తమిళమూ, మళయాళమూ రాకపోయినా అలాగే నెట్టుకుంటూ మొత్తానికి ఆ బస్ స్టాప్‌నీ, బస్సునీ పట్టుకోగలిగేడు. ఆ బస్సు వాడి దయవల్ల ఓ గంట లోపునే ఆ ఊరు చేరుకోగలిగేరు.

ఆ ఊళ్లో దిగేక మరో సమస్య ఎదురైంది సుబ్బారావుకి. ఇంగ్లీషు ముక్క వొచ్చినవాడు ఒక్కడూ తారసపళ్లేదు ఆ కుగ్రామంలో. అందరూ అడ్డకట్టు గళ లుంగీగాళ్లే! అందరూ పైటల్లేని పడుచులే గంటన్నర తంటాలు పడగా ఇంగ్లీషు తెలిసిన ఒక్క ముసిలాయన దొరికేడు ఆయన రిటైర్డు టీచరుట సుబ్బారావు తన సమస్య వివరించేడు ఆయనకి అంతా విః సానుభూతిగా ఆమె వంక చూసి పెదః విరిచేడు. 'ఇన్నేళ్లతర్వాత ఇప్పుడు పట్టుకోడం చాలా కష్టం' అన్జెప్పి ఆ వూళ్లో ప్రతీ మూడో ఇంట్లోనూ అమ్మాయిల్ని అమ్ము కున్న వారేట ఆ రోజుల్లో. అంత ఉధృతంగా కాకపోయినా ఈ నాటికీ అదే పరిస్థితిట.

మళ్ళీ ఓ నిముషం ఆగి ఆయనే అన్నాడు 'కనీసం ఇంటి ఆనమాలైనా చెబితే ఉన్న బ్రాహ్మణ కుటుంబాల్లో వాకబు చేయించ వచ్చు' అని.

సుబ్బారావు తల్లినీ మరి కొన్ని వివరాలడిగేడు. ఎంత ప్రయత్నించినా ఆమెకేమీ గుర్తు రాలేదు 'మీయింటిపక్క గుళ్ళోనే నిన్ను మొదటిసారి చూశాను, నాగమల్లి పూసేరు తుండగా' అనీ భర్త ఎపుడూ చెబుతూండే మాట జ్ఞప్తికొచ్చింది హఠాత్తుగా. ఏదో గుడి పక్క ఇల్లు అనీ మాత్రం చెప్పింది. నాగమల్లి చెట్టుసంగతి గూడా చెప్పింది.

ఆయన నవ్వేశాడు, 'గుళ్ళంటే...చిన్న ఊరైనా చాలా గుళ్ళున్నాయి. ఐనా కష్టం కాదులెండి. పదండి చూద్దాం' అంటూ దారి తీసేడు ఈ కేసు ఆయనకీ చిత్రంగా ఉండి, ఈమిస్టరీ ఛేదిద్దామన్న కుతూహలం ఆయనకీ కలిగింది.

రెండు మూడు గుళ్ళు వెదికేక నాలుగో గుడి నిజమైంది. దాన్ని చూస్తూనే ఆవిడకి లీలగా ఏదో పునర్జన్మ స్మృతిలా గుర్తుకొచ్చింది గుడికి ఎడం పక్క ఇంటి వేపు అనుమానంగా చూసి అదే అయి ఉండాలంది. కానీ ఆవిడకి పెంకుటిల్లని గుర్తు అదిప్పుడు డాబా అయింది

'కనుక్కు చూద్దాం ఉండండి' అంటూ ఆయన లోపలికెళ్ళేడు సుబ్బారావు సంసారం ఆయన్ని అనుసరించింది.

లోపల మండువాలో ఓ ముసలాయన వాలుకుర్చీలో పడుకుని రేడియో వింటున్నాడు. ఇదర్దు పిల్లలు కొద్దిగా ఎడంగా ఆడుకుంటు న్నారు

ఈ మాస్టారు ఆయనతో మళయాళంలో ఏదో మాట్లాడేడు ఆయన లేచి నిల్చుని ఓ సారి సుబ్బారావు తల్లి వంక చూసేడు.

తనకో తమ్ముడుండాలి బహుశా ఈయనే నేమో . పోలికలు...ఆవిడలో ఏదో నమ్మకం క్రమంగా బలపడ సాగింది ఆ ఇంటి వాతావరణం చ స్తుంటే ఆ ప్రయత్నంగా ఆవిడ నోటంట 'అప్పు' అన్న మాటొచ్చింది.

'అవును నేనే, నన్ను ఇంట్లో అందరూ 'అప్పు' అనే అంటారు అప్పుకుట్టి...' అన్నాడయన మళయాళంలో. మాస్టారు ట్రాన్స్‌లేట్ చేసేరు.

ఈ లోపు ఇంట్లోని వారందరూ పోగయేరు. వింతగా చూడసాగేరు ఆవిడకేదో ఉన్నట్టుండి అనుమానమొచ్చి మండువా మధ్యకు వెళ్ళి 'ఇక్కడ ఉయ్యాల ఉండాలి ఏదీ' అన్నది

'ఓ సారి దూలం విరిగింది. అప్పట్నించి తీసేశాం' అన్నాడాయన.

ఏవేవో జ్ఞాపకాలు అల్లిబిల్లిగా అల్లుకొనగా పిచ్చెత్తినట్టు తడబడే అడుగులో ఇల్లంతా కలయదిరిగింది. వంటింటిని గుర్తు పట్టింది. దొడ్లో బాదం చెట్టునూ, పున్నాగ చెట్టునూ గూర్చి అడిగింది. అవి ఎప్పుడో చచ్చిపోయేయి అన్నాడు. ఒక చోట మయ్యి వుండాలి ఏదీ అని అడిగింది పిల్లిపడి చచ్చిపోతే మూయించేసి వేరేచోట తీయించాం అన్నాడయన. ఇలాగే ఏవేవో అడిగింది — కొన్ని వున్నాయి కొన్ని లేవు ఉన్నవాటిని చూసి ఆనందించింది. చూసే వాళకు అంతా పునర్జన్మ తంతు అనిపించింది.

ఒకసారి తుఫానుకు పెంకుటిల్లు పడిపోతే

( 60వ పేజీ చూడండి)

# "కాంప్లాన్® మాత్రమే మా కుటుంబానికి సరియైనది–సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం."



''మా శ్రీవారు పనిలో మునిగి వుంటా రెప్పుడూ—తరచు భోజనం ఎగ్గొడుతూ ఉంటారు. ఆయనకు అందని ఆ పోషణని యిస్తుంది కాంప్లాన్."



''మా అబ్బాయి అన్నం సరిగ్గా తినడు, మారాం చేస్తాడు. వాడి పెరుగుదలకు కావలసిన ప్రొటీన్లూ, యితర ఆహార పదార్థాలూ కాంప్లాన్‌తో తప్పకుండా అందుతాయి ''



"మా అమ్మ యిప్పుడే జబ్బుపడి లేచింది. ఆకలి లేదు. కోలుకునే యీ సమయంలో, కాంప్లాన్ ఆదర్శమైన తీరులో పుష్టినిస్తుందనిపిస్తోంది."

## కేవలం కాంప్లాన్® లోనే అందరికీ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.



"ఇంట్లో పని చేసిచేసి అలసిపోతాన్నేను. మరింత పోషణ అవసరమనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు. మరి కాంప్లాన్, నేను మా కుటుంబానికి యివ్వగలిగినంత యిచ్చేలా చేస్తుందనిపిస్తుంది."

కేవలం కాంప్లాన్‌లోనే శాస్త్రీయంగా రూపొందించిన పాళ్ళలో, మన శరీరానికి ప్రతిరోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి...ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన పానీయం.

రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ–కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది—ప్లెయిన్ (సాదాగా) కూడా.




# కాంప్లాన్®

## —సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం.

GLC-10-2316 TL (R)

'పెళ్ళిచేసి చూపిస్తాం'లో
చంద్రమోహన్, రమాప్రభ, విజయశాంతి

# సినిమా

## సొసైటీ ప్రొడక్షన్స్‌వారి సాంఘిక, పౌరాణిక చిత్రాలు

''నేను స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే 'సుందరకాండ' పౌరాణిక చిత్రాన్ని నేనే నిర్మిస్తాను. ఎ. నరసింహారావు నిర్మించే 'పల్లె వెలుగు' సాంఘిక చిత్రానికి నేను కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి డైరెక్ట్ చేస్తాను,'' అన్నారు ఎ. పట్టాభిరామారావు. ఈయన చాలా కాలం క్రితం తెలుగులో ''సాయిబాబా'' చిత్రాన్ని రూపొందించాక బెంగళూరులో పారిశ్రామికవేత్తగా స్థిరపడ్డారు. ఇప్పుడు కొత్తగా పై బేనర్‌లో పై రెండు చిత్రాలను అందించడానికి నిశ్చయించారు. ''పల్లె వెలుగు'' చిత్రానికి ఫిబ్రవరి రెండవ వారంలో పాటలు రికార్డవుతాయి. నాలుగవ వారం నుంచి మన రాష్ట్రంలో ఔట్‌డోర్‌లలో చిత్రీకరణ జరిగి, ఏప్రిల్ నెలాఖరుకు పూర్తవుతుంది. ''సుందరకాండ'' షూటింగ్ మార్చి చివరి వారంలో భద్రాచలంలో మొదలవుతుంది. ఈ రెండు చిత్రాలలో తారాగణం : రేవతి, లలిత, పద్మశ్రీ, రమణి, అరుణ, కె. రామం, చక్రపాణి, అరుణ్‌కుమార్, రమణమూర్తి, సూర్యనారాయణ, భరద్వాజ్, కాశీనాథ్ తాతా, ఎ. వెంకటరత్నం, వంశీ, కె. సుబ్బారావు, బాబ్జి. సాంకేతికవర్గం : భరద్వాజ్ సంభాషణలకర్త. వేటూరి, గోపి, రమాదేవి గీతాలకు పెండ్యాల నాగేశ్వరరావు స్వరబద్ధం చేశారు. బి. నంజప్ప ఛాయ, వాలి శిల్పం, వేణుగోపాల్ నృత్యాలు, నటరాజ్ కూర్పు, ఎస్. నారాయణ వేషరచనతో కాశీనాథ్ తాతా నిర్వహణ బాధ్యతలు వహిస్తారు.

'ఈ దేశంలో ఒకరోజు'లో ఒక దృశ్యం

## ''రామరాజ్యంలో భీమరాజు''గా కృష్ణ

''వసుంధర రాసిన వినోదాత్మక నవలను ఎన్నుకున్నాం. ఫిబ్రవరి నుంచి షూటింగ్,'' అన్నారు నిర్మాత మిద్దె రామారావు. శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి ఈ కొత్త చిత్రంలో కృష్ణ హీరో. సత్యానంద్ రచయిత. ఎ. కోదండరామిరెడ్డి దర్శకుడు.

## మాదాల కొత్త చిత్రం "స్వరాజ్యం"

''జనవరి చివర కొన్ని పాటలు రికార్డ్ చేశాం. ఫిబ్రవరి నుంచి షూటింగ్,'' అన్నారు మాదాల రంగారావు. ఈయన కథ రచన, నిర్మాణ సారథ్యం వహిస్తూ ప్రధాన భూమికను పోషించే యువతరం ప్రొడక్షన్స్ ''స్వరాజ్యం'' చిత్రానికి కాగడా శర్మ సంభాషణలు సమకూరుస్తున్నారు. ఆర్.రామారావు ఛాయాగ్రాహకుడు. బీరమ్ మస్తాన్‌రావు దర్శకుడు.

'ఆకలి నీకు జోహార్లు'లో కృష్ణవేణి

## ధర్మేంద్రకు "శిరోమణి"

ధర్మేంద్రతో పాటు 16 మంది పంజాబీలకు రాష్ట్రపతి సర్దార్ జైల్‌సింగ్ ''శిరోమణి'' బిరుదును ఇటీవల ప్రసాదించారు. లలితకళలు, సాంస్కృతిక రంగాలలో కృషి చేసే పంజాబీలకు ప్రతి ఏటా 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సిక్కు స్టడీస్' కేంద్రం ద్వారా అందజేయబడే గౌరవమిది.

ఉచితం! ప్రతి ఇమామీ వ్యానిషింగ్ క్రీముతో*
అందమైన తల పిన్నుల జత

# ఇమామీ అమన్

ఇమామీ అమన్
ఈ వ్యానిషింగ్ క్రీం ఆమెకు
చక్కదనాన్నిచ్చింది కనుక
ఆమె తన పేరును
క్రీముకు ఇచింది.

మిసమిసలాడే చర్మ సౌందర్యం.
లక్షలాది జనులు ఆరాధించి
ఆకాంక్షించే మృదుత్వమూ.
అందమూ, ఆ రహస్యం ఇప్పుడు
మీకూ తెలుసు. ఇమామీ ఒక
తార చర్మ సౌందర్య రక్షణ
మార్గం-మీది కూడా.

త్వరపడండి!
ఈ అవకాశం
కొద్దిరోజులు
మాత్రమే.

*40 గ్రా లేదా
80 గ్రాముల ప్యాక్




**ఇమామి**
వ్యానిషింగ్ క్రీమ్

ఇమామి అంటే ఇటాలియన్‌లో "నన్ను ప్రేమించు" అని
సౌందర్యానికి అది వాగ్దానం.

* ఆయా ప్రాంతాలకు తగినట్లుగా అందమైన,
ఆకర్షణీయమైన డిజైనులలో క్లిప్పులు.

* ఆంధ్ర ప్రదేశ్, కర్ణాటక, కేరళ, తమిళనాడులలో మాత్రమే.

## సినిమా

### గుత్తారామినీడు దర్శకత్వంలో
### శ్రీవాధ్ మూవీస్ ద్వితీయ చిత్రం

"సాటి ఆడదాన్ని ఉరి తీయాలని వాదిస్తుంది కోడలు పోటేపడి ఆమెను రక్షించాలని ప్రయత్నిస్తాడు కొడుకు తండ్రి ఇలాంటి కేసును కోటకెక్కి న్యాయాన్ని ఎలా చూడలేదు నూటికి మారుపేళ్ళా న్యాయానికి న్యాయం జరగాలి కదా? ఈ ప్రధాన ఇతివృత్తం గల 'చలిసువ మోడగళు' అనే కన్నడ చిత్రం కర్నాటక రాష్ట్రంలో ఇంకా హౌస్ ఫుల్ కలెక్షన్స్‌తో దిగ్విజయంగా విహారం చేస్తోంది దీని ఆధారంగానే శ్రీనాథ్ మూవీస్ రెండవ చిత్రం తయారవుతోంది," అన్నారు డైరెక్టర్ గుత్తా రామినీడు ఈ చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ అంబిక, రావు గోపాలరావు ఆదిగాగల వాటుంటారు.', "ఫిబ్రవరి 4—5 తేదీల్లో ఇళయరాజా స్వరకల్పనలో ఆత్రేయ, ఆరుద్ర, సి నారాయణరెడ్డి రాసిన పాటలను రికార్డ్ చేశాం ఫిబ్రవరి 7నుంచి ఊటీలో డాన్స్ డైరెక్టర్ సలీమ్ కంపోజ్‌చేసిన డ్యాయెట్లను చిత్రీకరిస్తాం" అన్నారు నిర్మాణ సారధి కోగంటి భాస్కరరావు సత్యానంద్ సంభాషణలు, లక్ష్మణ్ గోరే ఛాయ. అంకిరెడ్డి కూర్పు, బాబా రమేష్ సింగ్ స్టంట్లు, దండమూడి కోటేశ్వరరావు ప్రొడక్షన్ బాధ్యతలు వహిస్తున్నారు మార్చినుంచి మే 15వరకు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ ముగుస్తుంది జూన్‌కు విడుదల చేయాలను కుంటున్నాం," అన్నారు నిర్మాత అలపాటి రంగారావు



'డార్లింగ్ డార్లింగ్'లో పూర్ణిమాజయరావ్

### "సమాజంలో స్త్రీ"

ప్రముఖ తమిళ దర్శకుడు దొరై కధ, స్క్రీన్‌ప్లే సమకూర్చి సమర్పించే దొరై అండ్ కశ్యప్ గ్రూప్ ఎంటర్‌ప్రైసెస్ వారి చిత్రానికి ఫిబ్రవరి 4వ పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది సుమన్, రావుగోపాలరావు, గొల్లపూడి మారుతీరావు, భానుచందర్, మాధ, విజయశాంతి, ఎస్ వరలక్ష్మి, దేవికారాణి, అన్నపూర్ణ, స్మిత, పాత్రధారులు కాశీవిశ్వనాధ్ సంభాషణలకర్త కృష్ణ—చక్రి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు వి మనోహర్ ఛాయ, సి వెంకటేశ్వరరావు కూర్పు, ఎస్ మోహన్ కుమార్— ఎస్ సాంబశివం సహకార దర్శకత్వంతో ఎం ఆర్ కృష్ణ డైరెక్టరు

## దాసరి రచన, దర్శకత్వంలో "బహుదూరపు బాటసారి"

''మొదట ఈ చిత్రాన్ని 'ముందు తరానికి మూడు మాటలు' అనుకున్నాం ఆ తర్వాత ఇంకో టైటిల్ కూడా మెదిలింది. చివరికి ''బహుదూరపు బాటసారి''గా నిర్ధారణ చేశాం. విత్తనం వేసేది ఒకరు అది మొక్క అయి, మాను అయి, ఎప్పుడో కాయలు కాస్తుంది ఆ కాయలను కోసేది ఇంకొకరు ఫలితం పొందేది మరొకరు చివరివరకు తన కాళ్ళ మీద తాను నిలుచొనే జీవితం గడపడంలో సంపూర్ణ సంతృప్తి ఉంటుంది గాని, తనకు ఆదరవుగా తన సంతానం నిలవాలని ఆశించడంవల్ల పరిపూర్ణమైన జీవితం లభిస్తుందనుకోవడం ఒట్టి భ్రాంతే అలాంటి వారికి ఓ కంట నవ్వు — ఓ కంట ఏడుపు కనులు రెండున్నవీ అందుకేనా ? ఎందుకు ఏడుపు తప్పదు — అంటే, కన్నందుకు ముడుపు ! . నీతి నిజాయితీతో బతికే మనిషికే జీవితంలో ఎన్నో మిట్టపల్లాలుంటాయి ఒక మనిషి తన జీవితకాలంలో వివిధ దశల్లో ఎదుర్కొనే సమస్యలను దృష్టిలో పెట్టుకొని తయారుచేస్తున్నాం ఈ చిత్రాన్ని,'' అన్నారు తారకప్రభు ఫిలిమ్స్ వారి పై చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు సమకూర్చి, దర్శకత్వం వహిస్తూ నిర్మించే దాసరి నారాయణరావు ఈయనతోపాటు ఏ ఎన్ ఆర్, జగ్గయ్య, ప్రభాకర రెడ్డి, రామకృష్ణ, గుమ్మడి, ఈశ్వరరావు, సునున్, భానుచందర్, నారాయణరావు, నారాయణమూర్తి, రాజా, రాంజీ, సుజాత, దీప, రమాప్రభ, పుష్పలత, సుహాసిని, శ్రీగీత, వసంతమాధవి, షహీదా, లేడీ కానిస్టేబుల్‌గా జయమాలిని నటిస్తున్నారు రమేష్ నాయుడు సంగీతం, వి ఎస్ ఆర్ స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, రమణబాబు సహదర్శకత్వం, కె బసవయ్య నిర్వహణలో ఈ చిత్రాన్ని సమర్పించే శ్రీమతి దాసరి పద్మ'' మొదటి షెడ్యూల్ జనవరి 16నుంచి ఫిబ్రవరి 10వరకు హైదరాబాద్‌లో జరిగింది రెండవ షెడ్యూలు ఫిబ్రవరి 20నుంచి 28వరకు ఊటీలో జరుగుతుంది ఏప్రిల్ 14న రిలీజ్ చేస్తాం,'' అన్నారు

## వేజెళ్ళ దర్శకత్వంలో "అరణ్యరోదన"

విశిష్టమైన ఇతివృత్తాలను తెరకెక్కించడంలో తనకంటూ ఓ స్వంత బాణీని సంతరించుకున్న వేజెళ్ళ సత్యనారాయణ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వై కేశవరెడ్డి నిర్మించే శ్రీ విజయసారథీ ఆర్ట్ పిక్చర్స్ 'అరణ్యరోదన' చిత్రానికి జనవరి 20న రెండు పాటలు రికార్డయ్యాయి శివకృష్ణ, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, పి ఎల్ నారాయణ, హేమసుందర్, డాక్టర్ శివప్రసాద్, రాజేంద్రప్రసాద్, రాజ్‌వర్మ, రాజ్యలక్ష్మి, గీత పాల్గొంటారు పరుచూరి, గోపాలకృష్ణ సంభాషణలు రాశారు ఆర్రుద్ర, డాక్టర్ నెల్లుట్ల గీతాలకు శివాజీరాజా స్వరాలను కూర్చారు ఆర్ కె రాజు ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, బాబూరావు కూర్పు, అక్కినేని శ్రీనివాసరావు నిర్మాణ సారధ్యంలో ఈ చిత్రాన్ని సికింద్రాబాద్ వెంకటకృష్ణా ఫిలిమ్స్ అధినేత ఆ౦ం గోపాలరెడ్డి సమర్పిస్తారు. ★

# నవ్య పథకానికి నాంది పలికిన హీరో కృష్ణంరాజు

జి.వి.జి.

**ప**దా ఎంతో హుందాగా కనిపించే కృష్ణంరాజు మాటలలో రాజసం ఉట్టిపడుతూంటుంది సినిమారంగం నుంచి రాజకీయ రంగం వరకు అన్ని విషయాలూ ఈయనకు కరతలామలకాలు ప్రాంతీయాభివృద్ధి గురించి ఇటీవల ఈయన తెలియజేసిన కొన్ని విషయాలు మార్గదర్శకమైనవి ''మా జన్మస్థలం మొగల్తూరులో కళాశాల లేదు కాలేజీ చదువుల కోసం ఇతర ఊళ్ళకు వెళ్లవలసి వస్తోంది మా ఊళ్ళో కళాశాల నిర్మాణానికి స్థానిక ప్రజలు ఎంత విరాళమిస్తే, నేనూ అంత ఇస్తాను అంతేకాకుండా స్థలాన్ని కూడా విరాళంగా ఇస్తాను ప్రభుత్వ కృషితోపాటు ప్రజల సహకారం కూడా ఉంటే, ఏ రాష్ట్రమైనా అనతికాలంలోనే సర్వతో ముఖాభివృద్ధి చెందితీరుతుంది నేను ప్రజల మనిషిని ప్రతి మంచి పనికీ ముందుండే వ్యక్తిని ప్రజాహిత కార్యక్రమాలకు నా పూర్తి మద్దతు సదా ఉంటుంది నేను ఏ పార్టీకీ చెందిన వ్యక్తిని కాను మన ఎన్ టి రామారావుగారు చిత్తశుద్ధి, కఠోర క్రమశిక్షణ, కర్తవ్యాల దీక్ష గల రాజర్షి 'తెలుగుదేశం' పార్టీ అంశాలన్నీ ప్రజాహితమైనవే వారి ఆశయాలు నెరవేరడానికి నా సంపూర్ణ సహకారం ఎల్లవేళలా ఉంటుంది అలాగే మా పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం నియోజకవర్గం నుంచి 'తెలుగుదేశం' అభ్యర్థిగా గెలుపొందిన చేగొండి హరిరామ జోగయ్య (హరిబాబు) కడు సమర్థుడు దీక్షాదక్షతలు గల కర్మవీరుడు ఆయన ఆధ్వర్యంలో నా సహకారం సద్వినియోగమయితీరుతుందని నా ప్రగాఢ విశ్వాసం,'' అన్నారు

అందుకు సమాధానంగా చేగొండి హరిరామ జోగయ్య ''చరిత్రాత్మక సంఘటన అయిన ఇటీవలి ఎన్నికలలో మా నియోజకవర్గానికి కృష్ణంరాజుగారు ప్రత్యక్షంగా మద్దతు ఇవ్వకపోయినా — పరోక్షంగా ఎంతగానో తోడ్పడ్డారు అందుకే ఆయన్ని మా నియోజకవర్గాన్ని దత్తత తీసుకోవలసిందిగా కోరుతున్నాను ఆయన సంపూర్ణ సహకారంతో మా ప్రాంతపు అభివృద్ధి కార్యక్రమాల్లో తీవ్రమైన కృషి చేయగలం కాలేజీ నిర్మాణమేకాక — నర్సాపురం, సఖినేటిపల్లి రేవులను కలుపుతూ వశిష్ట గోదావరిపై వారధి నిర్మాణం అత్యావశ్యకం ఇందుకు కొన్ని కోట్ల రూపాయలు వ్యయమవుతుంది ప్రభుత్వ సహకారం ఉన్నా — ప్రజల విరాళం కనీసం పాతిక లక్షలన్నా అవసరం మా నియోజకవర్గాన్ని కృష్ణంరాజుగారు దత్తత తీసుకోవడంవల్ల ఇలాంటి ప్రజాహిత కార్యక్రమాలన్నీ నెరవేరితీరుతాయి,'' అన్నారు

ఈ ప్రేరణలో ప్రతి ప్రాంతంలోని సినీ ప్రముఖులు, తదితర ప్రముఖులు ముందుకు వచ్చి కృషి చేస్తే, అనతికాలంలోనే మన రాష్ట్రం అన్ని రంగాలలోనూ అభివృద్ధి సాధించితీరుతుంది

కృష్ణంరాజు కాల్షీట్‌లు ఇచ్చిన కొన్ని కొత్త చిత్రాలు ఈయన సమర్పణలో యు సూర్యనారాయణరాజు నిర్మించే గోపీకృష్ణ మూవీస్ కొత్త చిత్రం త్వరలోనే కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో ప్రారంభమవుతుంది నాచు శేషగిరిరావు నిర్మించే హేరంభ చిత్ర మందిర్‌వారి చిత్రం, శేఖర్‌బాబు నిర్మించే దేవీ కమల్ మూవీస్ చిత్రం, వెంకటరామరాజు నిర్మించే చిత్రం — వీటికి స్క్రిప్టులు సిద్ధమవుతున్నాయి.



'పులి—బెబ్బులి'లో కృష్ణంరాజు

# అడ్డదారులు

పెద్దకథ

టి.ఎస్.ఎ.కృష్ణమూర్తి

**(గత సంచిక తరువాయి)**

స్నానం చేసి బట్టలు మార్చుకుని డేవిడ్‌వాళ్ళ అమ్మగారు ఇచ్చిన కిచిడీ కొద్దిగా తిని, ్యాంగో జ్యూస్ త్రాగేసి డేవిడ్ గదిలో మంచంమీద ాలాను

"నీవో ఫూల్‌వి రా!" అన్నాడు డేవిడ్ నా పక్కనే వచ్చి కూర్చుంటూ

"ఏమ్రిటా నీ డొంకతిరుగుడు? కన్పించిన ్గర్నుండీ తిడుతూనే వున్నావు ?" విసుక్కున్నాను ను

"ఒరేయి ఇది ఆకాశానికి నిచ్చెనలు వేయాల్సిన ులమురా! ఈ కాలములో వ్యక్తిగతమైన విలువలకు ావాలకు విలువనిచ్చే వాళ్ళు అరుదు, డాబూ, ర్పాలకే ప్రాధాన్యత ఎక్కువ అందుకే నిన్ను డియట్ అనడం!" అన్నాడు వాడు

వాడు చెపుతున్నది ఏమిటో సగం అర్థం యింది, సగం అర్థం కాలేదు సరిగ్గా

"అయితే నేను ఏంచేసి ఉండాల్సింది ?" అని డిగాను చాల కోపంగా

"చాలసేసి వుండాల్సింది! బస్ దిగంగానే ళ్ళికి పరిగెత్తుకు రాకుండా ఇక్కడికి వచ్చి, ట్‌గా గెడ్డం గీక్కుని, స్నానంచేసి, నీ సూట్ స్‌లో తెచ్చుకున్నవే ఆ బట్టల్లోని ఆ కొరియా ంటు, జపాన్ సిల్కు షర్టు ఇన్ షర్టు చేసి ెడుక్కుని, నీట్‌గా టై కట్టుకుని ట్రెంగా, ందాగా వచ్చి వుండాల్సింది అరగంట ఆలస్యంగా యినా

జీతం ఏడువందలనీ, టి ఏ వగైరాలు రెండు ందలకు పైగా వస్తాయనీ చెప్పి వుండాల్సింది ద్యోగం త్వరలో పర్మనెంట్ అయిపోయి ఓ పమోషన్ వస్తుందని కూడా చెప్పి వుండాల్సింది ా ఎన్నో చెయ్యాల్సింది!" అన్నాడు డేవిడ్ వధానంగా

"ఏడిచావు! అంత ఆత్మవంచన చేసు వడమా!"

"ఒక రచయితగా నేను ఇలా చెప్పకూడదేమో నీ, నా మిత్రుడుగా ఇలా చెప్పడంలో తప్పలేదు ంతమంది మధ్య వంటరితనంగా బాధ అనుభ ంచడం కన్నా కొద్దిగా ఆత్మ వంచన చేసుకోవడం ంచిది కాదూ ?

అసలు ఆ వెధవలలో నీకన్నా తెలివైనవారూ, ాయిలీపరులూ ఉన్నారని అనుకోవడం భ్రమ కానీ వాళ్ళు అడ్డదారులు త్రొక్కడమేకాదు ఆత్మవంచన చేసుకుంటూ కూడా ఎంత హ్యాపీగా ఉన్నారో చూస్తే నాకు ఆశ్చర్యంగా వుంటుంది నీవు కొద్దిగా నేను చెప్పినట్లుగా ప్రవర్తించి వుండి వుంటే ఇంత దూరం వచ్చినందుకు తృప్తిని అయినా మిగుల్చుకుని వెళ్ళివుండేవాడివి నీవు చాల సున్నితమైన మనస్తత్వం కలవాడివి అందుకే నీవు ఎంత హర్టు అయ్యావో నాకు ఒక్కడికే తెలుసు!"

డేవిడ్ మాటలలో నాకు అర్థంకాని నిజం ఏదోవుంది అందువలననే నేను ఆలోచనలో పడి పోయాను.

"నీకు మిత్రుడుగా నేనిచ్చే సలహా ఇంకోటుందిరా నీవా టెంపరరీ ఉద్యోగం వదిలెయ్యి సాధ్యమైనంత త్వరలో నీలాంటి వాళ్ళు గవర్నమెంటు ఉద్యోగంలోకన్నా ప్రయివేట్ ఫర్మ్‌లలోనే వృద్ధి చెందగలరు త్వరత్వరగా. నిజాయితీ పరులకు ప్రయివేటు ఫర్మ్సులో ఉన్నన్ని అవకాశాలు గవర్నమెంటులో వుండవు నిజానికి గవర్నమెంటు సర్వీసులో గుర్రమూ, గాడిదా రెండూ ఒక్కటేనని నా అభిప్రాయం." అన్నాడు డేవిడ్ మళ్ళీ తనే

వాడా సలహా ఎందుకిచ్చాడోకానీ ఆ సలహా నా బుర్రలో పదిలంగా నాటుకుంది ఆ క్షణాలలోనే

"నీ సలహా గుర్తుంచుకుంటానురా ఇంకో విషయం ఈ పర్యాయం నేను వీరందరి మధ్యకూ రావాలనుకుంటే వీరందరికన్నా మంచి పొజిషన్‌లో ఉంటే తప్ప రాను!" అన్నాను డేవిడ్ చేయి అందుకుని ప్రేమగా నొక్కుతూ

ఏ కారణం చేతనైనా డేవిడ్ ఊర్లో లేకుండా వుండి, నాకు కన్పించకుండా పోయివుంటే నాకు తప్పక వెర్రెత్తిపోయి వుండేది

వాడి చేతిని ఎంత నొక్కినా నాకు తృప్తి కలగ లేదు ప్రేమంతా పైకి ఒలకబోయక పోయినా నిజానికి డేవిడ్ ఎప్పటికి మార్పుచెందని కల్తీలేని నిజమైన మిత్రుడు స్నేహం విలువ వాడికి తెలిసినంత బాగా మరెవరికీ తెలియదేమో ?

ఇది మరీ వింత ప్రపంచం లేకపోతే ఇంత ప్రేమను హృదయం నిండా నింపుకుని, స్నేహం కోసం ప్రాణం ఇవ్వగల మనస్తత్వం కలిగిన డేవిడ్ విప్లవ రచయిత ఎలా అవుతాడు ?

"రచయితలు రెండు వర్గాలుగా వున్నారు ప్రజలను కారకంములతో వాతలుపెట్టి, కొరడాలతో కొట్టి తట్టి నిద్రలేపే రచయితలు ఒక వర్గం వారయితే, ప్రజలని హాయిగా జోకొట్టి నిద్రపుచ్చి అందమైన కలలు కనమని చెప్పే రచయితలు రెండో వర్గంవారు" అన్నాడు ఒక రచయిత

అయితే మన ప్రజలు రెండోవర్గం రచయితలను ఆదరించినంత గొప్పగా మొదటి వర్గం వారి ఆదరించరు అందుకే కాబోలు మొదటి వర్గాని చెందిన రచయిత అయిన డేవిడ్ తగిన గుర్తింపున పొందలేకపోయాడు ఇంతవరకూ కూడా!

* * *

"లలితా! నేను తిరుమలా ఎక్స్‌ప్రెస్‌లో బెజవాడకు వెళ్ళిపోతున్నాను!" అన్నాను

"గుడ్ రాజా! వెళ్ళగానే ఉత్తరం వ్రాయి అన్నట్లు రెండ్రోజులు ఉండకూడదూ ?" అంది లలిత ఆమె స్వరంలో ప్రేమకన్నా నిర్లక్ష్యం ఎక్కువగా ధ్వనించింది

"లలితా! నిన్ను ఎంత ప్రేమించాను ? ఎంత ప్రేమిస్తున్నాను ?" ఆక్రోశించింది నా మనసు

అయినా మౌనంగా నిలబడ్డాను ఆమె ముందు కొద్ది నిముషాలు కనీసం తమ ఇంటికి ఆహ్వా నిస్తుందేమోనన్న ఆశ ఏ మూలనో కొట్టుమిట్టాడు తోంది నా మనసులో

"సరే రాజా! నీకు సెలవు లేదుకాబోలు విష్‌యూ ఆల్ ది బెస్ట్ యం ఎ పూర్తిచెయ్యి ఈ పర్యాయం జాబ్ పర్మనెంట్ చేసుకో! అంత వరకూ నేను ఎదురుచూస్తుంటాను!" అంది మళ్ళీ తనే అయితే ఈ పర్యాయం నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని కొద్దిగా నొక్కింది

"థాంక్స్ లలితా! యం ఎ ఆగదు ఈ పర్యాయం జాబ్ విషయం చెప్పలేను గుడ్‌బై లలితా!"

"గుడ్‌బై రాజా!"

"లలిత ఇంట్లోకి వెళ్ళిపోగానే నేను డేవిడ్ ఇంటికేసి సాగిపోయాను దారిలో నాలుగు కన్నీటి చుక్కలు రాలిపోయాయి నా కళ్ళనుండీ ఒకదాని తరువాత ఒకటిగా ఎందుకో తెలియదు!

* * *

మానవ జీవితంలోని మలుపులు చిత్ర విచిత్రంగా వుంటాయి ఒక్కోసారి ఓ చిన్న సంఘటన కూడా ఓ పెద్ద మలుపుకు దారితీస్తుంది

రాధ పెళ్ళికి వెళ్ళివచ్చిన నాలో చాల మార్పు వచ్చింది.

సహజంగా నేను చేసే ప్రతిపనీ నిర్దిష్టంగా చేయడం నాకు అలవాటు ఆ అలవాటును ఇంకా అభివృద్ధి పరచుకోవడమేకాక నిరుత్సాహం అనేది నాలో ఏకోశానా లేకుండా చేసుకున్నాను

రోజులు గడిచిపోతున్నాయి చకచకా పరీక్షలు దగ్గర పడ్డాయి బాగా దీక్షగా సబ్జక్టులు స్టడీచేసి యం ఎ ఎక్జామ్స్ వ్రాసేశాను ఆంధ్రా యూనివర్సిటీకి

నాకేదయినా మంచి జాబ్ దొరికితే చూడమని దేశంలో ఎక్కడెక్కడో స్థిరపడ్డ నా పాత పరిచయస్థులకూ, స్నేహితులకూ అందరికీ ఉత్తరాలు వ్రాసేశాను

* * *

సహజంగా మానవులు కోరుకునే కోరికలే

నెరవేరుతూ వుంటాయి. కోరనివి జరగవని కాదు . మానవుడి మనసు దేనినైతే బలంగా కోరుతుందో ఆదే తప్పక జరుగుతుంది సామాన్యంగా. అయితే కొందరి విషయంలో త్వరితంగా జరిగితే మరికొందరి విషయంలో కాస్త ఆలస్యంగా జరగవచ్చు ఇది మానవుడి ఊహలకు అందని విషయమే మొత్తానికి

యం. ఎ. డిగ్రీ నా చేతికి అందడమూ, ఎక్కడో ఒరిస్సా స్టేటులోని కటక్‌లో స్థిరపడ్డ నా మిత్రుడు కాజాఖాన్ దగ్గర్నుండి ఓ ఉత్తరం రావడమూ యాదృచ్ఛికంగా ఒకే రోజున జరిగాయి.

కాజాఖాన్ వ్రాసిన వుత్తరం నన్ను మరీ ఆనందపరిచిందని చెప్పవచ్చు అందులో ఇలా వ్రాశాడు తను

ప్రియమైన రాజారావ్ !

చాలకాలం తరువాత నీ ఉత్తరం అంది నన్ను ఆనందపరచింది అయితే నీ ఉత్తరానికి చాల ఆలస్యంగా జవాబు వ్రాస్తున్నాను అందుకు తగిన కారణం లేకపోలేదు

నీ ఉత్తరంలో నీవు 'ఎక్కడైనా మంచి ఉద్యోగం దొరికేలా వుంటే చూడు, మంచి జీతం లభించేలా వుంటే ఈ జాబ్ రిజైన్ చేసేసి వచ్చేస్తాను' అని వ్రాశావు

నీ ఉత్తరం అందినప్పట్నుండీ నేను ఎంక్వయిరీ చేస్తూనే వున్నాను ఒరిస్సా ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న ప్రాంతము ఇప్పుడిప్పుడే ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్లూ, ప్రయివేటు ఫర్మ్‌లూ, గవర్నమెంటు ఫర్మ్‌లూ బాగా ఎక్కువవుతున్నాయి

ఒరిస్సా ప్రస్తుత క్యాపిటల్ సిటీ అయిన భువనేశ్వర్‌లో క్రొత్తగా ప్రారంభింపబడిన ఒక భారీ ఆగ్రో సీడ్స్ కంపెనీకి ఒక ప్రాజెక్టు మేనేజరు కావాలి ఆ కంపెనీ యజమానులు నిజాయితీ పరుడైన మంచి వ్యక్తి కోసం అన్వేషిస్తున్నారు.

అదృష్టవశాత్తూ ఆ కంపెనీ యజమానుల్లో ఇద్దరు నాకు బాగా పరిచయస్థులవడంవలన నిన్ను గూర్చి వారికి చెప్పాను నీ ఉత్తరం అందగానే నీకు డెఫినెట్‌గా ఈ ఉద్యోగం దొరుకుతుంది. ప్రారంభంలో ఏడు వందల రూపాయలు ఇస్తారు జీతం స్కూటరూ, రెసిడెన్సీ కూడా ఇవ్వవచ్చు ఒక సంవత్సరంపాటు వారికి సంతృప్తి కలిగేలా నీ డ్యూటీస్ నీవు నిర్వర్తించగలిగితే తరువాత నీ జీతం చాలా పెరుగుతుంది

ఈ ఉత్తరం అందగానే పెట్టే బేడా సర్దుకుని నేరుగా కటక్‌కు వచ్చెయ్యి ఎందుకైనా మంచిది నీ ఉద్యోగాన్ని రిజైన్ చేయకు రెండు నెలలు సెలవు పెట్టేసి వచ్చెయ్యి ఇక్కడి ఉద్యోగం నీకు నచ్చకపోతే వెనక్కి వెళ్ళిపోదువుగాని

నీ కొరకు ఎదురుచూస్తాను
ప్రియమిత్రుడు,
కాజా

ఉత్తరం అందగానే కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లో భువనేశ్వర్‌కు ఓ బెర్తు రిజర్వు చేయించుకున్నాను ఉద్యోగానికి నెల రోజులు సెలవుపెట్టి, నిర్వర్తించవలసిన సామాన్య బాధ్యతలన్నీ నిర్వర్తించి అందరి వద్దా సెలవు తీసుకుని ట్రెయిన్ ఎక్కేశాను

మరునాడు ఉదయం భువనేశ్వర్ రైల్వే స్టేషన్‌లో రైలుదిగి బస్టాండు చేరుకుని కటక్ వెళ్ళే బస్ ఎక్కాను. నలభై నిముషాలు ప్రయాణం చేసి కటక్ చేరుకుంది బస్.

కటక్‌లోని రిక్షావాళ్ళలో చాలమంది తెలుగు తెలిసినవారే అవడం వలన బెంగాలీ సాహీలో వున్న కాజాఖాన్ ఇంటికి చేరుకోవడం పెద్ద కష్టంకాలేదు నాకు

కాజా నన్ను ఆనందంగా రిసీవ్ చేసుకున్నాడు

* * *

విజయవాడలో నేను ఉద్యోగంలో చేరిన క్రొత్తలో పరిచయం అయిన వ్యక్తి కాజా అతనూ నేనూ కలిసి నివసించే వాళ్ళము గాంధీనగర్‌లోని ఓ ఇంట్లోని మేడమీది గదిలో అతను ఓ టైప్ రైటింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో ఇన్‌స్ట్రక్టర్‌గా వుండేవాడు అప్పట్లో

అతను పరిచయం అయి, అతని గదిలో నేను భాగస్వామి అయిన తరువాత కొద్ది రోజుల్లోనే మేము చాలమంచి స్నేహితులం అయిపోయాము అయితే చాల కొద్ది నెలల్లోనే అతను ఒరిస్సాలో వున్న తన స్నేహితుల సహాయంతో కటక్‌లోని ఓ సెంట్రల్ గవర్నమెంటు ఆఫీసులో స్టెనోపోస్టు సంపాదించుకోవడంతో విడిపోవాల్సి వచ్చింది మేము

ఆ తరువాత ఇదే కలవడం

రెండ్రోజులు కటక్‌లోనే గడిపాను కాజాతో పాటు తన స్నేహితులందర్ని పరిచయంచేసి, మహానది ఆనకట్టా, మహానది వరదనీళ్ళు కటక్‌ను దెబ్బదీయకుండా రాజా క్రిష్ణచంద్ గజపతికాలంలో కట్‌జోడీకి కట్టబడ్డ గోడయూ, ప్రసిద్ధి చెందిన ఆలయాలూ మొదలైనవి చూపించాడు కాజా

మూడవ రోజు ఉదయాన్నే భువనేశ్వర్‌కు వెళ్ళాము ఇద్దరం కలసి

హిందుస్థాన్ సీడ్స్ అండ్ ఆగ్రో ప్రొడక్ట్సు కంపెనీలో నన్ను దాదాపు గంటసేపు ఇంటర్వ్యూ చేశారు ఆ కంపెనీ డైరెక్టర్లు

కాజా తన ఉత్తరంలో వ్రాసి వుండినట్లుగానే ఏడువందల రూపాయల జీతంతో ఆ కంపెనీ ప్రాజెక్టు మేనేజరు ఉద్యోగం లభించింది నాకు యూనిట్ త్రీ ప్రాంతంలోని ఓ కాలనీలో అందంగా అధునాతనంగా వున్న ఓ చిన్న ఇల్లు కూడా కంపెనీ వాళ్ళే ఇచ్చారు నాకు



నాకా ఉద్యోగం లభ్యం కావడం కోసం కాజా శ్రమపడ్డాడో, ఎంత నమ్మకాన్ని నామీద కలిగించాడో నాకు నెమ్మదిగా తెలియవచ్చింది స్నేహం అనేది చాలా గొప్పది అనుకున్నాను.

రెండ్రోజులు నాతోనే వుండి భువనేశ్వర్‌లోని తన పరిచయస్థులమూ, మిత్రులమూ అందరినీ నాకు పరిచయం చేసి, లింగరాజ టెంపుల్, హోటల్ ప్రాచీకి ఎదురుగా వున్న రామాలయమూ, కోణార్క సూర్యదేవాలయమూ, పూరీ జగన్నాథస్వామి దేవాలయమూ మొదలైనవాటి నన్నిటినీ చూపించిన తరువాత కటక్‌కు వెళ్ళాడు కాజా.

అలాగా ఒరిస్సా భోజనాన్కి అలవాటుపడిపోయాను. ఆంధ్రా భోజనం కావాలనుకుంటే చాల దూరంవెళ్ళాల్సివచ్చేది అయితే త్వరలోనే నాకుతెలుగు భోజనం కూడా రుచికరంగా వండగలిగిన వంటవాడు దొరకడంతో వాణ్ణే నియమించుకున్నాను వంటవాడిగా.

ఉద్యోగం కూడా నా భావాలకు బాగా సరిపోయినదే అని తెలుసుకున్నాను చాల కొద్దిరోజులలోనే మనస్సంతా ఉద్యోగ నిర్వహణమీదే కేంద్రీకరించాను సంతృప్తిగా

* * *

సంవత్సరం రోజులు గడిచిపోయాయి గబగబా! ఒరిస్సాలో స్థిరత్వం సంపాదించుకునేశాను నేను

కంపెనీలో సిన్సియర్ ఆఫీసర్‌గా పేరుపొందాను యాజమాన్యంలో మంచి పలుకుబడీ, నమ్మకమూ సంపాదించుకోవడమేగాక వర్కర్సులో కూడా మంచి అభిమానాన్ని సంపాదించుకోగలిగాను

వందరూపాయలు పెరిగింది నా జీతం నేను వాడుకోవడం కోసం బజాజ్ చేతక్ స్కూటరు ఇవ్వబడింది

"ఒక సంవత్సరం గడవగానే వంద పెంచారా? అయితే ఇంకో సంవత్సరం గడిస్తే నీకు వెయ్యి రూపాయలు జీతం ఫిక్స్ చేస్తారు!" అన్నాడు కాజా

కాజా నన్ను తీసుకువెళ్ళి ఆంధ్రా కల్చరల్ అసోసియేషన్‌లో నన్నో ఆర్టిస్టుగా పరిచయం చేశాడు ఓనాడు కొద్దిరోజుల్లోనే నేను ఆంధ్రా అసోసియేషన్‌లో ఓ ముఖ్యమైన వ్యక్తిగా అయిపోయాను

ఒరియా మాట్లాడడం బాగా వచ్చేసింది ఒరియా వాళ్ళలో కూడా మంచి పరిచయస్థులూ, స్నేహితులూ ఏర్పడ్డారు నాకు.

# అ డ్డ దా రు లు

ప్రతి ఆదివారమూ నేను కటక్ వెళ్ళడమో, కాజా భువనేశ్వర్ రావడమో పరిపాటి అయిపోయింది ఇద్దరూ కలిసి ఆనందంగా, కులాసాగా గడిపేసేయడం అలవాటయిపోయింది తక్కిన ఆరు రోజులలో ఒకటి రెండుసార్లు ఫోనుమీద సంభాషణ సాగించడమూ పరిపాటి అయిపోయింది

మంచి ఉద్యోగం, స్నేహం విలువ బాగా తెలిసిన మిత్రుడి సాహచర్యం, పదిమందిలో గుర్తింపు, గౌరవం, హోదా ఇంతకన్నా ఏం కావాలి నాకు? మంచి మనశ్శాంతిని పొందాను నేను ఒరిస్సాలో

నన్ను సరిగ్గా ట్రీట్ చేయకుండా అవమానించి, బాధించిన మిత్ర బృందానికీ, లలితకూ పరోక్షంగా లక్షలకొలదీ కృతజ్ఞతలు తెలుపుకున్నాను మనసులోనే రాధ పెళ్ళిలో వారు అలా ప్రవర్తించడం, డేవిడ్ నాకు మంచి సలహా ఇవ్వడం నాలో చలనాన్ని కలిగించడం వల్ల ప్రయత్నంచేసి, కాజా సహాయంతో అదృష్టవశాత్తు లభించిన ఈ ఉద్యోగం సంపాదించుకోగలిగాను ఆ ఇన్సిడెంట్సు జరగకుండా వుండి వుంటే బావిలో కప్పలా బెజవాడలో ఆ టెంపరరీ ఉద్యోగం వెలగబెడ్తూ అక్కడే వుండేవాణ్ణే బహుశా!

* * *

ఓ రోజు ఉదయం పదకొండు గంటల ప్రాంతంలో కంపెనీలో నా ఆఫీసు గదిలో కూర్చుని బిజినెస్ లెటర్స్ డిక్టేట్ చేస్తున్నాను. స్టెనో ప్రవంతి షార్టుహ్యాండులో వ్రాసుకుంటోంది షార్ట్ హ్యాండ్ నోట్‌బుక్‌లో

ఆఫీసు అటెండరు ఏదో ప్యాకెట్ తెచ్చి నా టేబిలుమీద ఉంచి వెళ్ళిపోయాడు.

లెటర్స్ డిక్టేట్ చేయడం అయిపోయాక ఆ ప్యాకెట్‌ను అందుకుని ఓపెన్ చేశాను

నా పర్సనల్ యూజ్ కోసం కంపెనీవాళ్ళు అచ్చు వేయించిన ఖరీదైన న్యూయియర్సుడే గ్రీటింగ్ కార్డులు వంద వున్నాయి అందులో నోటబుల్ కొటేషన్సుతో కూడిన విషస్ క్రింద ఎ యస్ రాజారావు యం ఎ, ప్రాజెక్టు మేనేజరు, హిందూస్థాన్ సీడ్స్ అండ్ అగ్రో ప్రోడక్ట్సు, భువనేశ్వర్, ఒరిస్సా అని అందంగా ప్రింటు వేయబడి వున్న ఆ గ్రీటింగ్ కార్డ్సును చూడగానే నాకు చాల ఆనందం కలిగింది

జనవరి ఫస్ట్ తారీఖు ఇంకా ఎంతో దూరంలో లేదు

నా స్నేహితులకూ, పరిచయస్థులకూ అందరికీ పేరు పేరునా పోస్ట్ చేశాను ఆ కార్డులను రాధ పెళ్ళిలో నన్ను చిన్నచూపు చూసిన మిత్రులకు కూడా పోస్ట్ చేశాను మరచిపోకుండా

* * *

నేను పోస్టు గ్రాడ్యుయేటుని అయ్యాననీ, భువనేశ్వర్‌లోని ఓ పెద్ద కంపెనీలో ప్రాజెక్టు మేనేజరుగా పని చేస్తున్నాననీ నేను పంపిన గ్రీటింగ్ కార్డుల ద్వారా మాత్రమే తెలిసింది నా స్నేహితులందరికీ ఒక్క డేవిడ్‌కు తప్ప డేవిడ్‌కు మారిన నా పరిస్థితులను గూర్చి నేను విపులంగా ఎప్పటికప్పుడు వ్రాస్తూనే వున్నాను అయితే వాడు నా విషయాలు ఎవరికీ చెప్పకుండా రహస్యంగా ఉంచాడని నాకు తెలియదు నిజంగా ఈ రచయితలు చాల చిత్రమైనవాళ్ళు వాళ్ళు నిత్యజీవితాలలో కూడా ఎంతో ఉదాత్తంగానే జీవిస్తుంటారు చాలావరకు అయితే ఎన్నో విషయాలు అతిగోప్యంగా ఉంచుతారు కారణాలు వాళ్ళకి తెలియాల్సిందే

అభినందనలతో కూడిన ఉత్తరాల వర్షం కురిసింది నామీద, న్యూయియర్ గ్రీటింగ్స్‌తోపాటు లలిత కూడా చాల కాలం తరువాత ఓ పెద్ద ఉత్తరం వ్రాసింది

ఉత్తరాల పరంపరను చూస్తే కొద్ది కాగితాలే మిగిలివున్న నా లెటర్‌హెడ్ చాలదనిపించింది జవాబులు వ్రాయడాన్కి అందువల్ల ఓ ప్రెస్‌లో అర్జంటుగా ఖరీదైన లెటర్‌హెడ్సు అచ్చు వేయించాను లేత గులాబిరంగు కాగితాలమీద నా హోదాతో కూడిన కంపెనీ అడ్రసుతోపాటు రెసిడెన్సీ అడ్రసు కూడా కలిపి అచ్చు వేయబడ్డ లెటర్‌హెడ్సు నాకు మంచి ఉత్సాహాన్ని కలిగించాయి

అందరికీ జవాబులు వ్రాశాను ఓపికగా

నామీద మిత్రులకూ, ముఖ్యంగా లలితకూ ~ ్ఫై ఏర్పడ్డ క్యూరియాసిటీని గూర్చి డేవిడ్‌కు ~ులంగా వ్రాశాను చివరన ఓ ఉత్తరంలో.

* * *









బులుసు వేంకటరమణయ్య

# బిరుదాలు

బిరుదాలు మానవుల విశిష్టతకు గుర్తింపులు

ఇవి అనేకరకాలుగా ఉన్నవి విశ్వవిద్యాలయాలు పరీక్షలు పెట్టి, వాటిలో నెగ్గినవారికి ఇచ్చే బిరుదాలు కొన్ని అవి ఉద్యోగాలకూ, ఉపాధులకూ సంబంధించినవి ఆయా వ్యక్తులు వివిధరంగాల్లో చేసిన కృషిని ప్రశంసిస్తూ విశ్వవిద్యాలయాలు ఇచ్చేగౌరవ బిరుదాలుకొన్ని కొన్నిటిని ప్రభుత్వం ఇవ్వడంకూడా కలదు ఇవి కాకుండా వేర్వేరు సంఘాలు సభలు జరిపి, వ్యక్తులను కొనియాడుతూ ఇచ్చే బిరుదులు కొన్ని ఉన్నవి ఇవీ యోగ్యతను తెలిపేవే కాని విశ్వవిద్యాలయము, ప్రభుత్వం ఇచ్చే బిరుదులకున్నంత విలువ వీటికి ఉండదు

ఈ బిరుదులన్నీ ప్రయత్నపూర్వకంగా లభించేవే ప్రయత్నంలేకుండా వచ్చేవి కావు కొన్నిటికి బిరుదధారులు స్వయంగా ప్రయత్నించాలి. కొన్నింటికి వారి పక్షాన ఇతరుల ప్రయత్నం ఉంటుంది ఆ ప్రయత్నం వ్యక్తుల ప్రోత్సాహం వల్ల జరగవచ్చు వారి ప్రోత్సాహం లేకుండానూ జరగవచ్చు

ఇవి కాకుండా వేరొకరకం బిరుదలు కూడా ఉన్నాయి వాటికి ఎవ్వరి ప్రయత్నం ఉండదు. ప్రభుత్వంగాని, సంస్థలుగాని ఇచ్చేబిరుదులకంటే వాటికి ఉన్నవిలువ ఎక్కువ అవి ప్రజలు ఇచ్చే బిరుదులు అక్కరలేదని ఆయా వ్యక్తులు అంటున్నా, ఇష్టపడకపోయినా వారిమీద ప్రజలు బలవంతంగా రుద్దిన బిరుదులు! గాంధీగారిక్కల మహాత్మా బిరుదు ఇట్టిదే! దేశనాయకులు లాలాలజపతిరాయి పంజాబు కేసరి, ప్రకాశంగారి ఆంధ్రకేసరి, సి ఆర్ దాసు దేశబంధు, నాగేశ్వరరావుగారి 'దేశోద్ధారక' బిరుదులు కూడా ఇలాంటివే! ఇట్టివి మరికొన్నికూడా ఉన్నవి

ప్రస్తుత కాలంలో వెనుకబడినజాతుల అభివృద్ధికోసం అనేకపథకాలు ఏర్పడుతున్నాయి. ఆ పథకాలలో బిరుదప్రదానం కూడా ఒకటిగా ఊహించడానికి అవకాశం ఉన్నది ప్రభుత్వరంగంలోనూ, ప్రభుత్వం అజమాయిషీలో ఉన్న సంస్థలలోనూ ఈ బిరుదప్రధానం యోగ్యత ననుసరించి కాకుండా ఇతర కారణాలమూలంగా జరుగుతున్నాయి ఇలా బిరుదలు సంపాదించినవారికి ఆత్మతృప్తి కలుగవచ్చు కాని యిది ఆరోగ్యకరమైన పద్ధతికాదు బిరుదులను ఆపేక్షించకుండా చేసిన సేవయే ఉత్తమమయినది నిస్వార్థంగా వివిధ రంగాలలో కృషిచేసేవారు ఎన్నడూ బిరుదాలను ఆశించరు అట్టి ఆశవున్నవారు ఏ పనినీ సక్రమంగా చెయ్యలేరు అందువల్ల బిరుదాలకు ఆశపడకుండా తమ అభిమాన రంగాలలో కృషిచేయవలసి వున్నది బిరుదాలు సంపాదించినవారు, తమకు అవి లభించినవని తృప్తిపడకుండా, ఆయా బిరుదాలకు తమ అర్హతను నిరూపించుకొనుటకు ప్రయత్నించడం అవసరం ★

చిన్నప్పట్నుండీ నాకు చిత్రలేఖనం అంటే చాల అభిమానం ఉండేది హైస్కూలు రోజులలోనే ఏవో బొమ్మలు గీస్తూండేవాడిని అయితే నేను బి ఎ ముగించిన తరువాత గానీ మంచి ప్రావీణ్యం సంపాదించలేకపోయాను అందులో

ప్రావీణ్యత సంపాదించిన తరువాత కూడా ఆర్టిస్టుగా పేరు తెచ్చుకోవాలనే ఉబలాటం నాలో ఉండేదికాదు

బెజవాడలో ఉద్యోగంలో చేరాక నన్ను బాగా ప్రోత్సహించి నన్నో మంచి ఆర్టిస్టుగా తయారు చేసినవాడు కాజాఖాన్ అయితే నేను ఆర్టిస్టుగా స్థిరత్వం సంపాదించుకోక మునుపే అతను ఒరిస్సా వెళ్లిపోవడంతో నాలోని ఆర్టికల్ మైండ్ నిద్రపోయి మూలపడిపోయింది

ఇక్కడికి వచ్చి స్థిరపడ్డాక ప్రతి ఆదివారం కాజాను కలుసుకున్నప్పుడు తనుఇచ్చే ప్రోత్సాహమూ, ఆంధ్రా కల్చరల్ అసోసియేషన్ వాళ్ళు నాపై చూపించే అభిమానమూ నాకు మంచి ఉత్సాహాన్ని రెప్పించి ప్రతిరోజూ రెండుమూడు గంటలపాటైనా కుంచె పట్టుకుంటే తప్ప సంతృప్తి కలగని అలవాటును కలిగించాయి

కాజావాళ్ల ఇంట్లో, ఆంధ్రా కల్చరల్ అసోసియేషన్ ఆఫీసులో, ఇంకా కొద్దిమంది మిత్రుల ఇళ్ళలో గోడలమీద అద్భుతమైన పెయింటింగ్స్ నిలబెట్టాను వరుసగా

ఆర్టిస్టుగా కూడా నా స్థాయి పెరిగింది మంచి చిత్రకారుడుగా భువనేశ్వర్, కటక్‌లలో పేరు పొందాను. భువనేశ్వర్‌నుండి వెలువడే ఓ ఒరియా పత్రికలోకూడా నా చిత్రాలు వరుసగా ప్రచురింపబడడంతో నేను ఒరిస్సా చిత్రకారులలో ఒకడయ్యానని చెప్పవచ్చు

* * *

ఒకరోజు సాయంకాలము ఎ జి ఆఫీసులో సెక్షన్ ఆఫీసర్‌గా పనిచేసే ఓ మిత్రుడి ఇంటికి బయల్దేరబోతున్నాను అంతలో హడావుడిగా వచ్చాడు కాజా ఇంట్లోకి

''భోలానాథ్! అర్జంటుగా టీ, బిస్కట్లు పట్టుకురా కాజాగారు వచ్చారు'' అని కేకవేశాను వంటగదిలోకి

భోలానాథ్ మహారాణా మా వంటవాడి శుభ నామం

''రూర్కెలా నుండి మా ఫ్రెండ్ తారానాథ్ పంపాడు ఇది అతనికి నిన్నుగూర్చి ఆమధ్య కలసినప్పుడు చెప్పానులే!'' అంటూ సోఫాలో కూర్చుని నాకు ఓ కాగితం అందించాడు కాజా

అనుకోకుండా కాజా వచ్చి కలసిన సంతోషంలో ఉత్సాహంగా మడతలు విప్పాను ఆ కాగితాన్ని

హైదరాబాదులో జరగబోతున్న ఓ ఆర్టు ఎగ్జిబిషన్‌కు సంబంధించిన కాంపిటీషన్ తాలూకు అడ్వర్‌టైజుమెంటు కాగితం అది బహుశా ఏదో తెలుగు దినపత్రికలోంచి కత్తిరింపబడి వుండాలి

''ఈ ఎగ్జిబిషన్‌కు నీవు ఓ మంచి చిత్రం గీసి పంపాలి!'' అన్నాడు కాజా భోలానాథ్ అందించిన బిస్కట్ల ప్లేటు అందుకుంటూ

''ఎగ్జిబిషన్‌కు పంపడాన్కి తగిన స్తోమతగలిగిన కళాత్మక చిత్రాన్ని నేనెక్కడ గీయగలను కాజా? అందులోనూ ఇది కాంపిటీషన్ వున్న ఎగ్జిబిషను దానికి పంపాల్సిన ప్రతి చిత్రమూ పోటీకి సంపూర్ణ అర్హత కలిగినది అయివుండాలి కదా?'' అన్నాను నిరుత్సాహంగా

''నీవు తప్పక గీయగలవు రాజా! ప్రయత్నమే చేయకుండా ఉంటే నీవు ఆర్టిస్ట్‌గా వెలుగులోకి రాలేవు ఏదైనా మంచి చిత్రం గీయి మనకు బహుమానం రాకపోయినా నష్టంలేదు ఆర్టిస్టుగా నీకు మంచి పేరు వస్తేచాలు'' అన్నాడు కాజా సావధానంగా.

''ఎలా కాజా? వ్యవధికూడా ఎక్కువలేదే? అయినా నీ మీది గౌరవభావంతో, ప్రేమతో ఓ మంచి చిత్రం తయారుచేయడాన్కి ప్రయత్నం చేస్తాను అది సకాలంలో తయారయి, నీవు ఓకే అంటే, పంపించడాన్కి ప్రయత్నం చేస్తాము'' అన్నాను

''వెరీగుడ్ యార్! విష్‌యూ బెస్ట్ ఆఫ్ లక్!'' అన్నాడు కాజా

ఈ విషయం తెలిసాక అసోసియేషన్ వాళ్ళూ, మిత్రులూ, పరిచయస్థులూ అందరూ ప్రోత్సహించారు.

నాలో ఉత్సాహం పుట్టింది అయితే పోటీకి పంపే చిత్రం గీయడాన్కి ఉత్సాహమూ, ఆవేశమూ మాత్రం చాలవు చక్కటి ఆలోచనలు కూడా కావాలి

మంచి చిత్రం యొక్క స్కెచ్‌కోసం ఆలోచన ప్రారంభించాను

[ఇంకా వుంది]




**యామినీ సరస్వతి**

సీతానగర్ కాలనీలో కెల్లా కేశవులుగారిల్లు అత్యాధునిక సౌకర్యాలతో ఆడంబరంతో ఐశ్వర్యంతో తలమానికంగా వుంటుంది ఆయన ఎం ఇ చేసి ఇంజనీరింగ్ శాఖలో ప్రవేశించిన కొత్తలో చాలా నిజాయితీగా వుండేవాడు కాంట్రాక్టర్ల ప్రలోభానికి లొంగకపోవటంవల్ల పట్టుమని పది కాలాలపాటు ఎక్కడా నిలకడగా వుండే యోగం పట్టలేదు మంత్రిగారో ముఖ్యమంత్రిగారో డైరక్టుగానో ఇండైరక్టుగానో అతన్ని ఇన్‌ఫ్లూయెన్స్ చేసేవారు తప్పనిసరి అయి కంట్రాక్టర్ల కాంట్రాక్టు పద్ధతులకి లొంగిపోవలసి వచ్చింది

ఆలోచించగా ఆలోచించగా ఇలా కంట్రాక్టర్లకి తోడ్పడుతూ, ఆత్మద్రోహం చేసుకొనేదాని కంటే ఉద్యోగం వదిలెయ్యటం మేలనిపించింది తక్షణమే భార్యా, మామా అంగీకారం తెలపటంతో రిజైన్ చేశాడు తర్వాత వారం తిరక్కముందే మామగారి సలహాతో శ్రీ సీతారామ ఇంజనీరింగ్ కాంట్రాక్టర్స్ సంస్థ వెలిసింది ఆ టౌన్‌లో టౌన్‌షిప్ అవసరమయిన వందెకరాల పొలాన్ని చౌగ్గా కొనేసి ప్లాట్లుగా విభజించి సీతానగర్ కాలనీపేర వెలయించి తనో యిల్లు కట్టుకుని, ప్లాట్లు కొన్నవారు కనరాని పాట్లు పడకుండా తనే డిజైన్ చేయించి యిళ్ళు కట్టించాడు

ఈ మధ్య కాలంలో హైద్రాబాదుకీ అతని వూరుకీ తిరగటంవల్ల మంచి రాచబాట దొరికింది రెండేళ్ళలో కాలనీ నిర్మాణం పూర్తి కావడంతో, పాత కొత్త పరిచయాలతో హైద్రాబాద్‌లో అతనికి కావలసిన పనులు చకచకా జరిగిపోయే అవకాశాలు బోలెడన్ని కలిసొచ్చాయి

కంట్రాక్టర్‌గా జీవితం ఓ వెలుగు వెలగనారంభించింది

ఆ రోజు కేశవులుగారి కుమారుడు వాసు తొమ్మిదవ జన్మదినోత్సవం ఇల్లంతా సంరంభంతో, సంబరాలతో కోలాహలంగా వుంది ఇంట్లో పని మనుషులు, బంధువులు గెస్టులు అంతా హడావిడి పడిపోతున్నారు

వచ్చిపోయే జనంతో శారదకి క్షణం తీరడం లేదు డ్రింక్స్ యిచ్చేవారికి డ్రింక్స్, హాట్ డ్రింక్స్ వారికి అవీ, భోజనాల వారికి భోజనం, టీనేన్స్‌వారికి స్వీట్స్ ఎరేంజ్ చేయటంలో ఆమెకి ఊపిరి సలపటం లేదు

'శారదమ్మ అదృష్టవంతురాలు!'' అంది ప్రిన్సిపల్ రాజుగారి సతీమణి సుభాషిణి

అటుగా వెళుతున్న శారద నవ్వుకుంది

'ఒక్కడే కొడుకు! లక్షలు దాటిన ఐశ్వర్యం మాటదాటని మొగుడు గడపదాట అవసరంలేని పని మనుషులు ఆమె కేమిటి రాజ భోగం అనుభవిస్తోంది!'' అంది అలివేలు ఆమె మాజీ మునిసిపల్ చెయిర్మన్‌గారి చిన్న యింటావిడ!

'మళ్ళీ పిల్లలు కలగలేదా?'' కొత్తగా వచ్చిన ఎస్పీగారి సతీమణి శ్రీమతి మీనాక్షీ సుందరం అడిగింది

'ఊహూఁ ఆ కాన్పే చాలా కష్టమైపోయింది తల్లి కావాలా బిడ్డ కావాలా అన్నాడట సర్జన్ కేశవులుగారి సమాధానం రాకముందే డియంవో కలుగజేసుకుని ఇద్దరూ బ్రతకాలి ఇది నా ఆర్డర్ అన్నాడట ఛీఫ్ శ్రీనివాసరావుగారు సిజిరియన్ చేసి బిడ్డని తీసి ఇద్దర్నీ బతికించాడు పన్నెండు గంటలు మృత్యువుతో పోరాడి! అప్పుడే ఇక మళ్ళీ ఆమెకి

సంతానం కలగదని చెప్పారు కలిగితే ఆమె పోవడం ఖాయం అన్నారట ! భార్యపై ప్రేమతో ఆయన ఒక్క కొడుకే యిక చాలనుకున్నారు. ఆమెకి గర్భ సంచి తీసేశారు తర్వాత. ఆయన అంతకు ముందే వేసెక్టమీ చేసుకున్నారు—'

'అయ్యో !' అంది మీనాక్షి

'ఎందరుంటేనేమమ్మా ! ఒక్కడు చాలదూ!' అంది సుభాషిణి ఆమెకి నలుగురు కొడుకులు — ముగ్గురు కుమార్తెలు ఒక్కరూ సమంగా చదువుకోలేదు ఒక్కరికీ ఉద్యోగాలు లేవు అంతా రికామీగా తిరుగుతుంటారు

అంతలో శారద ఆటుగా వచ్చి 'రండి' అని పిలిచింది అందర్నీ

అంతా కదిలేరు

థియేటరంత విశాలమైన హాలు ! మధ్య చిన్న టేబిల్ దానిపై బర్త్ డే కేక్ దాన్నానుకుని శ్రీనివాస్ నుంచున్నాడు దాన్ని ప్రత్యేకంగా కలకత్తాలో తయారు చేయించి తెప్పించారు.

ఒకరి నొకరు హత్తుకోకుండా దూరం, దూరంగా మంచి సివిలైజ్డ్ మెన్ క్యూలో నించున్నట్టుగా అంతా నుంచున్నారు రూఫ్ కి వేలాడుతున్న షాండిలియర్ జర్మనీ నుంచి తెప్పించినది చాలా అందంగా వెలుగులు చిమ్ముతున్నది

గదిలోని జపాన్ ఎయిర్ కూలర్ చల్లదనాన్ని పరిమళభరితంగా వెదజల్లుతున్నది

'అబ్బాయికి సూట్ ఎక్కడ కుట్టించారు ?' ఎవరో అడిగారు

'న్యూయార్క్ లో ! ఈ యింట్లో ఆయనకీ, అబ్బాయికీ, ఆమెకి అన్నీ న్యూయార్క్ లోని యాక్స్ టైలర్సే కుడతారు డ్రెస్ మెటిరియల్ అంతా అమెరికాలో కొంటారు !' ఇంకెవరో జవాబిచ్చారు

లీలగా వినబడిన ఆ మాటలకి మెల్లగా నవ్వుకున్నాడు కేశవులు అది అతని పెదాల్ని అందంగా అలంకరించింది

ఇంగ్లండ్ నుంచి ఇంపోర్ట్ అయిన ఇంటిమేట్ ని అందరికీ సున్నితంగా స్ప్రే చేస్తున్నాడు కేశవులుగారి ఏసిస్టెంటు సుగంధ పరిమళాలు గుంపులు గుంపులుగా హాలు అంతా నిండుకుంటున్నాయి

'కేశవులుగారూ ! మీరు రిజైన్ చేసి చాలా మంచి పని చేశారు ! లేకపోతే ఎంత సిన్సియర్ గా వర్క్ చేసినా మీరు సి ఇ గ రిటైర్ అయ్యేవారు అంతే కదా! ఇంత డబ్బు సంపాదించేవారా?' అన్నాడు బాగా క్లోజ్ గా మూవ్ అయ్యే ఒక ఎమ్మెల్యే

'థాంక్యూ !' అన్నాడు కేశవులు

బర్త్ డే కేక్ కట్ చేసే సరికి ఏడుగంటలైంది. ఇంద్రభవనంలా వున్న ఆ హాలు దేదీప్యమానంగా వెలిగిపోతున్నది

'డిన్నర్ కి వెళదామా!' అన్నారు కేశవులుగారు ఆయన ఎనిమిదింటికంతా కార్లో బయలుదేరి హైద్రాబాద్ వెళ్లి అక్కడ నుంచి తెల్లారే సరికి బాంబేలో వుండాలి ! రేపు ఉదయం ఎనిమిదింటికి మహారాష్ట్రలోని ఒక భారీ ప్రాజెక్టు కాంట్రాక్ట్ విషయంలో ఆయనా, ఓ పంజాబీ కలసి మాట్లాడి, టెండర్స్ దాఖలు చేయాలి.

అంతా డిన్నర్ కి కదిలేరు.

టౌన్ లో ప్రముఖుడనిపించుకున్న ప్రతివారూ ఆ డిన్నర్లో పాల్గొన్నారు కొందరు స్నేహంతో, కొందరు అవసరంతో, మరి కొందరు ఆహ్వానంతో, అభిమానంతో వచ్చేరు ఎవరెవరి అలవాటు ప్రకారం వాళ్లు 'అవి' పుచ్చుకుని డిన్నర్ ముగించుకున్నారు

డిన్నర్ ముగిసేక గేటులో నుంచుని వెళ్లే కార్లన్నిటికీ టాటా చెప్పారు కేశవులుగారు సరిగ్గా అయిదు నిమిషాలసేపు క్యూలో వెళ్లాయి కార్లు మరో నిమిషానికి తన గదికి వచ్చేరు ఆయన

ఆ సరికి ఆయన సతీమణి సూట్ కేస్ సర్ది వుంచింది ఆ సూట్ కేస్ అందుకున్నారు ఆయన అలాగే ఎడంచేత్తో భార్యని దగ్గరికి తీసుకున్నారు శారద భర్త చెంపపై ముద్దు పెట్టింది

ఆయనా బదులు తీర్చేసి 'వెళ్లిరానా ?' అని అడిగేరు ఆమె అనుమతి లేకుండా ఆయన గడప దాటరు. అడుగులిసి అడుగు వేయరు.

'టా ! టా !' చెప్పింది శారద.

మేడదిగి వచ్చి భర్తని కార్లో సాగనంపింది

రాజభవన్ లాటి ఆ యిల్లు యిప్పుడు నిశ్శబ్దమై పోయింది. గార్డెన్ లో దీపాలు వెలుగులు చిమ్ముతున్నాయి నైట్ క్వీన్, గుల్ మొహార్, సెంటు జాజి పరిమళాలు మెలమెల్లగా గాలి వెంట వస్తున్నాయి

ఆమె వెనుదిరగగానే గూర్ఖా గేటు తాళం వేశాడు ఆమె ఒక్కోగది దాటుకుంటూ, లైట్లు ఆర్పేస్తూ, వెళ్లింది మేడపైకి వెళ్లేసరికి వాసు యింకా నిద్రపోలేదు

'నువ్వింకా పడుకోలేదా ?'

'ఊహూఁ'

'ఎందుకు ? నీ ఫ్రెండ్ టాటా చెప్పలేదా ?'

అటు చూశాడు శ్రీనివాస్ ఆ బెడ్ రూంలో చిన్ని టేబుల్ పై ఓ చిన్ని గడియారం వుంది. అది హాంగ్ కాంగ్ లో తెచ్చాడు కేశవులు అది చూట్టానికి మామూలు టైంపీస్ లా వున్నా చాలా ఖరీదైంది గమ్మత్తయింది ఎన్నింటికి సెట్ చేస్తే అది అన్ని సార్లు టాటా చెపుతూ స్వీట్ మ్యూజిక్ సౌండ్స్ తో ఆగిపోతుంది అది ఇప్పుడు ఎనిమిది చూపుతోంది వాసు రోజూ ఎనిమిదింటికే నిద్రపోతాడు

'మరి ?'

'సాయంకాలం నువ్వేం చెప్పావ్ ?' బుంగ మూతితో అడిగాడు

నుదుట ముంగురులు పడతూ వుండగా, కళ్లు గుండ్రంగా తిప్పుతూ అడుగుతోన్న కొడుకుని చూసి ముచ్చటపడింది శారద

'ఏంటమ్మా ? మర్చిపోయావా చెప్పవూ ?'

'ఊఁ ఊఁ నువ్వెప్పుడూ అంతే ! నాకు ఐస్ క్రీం కొనిపెడతాననలేదూ ?' అన్నాడు వాడు

చప్పున గుర్తొచ్చింది ఆమెకి

మధ్యాహ్నం వాసు గేట్లో నుంచున్నాడు రోడ్డుమీద ఎవరో కుర్రాడు 'ఐస్ క్రీం ఐస్ క్రీం' అంటూ కేకేస్తున్నాడు ఆ వీధిలోని కుర్రాళ్లంతా పది, పదిహేనూ, పాతికపైసలిచ్చి కొనితింటున్నారు. అది చూడగానే శ్రీనివాస్ తనకీ ఐస్ క్రీం కావాలని అడిగేడు నాడెప్పుడూ కప్ ఐస్ క్రీం ఇంటి ఫ్రిజ్ లో తయారుచేసింది తప్ప యిలాటి ఐస్ కేక్ లు తిన్లేదు

శారద వాడి కోరికని మృదువుగా తిరస్కరించింది ''వద్దు వాసూ ! అవి బావుండవు !''

'ఊహూఁ ఏంచక్కా ఎంత రుచిగావుంటాయని! రుచిగాలేనిదే రవి, సూరి, కుమార్, శివ, కాంత్, మణి తింటున్నారా ?'

'వద్దు ! అవి తింటే జబ్బులు వస్తాయి ?'

'జబ్బులా ?'

'అవును బాబూ ! మొన్న నీకు పేపర్లో చూపలేదా ! వాటిలో కల్తీ వుంటుంది అయిదు పయిసల ఐస్ క్రీంతో రోగాలు తెచ్చుకుంటామా ?'

'ఊహూఁ నువ్వన్నీ అబద్ధాలు చెబుతున్నావు వీటిలో కల్తీ లేదు !'

'నీకు కప్ ఐస్ క్రీం యిస్తాగా !'

'ఊహూఁ నాకేం వద్దు — కేక్ కావాలి అంతే !'

'అమ్మగారూ !' తల్లీ కొడుకుల మాటలు వింటున్న తోటమాలి పిలిచేడు

'ఏమిటి కాంతయ్యా !'

'మన ఐస్ క్రీం ఫ్యాక్టరీలో నన్ను వెళ్లి తెమ్మంటారా ! ఫ్లాస్కు యిస్తే తెచ్చిపెడతా బాబు పుట్టినరోజు పండుగకదా ! కోర్కె తీర్చండి!'

తలవూపింది శారద ! కాంతయ్య చెప్పిన ఫ్యాక్టరీ కేశవులు ఫ్రెండ్ దే ! అతనే డిజైన్ చేసి లైసెన్స్ తెచ్చి యిచ్చాడు దాని పేరుకూడా 'వాసూ క్రీమ్స్' అంచేతే కాంతయ్య అలా చెప్పాడు

ఆ మాట వినగానే వాసు శాంతించాడు

ఇప్పుడవన్నీ గుర్తొచ్చి నవ్వుకుని వెళ్లి క్రింద హాల్లో పడుకోబోతోన్న కాంతయ్యని అడిగి ఫ్లాస్కు తెచ్చి కేక్ యిచ్చింది రెండు ఐస్ క్రీమ్ కేక్స్ తిని తల్లికి టాటా చెప్పి పడుకున్నాడు శ్రీనివాస్

గుల్ మార్గ్ కల్పిస్తోన్న చల్లదనానికి మరో నిమిషంలో నిద్రపోయాడు

తర్వాత లైట్లన్నీ ఆర్పేసి, బ్లూ బల్బ్ వెలిగించి, కూలర్ ఆన్ చేసి పడుకుంది శారద ఆ మంచం ఐర్లండ్ లో స్పెషల్ గా చేయించాడు పైనున్న ఫోమ్ బెడ్స్ స్టేట్స్ లో తెప్పించాడు కేశవులు

కొడుక్కి బ్లాంకెట్ కప్పి మధురమైన ఊహలు కమ్ముకుంటూ వుండగా నిద్రలోకి జారిపోయింది శారద

* * *

హఠాత్తుగా మెళుకువ అయింది శారదకి

గదంతా ఏదో అపశకున వాతావరణం కమ్ముకున్నట్టుగా వుంది ఏదో చెప్పరాని ఆపద కమ్మేసినట్టుగా వుంది చప్పున కళ్లు తెరిచి చూసింది

ప్రక్కన శ్రీనివాస్ ఆయాసపడుతున్నాడు ఏదో చెప్పరాని బాధతో ఎగిరెగిరిపడుతున్నాడు కాళ్లు చేతులు విపరీతంగా కొట్టుకుంటున్నాడు

వాడిని అలా చూడగానే ఆమెకి గుండె ఆగిపోయినట్టైంది ఒక్క క్షణంలో వాడి వద్దకి వెళ్లి 'వాసూ !' అంటూ పిలిచింది

కానీ వాడు పలకలేదు

ఎంతసేపటినుండి వాడు అలా బాధపడుతున్నాడో కానీ వాడి ముఖంలో బాధ గూడు కట్టేసింది కళ్లు తెరవటంలేదు పెదాలు ఎండిపోయాయి పక్కలు తీవ్రంగా చలిస్తున్నాయి చేతులు కాళ్లు ఆగకుండా కొట్టుకుంటున్నాడు




'వాసూ ! వాసూ ! బాబూ !' గద్గద స్వరంతో పిలిచింది శారద

వాడు పలికే స్థితిలో లేడు

కదిలించినా, పిలిచినా, కళ్ళు తెరవలేదు.

శారదకి భయం వేసింది

లైట్లు వెలిగించి, తలుపు తీసి 'కాంతయ్యా, కనకమ్మా, రావమ్మ, శేషయ్యా !' అంటూ పిలిచింది

ఆమె గొంతులోని ఆదుర్దా సైరన్‌లా పనిచేసి అంతా నిమిషాలపై వచ్చారు, ఏమిటేమిటంటూ శారదకి నోట మాట రాలేదు. వాళ్ళు వాసు స్థితి చూసి గుండె ఆగినట్టై 'అమ్మో ! అమ్మో !' అంటూ గుండె బాదుకున్నారు

'డాక్టరుగారికి ఫోన్ చెయ్యండమ్మా !' అన్నాడు కాంతయ్య

అప్రయత్నంగా ఫోన్ నంబర్ తిప్పింది

'హలో ! నేను కేశవులుగారి భార్యని శారదని ! మా వాడికి సీరియస్‌గా వుంది. అర్జంటుగా డాక్టర్ గారిని రమ్మనండి !'

'సారీ అమ్మగారూ ! డాక్టరుగారు ఊరెళ్ళారు!'

నిస్పృహతో ఫోన్ పెట్టేసి మరో నర్సింగ్ హోంకి ఫోన్ చేసింది ఆయన డి. యం హో గారింటికి 'పార్టీ' కెళ్ళారని తెలిసి అక్కడికి రింగ్ చేసింది ఆయన ఫుల్‌గా తాగి పడుకున్నారనీ, ఏనుగులతో తొక్కించినా లేవరని చెప్పింది ఆయన భార్య

చేసేదిలేక జి హెచ్. కి రింగ్ చేసింది అక్కడ డ్యూటీ డాక్టర్ లేడు కేశవులు గారింట్లోనే డిన్నర్ తీసుకుని వచ్చి గాఢనిద్ర పోతున్నారు. హౌస్ సర్జన్ మాత్రం ఉన్నాడు హాస్పిటల్‌కి తెమ్మని చెప్పాడు.

విధిలేక కార్లో కొడుకుని తీసుకుని బయలు దేరింది శారద ఆమె డ్రైవ్ చేస్తుంటే కాంతయ్య వెనుక సీట్లో తన తొడపై పడుకోబెట్టుకున్నాడు

కారు హాస్పిటల్ చేరేలోగానే వాసు మూడు సార్లు భళ్ళున కక్కుకున్నాడు రెండుసార్లు విరేచనాలు చేసుకున్నాడు. పిడికిళ్ళు బిగించి చేతులు విసురుతున్నాడు కాళ్ళు లాగిలాగి కొడుతున్నాడు

కాంతయ్య చెప్పింది వింటున్న శారద చేతులు

## ఐ స్ క్రీ మ్

హాండిల్‌పై బిగుసుకున్నాయి కాళ్ళు యాక్సిల రేటర్‌ని తొక్కిపట్టాయి

శ్రీనివాసుని హాస్పిటల్లో చేర్పించారు

అప్పటికే పల్స్ తగ్గిపోతున్నాయి. రెస్పిరేషన్ రేటు బాగా తగ్గిపోయి ఎంతో భారంగా గాలి పీల్చు కుంటున్నాడు ఎసిస్టెంటు వెంటనే యాక్సిజన్ పెట్టాడు

అది చూడగానే శారద గుండెలు గుభిల్లు మన్నాయి 'భగవాన్ ! వీడిని కాపాడు నిలువు దోపిడి యిస్తాను !' అని మొక్కుకుంది

క్షణ క్షణానికి వాడి పరిస్థితి క్షీణిస్తోంది

'ఏమైంది డాక్టర్ ?'

'ఏమిటోనమ్మా ! శరీరం అంతా నల్లగా అవుతోంది ఏదో పాయిజన్‌లా వుంది ? ఏం తిన్నాడు ?'

'లిస్ట్' చెప్పింది అన్నీ తనే స్వయంగా చేత్తో తయారుచేసినవి ఆఖర్న ఐస్‌క్రీం కేక్ విషయం చెప్పింది.

'అవి తెప్పించండి !'

క్షణాలపై వచ్చాయి — పరీక్ష చేశారు నిమిషాలపై —

'మేడం ! వీటిలో కల్తీ కలిపేరు — రంగుల్లో కల్తీ — స్వీటులో కల్తీ—మిల్క్‌పౌడర్ చెడిపోయింది వాడేరు ఇదే పాయిజన్‌లా పనిచేసింది బాబుకి ఎలర్జీ అయ్యింది యిది అందుకే వామిటింగ్స్, మోషన్స్ అయ్యాయి అయాం సారీ ! దీనివల్ల బాబుకి పారా పెరాలిసిస్ రావచ్చు ఓ వైపు కాళ్ళూ చేతులు పడిపోవచ్చు మెదడు మొద్దుబారవచ్చు బ్రతికినా పిచ్చి అబ్బాయి కావచ్చు — అదీ ఒకవేళ బ్రతికితే —'

'డాక్టర్—' కెవ్వున కేకేసింది. ''ఎంత మాటన్నారు ? నా బాబు బ్రతకాలి మొద్దబ్బాయి గానో, కుంటివాడుగానో, రోగిష్టిగానో—ఎలాగయినా సరే—బ్రతికించండి ఆయనలేరు ఉంటే విమానాల్లో ఎక్కడికయినా తీసికెళ్ళేవారే— పాండిచెరీకో, ఢిల్లీకో, జస్లోక్ హాస్పిటల్‌కో, అమెరికాకో—న్యూయార్క్‌కో, ఎక్కడికో— డాక్టర్ మాకు అన్యాయం చేయకండి—'

'మీరు అప్‌సెట్ కాకండి ! నే చేయవలసింది చేస్తాను మేడం !' తన పని చేస్తూనే అన్నాడు

'అలా అనకండి ! వాడు బ్రతకాలి ! వెధవ ఐస్‌క్రీంకి వాడు బలికాకూడదు వాడు పోతే మేం ఎందుకు బ్రతకాలి ! డాక్టర్ నే నాయనికి ఏం సమాధానం యివ్వాలి ? కనీసం ఆయనకి ట్రంకాల్ అంది ఆయనొచ్చేదాకా వాడిని బ్రతికించండి !'

డాక్టర్ సమాధానం యివ్వలేదు వాసుని పరీక్షిస్తు యింజక్షన్ యిస్తున్నాడు ఆ సమయానికి విషయం తెలిసి, మత్తు దిగి వచ్చారు డి యం హో, కేశవులు ఫ్యామిలీ డాక్టర్— అంతా వాడి చుట్టూ మూగేరు ఆపరేషన్ థియేటర్లో

బయట ఆంధ్రదేశంలోని దేవుళ్ళ కంతా మొక్కులు మొక్కుకుంటూ కూర్చుంది శారద ఆమె ఏడవటం లేదు ఆమె ముఖంలో కళలేదు కాంతిలేదు

లైట్నింగ్ ట్రంక్‌కాల్ బొంబే చేరేసరికి ఎయిర్ పోర్ట్‌లో దిగుతున్నాడు కేశవులు కాల్ రిసీవ్ చేసు కొని వెంటనే మరో ఫ్లయిట్‌లో బయలుదేరాడు వెనుక ఫ్లయిట్‌లో జస్లోక్ ఛీఫ్‌ని రమ్మని ఫోన్‌లో చెప్పాడు కేశవులు

అప్పటికి తెల్లగా తెల్లారిపోయింది

అంతమంది డాక్టర్లు శ్రమపడినా, శాయశక్తులా కృషి చేసినా వాడి ప్రాణానికి తమ ప్రాణం అడ్డు వేయటానికి యత్నించినా చిన్నారి శ్రీనివాస్ చిరుప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి

బయట కూచున్న శారదకి ఆ వార్త చెప్పే ధైర్యం ఎవరికీ లేకపోయింది కానీ ఎవరూ చెప్పనవసరం లేకుండానే డాక్టర్ల ముఖం చూడగానే విషయం అర్థం చేసుకున్న శారద కొడుకొస్సం 'బాబు !' అంటూ పిలుస్తూ పరుగెత్తబోయి స్మృతి తప్పి అలాగే కుప్పలా కూలిపోయింది

తూర్పు ఎర్రగా తెల్లవారుతోంది కల్తీ ఐస్‌క్రీం తిన్నట్టుగా అయిపోయింది తూర్పుదిక్కు నిష్ప్రయోజనమైన డాక్టర్ల శ్రమలాగా చీకట్లు విడిపోతున్నాయి బలహీనమైన వెలుగు బయటికి రావటానికి యత్నిస్తోంది

స్మృతి తప్పిపోయిన శారదకి అరస్మృతిలో ఐస్‌క్రీం కేకులు ఒకటి వెంట ఒకటిగా రెట్టింపై కమ్ముకుంటున్నట్టుగా కనిపిస్తున్నాయి ★

# The stove that not only glows but glitters




STAINLESS STEEL

# chetak

## Gas Stove

IS : 4246




**Highlights :**

- Perfectly Engineered.
- Swiss Technology Control Valve for Prevention of Gas leakage.
- Plated Burner Tops · Rust free.
- Better fuel efficiency
- Economically Priced.

**DISTRIBUTORS FOR ANDHRA PRADESH**
MADICON INDO-INTERNATIONAL
1-10-197/4, First Floor, Ashok Nagar X Roads,
Hyderabad - 500 020. A.P. INDIA
Phone : 61286, 64757 Grams : MADICON

**PRODUCT OF**
**JAINCO INDUSTRY**
NEW DELHI

MAYURA

ప్రసిద్ధి చెందిన హిందుస్థాన్ పెట్రోలియం, భారత పెట్రోలియం
మరియు ఇండియన్ గ్యాస్ డీలర్లవద్ద కూడ లభించును.

# జీవన్మృతులు

**ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్**

**స్వేచ్ఛానువాదం: కొలను వేంకట దుర్గాప్రసాద్**



**డాక్టర్ సెవార్డు డైరీ :**

సెప్టెంబర్, 19 రాత్రి అంతా లూసీ కలతనిద్ర పోయింది ఎప్పుడూ నిద్ర పోవడానికి భయపడుతుండేది మెలకువొచ్చినప్పుడల్లా చాలా బలహీనంగా కనపడుతుండేది ప్రొఫెసర్ నేనూ వంతులవారీ ఆమెను కనిపెడుతూ కూర్చున్నాం ఒక్క క్షణం కూడా ఆమెను వదిలి వుండలేదు క్విన్సీ మోరిస్ మాత్రం ఇంటి చుట్టూ చాలాసార్లు తిరిగాడని తెలుసు, అతను ఎందుకలా చేసాడో తెలీదుగాని

పగటి వెలుగులో లూసీ కళలేని మొహం స్పష్టంగా కనపడింది ఆమె చాలా బలహీనంగా వుంది తల కూడా కదపలేక పోయింది ఏదో కాస్త బలం కోసం ఆమె తీసుకున్న ఆహారంవల్ల ఏమీ వుపయోగం కనపడలేదు ఒక్కోసారి నిద్రపోయేది వాన్ హెల్సింగ్, నేనూ ఆమె నిద్రపోయినప్పుడూ, మేలుకున్నప్పుడూ గల తేడాను గమనించాం ఆమె నిద్రలో వున్నప్పుడు, శక్తి పుంజుకున్నట్టుగా కనపడుతుండేది వూపిరి తీయడం మామూలుగా వుండేది మేలుకున్నప్పుడు ఆమె కళ్లల్లో ఏదో భయం గోచరించేది చనిపోతున్నదానిలా వుండేది

మధ్యాహ్న సమయంలో ఆర్థర్ గురించి అడిగింది వెంటనే అతనికి టెలిగ్రాం ఇచ్చాం క్విన్సీ మోరిస్ అతన్ని కలవడానికి స్టేషన్‌కి వెళ్లాడు

అతను వచ్చేటప్పటికి సాయంత్రం ఆరు కావస్తోంది సూర్యాస్తమయం కాబోతోంది అరుణ కాంతులు కిటికీగుండా లూసీమీద పడి, పాలిపోయిన ఆమె చెంపలకు రంగులు అద్దుతున్నాయి ఆర్థర్ ఆమెను చూసి ఉద్వేగం చెందాడు ఎవరూ ఏమీ మాట్లాడలేదు ఆమె మగతలోనూ, నిద్రలోనూ కొన్ని గంటలు గడిపింది అందువల్ల ఆమెతో అతను ఎక్కువగా మాట్లాడటానికి వీలులేకపోయింది ఆర్థర్ దగ్గర వుండడంవల్ల ఆమెలో బలం వచ్చినట్టు అనిపించింది కొద్దిగా కదిలింది అతనితో కాస్త మాట్లాడగలిగింది అతను కూడా

**(గత సంచిక తరువాయి)**

బాధను మరచిపోయి, ఆమెతో నవ్వుతూ మాట్లాడటానికి ప్రయత్నించాడు

ఇప్పుడు ఒంటిగంట అయింది వాన్ హెల్సింగ్, అతను, ఆమె దగ్గర కూర్చున్నారు ఓ పావుగంటలో వాళ్లకి విడుదల కలిగించి నేను కూర్చోవాలి తెల్లారి ఆరుగంటల వరకు వాళ్ళు విశ్రాంతి తీసుకుంటారు ఇట్లా ఆమెను కనిపెడుతూ కూర్చునే పని రేపు అయిపోతుందేమోనన్న భయం వేస్తోంది ఎందుకంటే ఆమె మరీ కదలలేని స్థితిలో వుంది మమ్మల్నందర్నీ దేవుడే రక్షించాలి

**మినా హార్కర్ లూసి వెస్టెన్‌రాకు రాసిన ఉత్తరం**

**(ఈ ఉత్తరం ఆమె తెరిచి చూడలేదు)**

సెప్టెంబర్, 17

నా ప్రియాతిప్రియమైన లూసీ,

నీ దగ్గర్నించి సంగతులు విని ఒక యుగం అయినట్టుగా వుంది నేను నీకు రాసి కూడా ఒక యుగం అయింది అయినా నువ్వు క్షమిస్తావని నాకు తెలుసు నా భర్త మామూలు మనిషి అయ్యారు మేం ఎగ్జిటర్ చేరుకునేటప్పటికి, గుర్రపు బగ్గీ ఒకటి మా కోసం ఎదురుచూస్తోంది అందులో మిస్టర్ హాకిన్స్ కూర్చునివున్నారు అతనికి వాతపు రోగం తగిలింది అతను మమ్మల్ని వాళ్ల ఇంటికి తీసుకెళ్లారు అక్కడ మా కోసం వేరే గదులు ఏర్పాటు చేసారు మేం కలిసి భోజనం చేసాం భోజనం ముగించాక, మిస్టర్ హాకిన్స్ చెప్పారు

"మీ ఇద్దరూ ఆరోగ్యంతో శ్రేయస్సుగా వుండాలని భగవంతుణ్ని కోరుకుంటున్నాను మిమ్మల్నిద్దర్నీ చిన్నప్పట్నుండి ఎరుగుదును మీ ప్రేమ పురాగాలు ఎరుగుదును మీ ఇద్దరు ఈ ఇంట్లోనే నాతోనే వుండాలని కోరుకుంటున్నాను నాకు పిల్లాపాపా లేరు అందరూ వెళ్లిపోయారు నాకున్నదంతా మీ పేర విల్లు రాసాను" నేను సంతోషంతో ఏడిచాను జోనాథన్, మిస్టర్ హాకిన్స్ చప్పట్లు కొట్టారు ఆ రోజు సాయంత్రం ఎంత సంతోషంగా గడిచిందో!

ఇద్దరం ఈ ఇంట్లో వుండిపోయాం నా పడకగదిలోంచి, డ్రాయింగ్‌రూములోంచి తవిసి చెట్లగుండా చర్చి ఎంతో దగ్గరగా కనపడుతోంది ఆ చెట్లమీద కాకిగుంపులు, వాటి అరుపులు పగలల్లా వినపడుతూనే వుంటాయి నేనెంత తీరికలేని మనిషి నయ్యానో నీకు చెప్పనక్కర్లేదు ఇల్లు సర్దుకోవడంతోనే సరిపోతోంది జోనాథన్, మిస్టర్ హాకిన్స్‌తో భాగస్వామి అయ్యాడు మిస్టర్ హాకిన్స్ తన క్లయింట్ల గురించి జోనాథన్‌కు చెపుతూవుంటాడు

"మీ అమ్మకు ఎట్లావుంది? పరుగెత్తుకొచ్చి ఒకటి రెండ్రోజులు నీతో గడపాలనిపిస్తోంది, కానీ అంత ధైర్యం చేయలేకపోతున్నాను, ఈ ఇంటిబాధ్యతలవల్ల ఇంకా నేను జోనాథన్‌ని కనిపెట్టుకునే వుండాల్సి వస్తోంది ఇప్పుడిప్పుడే కాస్త ఒళ్లు చేస్తున్నాడు కానీ చాలాకాలం జబ్బుతో వుండడం వల్ల బాగా బలహీనమయ్యాడు ఇప్పటికికూడా నిద్రలో అప్పుడప్పుడూ లేచి వణికిపోతూ వుంటాడు నేను ఎంతో ధైర్యంచెప్పి, మామూలు స్థితికి తీసుకువస్తుంటాను ఏమైనా దేవుని దయవల్ల ఇటువంటి సంఘటనలు రోజులు గడుస్తున్నకొద్దీ తక్కువవుతున్నాయి సరే, ఇప్పటివరకూ నా గురించే చెప్పాను నీ గురించి సంగతులు చెప్పు నీ పెళ్ళెప్పుడు? ఎక్కడ? ఎవరు చేస్తున్నారు? ఏం బట్టలు వేసుకోబోతున్నావు? పెళ్లి అట్టహాసంగా జరగబోతోందా, లేక నిరాడంబరంగానా? చెప్పు, నీ గురించి అన్నీ నాకు చెప్పాలి? జోనాథన్ నిన్ను అడిగినట్టు చెప్పమన్నాడు గుడ్‌బై, నా ప్రియమైన లూసీ

దేవుని ఆశీర్వచనాలు

నీ

మినా హార్కర్

పాట్రిక్ హెన్నెస్సీ, ఎం డి, ఎం ఆర్ సి ఎస్ ఎల్ కె క్యూ సి పి ఐ జాన్ సెవార్డ్ ఎం డి కి పంపిన రిపోర్టు

సెప్టెంబర్ 20

మై డియర్ సర్,

మీరు కోరిన దాని ప్రకారం, నాకు ఒప్పజెప్పిన విషయాల గురించి రిపోర్టు ఇస్తున్నాను రెన్‌ఫీల్డు పేషంటు గురించి చెప్పాల్సింది చాలా వుంది అతను మళ్లీ తిరగబడ్డాడు పెద్ద గొడవ జరిగిపోయి

**జరిగిన కథ—16 :** లూసీ ఆరోగ్యం గురించి జాన్ సెవార్డు ఆర్థర్ హాల్మ్‌వుడ్‌కి తెలియజేస్తుంటాడు లూసీ పరిస్థితి దయనీయంగా వుంది ఆమె వంట్లో రక్తం చాలా తక్కువగా వుంది అందువల్ల ఆమెకు రక్తం ఎక్కించటానికి ప్రయత్నాలు చేస్తుంటాడు ప్రొఫెసర్ వాన్ హెల్సింగ్ డాక్టర్ సెవార్డు లూసీకి తన వంట్లోని రక్తం ఇస్తాడు ఆమె పరిస్థితి ఇప్పుడు కొంచెం మెరుగ్గా వుంటుంది పారిపోయిన తోడేలు కధనం గురించి జులాజికల్ గార్డెన్స్ రక్షకుడిని "ది పాల్‌మాల్ గెజిట్" పత్రికా విలేఖరి ఇంటర్వ్యూ చేస్తుంటాడు పారిపోయిన తోడేలు దానంతటదే వచ్చేస్తుంది లూసీ పరిస్థితి ఎప్పటిలానే వుంటుంది

వుండాల్సిందిగాని, అదృష్టవశాత్తూ, దారుణమైనది ఏమీజరగలేదు ఇవాళమధ్యాహ్నం, ఒక సామానుబండి తాలుకు మనుషులిద్దరు మన భవనం పక్కన ఖాళీగా వున్న ఇంట్లో వాళ్లని పిల్చారు మన పేషంటు రెండుసార్లు ఆ ఇంటికి పారిపోయాడు మన గేటు దగ్గర మనిషి ఆ బండి వాళ్లను ఆపి ఎవరు మీరు అని అడిగాడు నేను అప్పుడే భోజనం ముగించి, సిగిరెట్ తాగుతూ, నా స్టడీ రూం కిటికీలోంచి బయటకు చూస్తున్నాను ఇద్దరిలో ఒకడు, ఆ పక్కఇంటివైపు వస్తున్నాడు అతను రెన్ ఫీల్డు గది కిటికీ దాటి వెళుతుండగా, మన పేషంటు గది లోపల వుండే అతన్ని ఇష్టమొచ్చిన పేర్లు పెట్టి పిలవ సాగాడు పాపం అతను చూస్తే కాస్త మర్యాదస్తుడిలా వున్నాడు మన పేషంటును నోరు మూసుకో అని మాత్రం అన్నాడు దాంతో మన పేషంటు అతన్ని తంతాను, పొడుస్తాను, ఈడుస్తాను అని లిట్టడం సాగించాడు అప్పుడు నేను కిటికీతీసి బయట మనిషికి రెన్‌ఫీల్డుని పట్టించుకోవద్దని సైగ చేసాను దాంతో అతను తృప్తిపడి, వీళ్లంతా పిచ్చివాళ్ళులే అని సరిపెట్టుకున్నాడు 'దేవుడు మిమ్మల్ని కాపాడుతాడు సర్! ఇతను పిచ్చిలో తిట్టిందానికి నేను పట్టించుకోను మిమ్మల్ని చూస్తుంటే జాలివేస్తోంది, ఇట్లాంటి పిచ్చిజంతువులమధ్య మీరు జీవనంసాగిస్తున్నందుకు'' అన్నాడు నన్ను వుద్దేశించి పక్క ఇంటికి ఎట్లా వెళ్లాలి అని ఎంతో మర్యాదగా అడిగాడు నేను దాని గేటు ఎక్కడుందో చెప్పాను అతను వెళ్లిపోయాడు మన పేషంటు అతన్ని భయపెడుతూ, తిడుతూ, నానా దుర్భాషలాడుతూనే వున్నాడు ఆసలు రెన్‌ఫీల్డుకు అంత కోపం రావడానికి కారణం ఏమయివుంటుందో కనుక్కోడానికి క్రిందికి వెళ్లాను ఎందుకంటే, రెన్‌ఫీల్డుకు మూర్ఛ వచ్చేటప్పుడు తప్ప, మిగతా సమయాల్లో సౌమ్యంగానే నడుచుకుంటాడు. నేను క్రిందికి వెళ్ళి చూస్తే అతనెంతో నెమ్మదిగా ప్రవర్తించేసరికి ఆశ్చర్యపోయాను ఇందాక జరిగిన సంఘటన గురించి అతన్ని మాటల్లో దింపటానికి ప్రయత్నించాను కానీ, అతను ఎంతో సౌమ్యంగా ఏం జరిగిందిప్పుడు, ఏవిటో నాకు తెలియదే, అని ఏమీ గుర్తులేనివాడిలా చెప్పాడు ఇంకో సంఘటనవల్ల అతనివన్నీ దొంగవేషాలు అని చెప్పాల్సివస్తోంది అది జరిగిన అరగంటకు ఈ సంఘటన జరిగింది ఈసారి అతను గది కిటికీ అద్దాలు పగలగొట్టి అందులోంచి దూకి పారిపోసాగాడు నేను అతని వెంటబడ్డాను, మిగిలిన పనివాళ్లను నాతోపాటు రమ్మని చెపుతూ అతను ఏదో దారుణం చేస్తాడని భయం వేసింది నేను అనుకున్నంతా అయింది ఇంతకిముందు ఇటువేపు నుంచి వెళ్లిన సామానుబండి మళ్ళీ రోడ్డువైపుకు వస్తోంది ఆ బండిమీద పెద్ద చెక్కపెట్టెలున్నాయి ఆ బండివాళ్ళు ఇద్దరూ నుదురు తుడుచుకుంటూ వుండగా, మన పేషంటు వెళ్ళి మొహంమీద తన్నాడు బలంగా నేను అతని దగ్గరికి వెళ్లేలోపే, రెన్‌ఫీల్డు వాళ్లమీద పడ్డాడు ఒకడ్ని పట్టుకుని బండిలోంచి లాగి, తలను నేలకేసి కొట్టసాగాడు నేను ఒక్క క్షణం అతడ్ని పట్టుకోవటంలో ఆలస్యం చేసివుంటే, రెన్‌ఫీల్డు ఆ బండివాడ్ని అక్కడికక్కడ చంపేసేవాడు రెండో అతను బండిలోంచి దూకి కొరడా పిడితో రెన్‌ఫీల్డు తలమీద మోదాడు అది చాలా పెద్ద దెబ్బ అయినా రెన్‌ఫీల్డు దాన్ని పట్టించుకున్నట్టు కనపడలేదు ఆ రెండోవాడ్ని కూడా పట్టుకున్నాడు మేం విడిపించబోతే, మమ్మల్ని అటూ ఇటూ పిల్లిపిల్లల్లా లాగిపారేసాడు మీకు తెలుసు, నేనేం తక్కువ బరువుమనిషినికాదు మిగతా వాళ్ళు కూడా బలంగా వున్నవాళ్లే మొదట అతను అరవకుండా మాతో కుస్తీ పడుతూనే వున్నాడుగానీ, అతన్ని మా స్వాధీనంలోకి తెచ్చుకుని, అతనికి వేస్టుకోటు తొడిగాం అప్పుడతను ''వాళ్ల అంతు చూస్తాను వాళ్ళు నన్ను దోచుకుంటారా? అడుగడుగునా నన్ను హత్య చేస్తారా? నా ప్రభువు కోసం, నా మాస్టర్ కోసం, వీళ్లతో దెబ్బలాడతాను'' అని అరిచాడు అట్లాగే ఏవిటో పిచ్చిగా అరిచాడు చాలాసేపు పనివాళ్ళు రెన్‌ఫీల్డుని తీసుకెళ్ళి మళ్ళీ అతన్ని చిన్న గదిలో బంధించడానికి యాతనపడ్డారు హార్డీ అనే పనిమనిషి ఒకడు ఈ గొడవలో వేలు విరగ్గొట్టుకున్నాడు అయినా నేను దాన్ని సరిచేసేసాను ఇప్పుడు బాగానే వున్నాడు

ఆ బండివాళ్లిద్దరు మొదట చాలా బెదిరించారు నష్టపరిహారం చెల్లించాలనీ, న్యాయప్రకారం డబ్బు రాబట్టుకుంటామని వాళ్ళిద్దర్నీ ఎట్లాగో నచ్చజెప్పి, పిచ్చివాడ్ని పట్టించుకోవద్దని చెప్పాం బండిమీద ఆ పెద్ద పెట్టెల్ని మోసుకురావటంవల్ల బాగా అలిసిపోయివున్నాం, లేకపోతే, వాడి అంతు చూసేవాళ్లం అన్నారు ఒకపక్క దాహం వేయడంవల్ల, ఎంతో దూరంనుంచి రావటంవల్ల అతని చేతిలో



ఓడిపోయాం అన్నారు వాళ్ల అవస్థ అర్థం చేసుకుని, గ్లాసునిండా "మందు" పోసి, చెరొక సావరిన్ నాణెం వాళ్ల చేతిలో పెట్టి శాంతపరచాను. నేను వాళ్ల పేర్లు, చిరునామాలు రాసిపెట్టుకున్నాను, ఎప్పుడైనా అవసరమవుతాయేమోనని వాళ్ల చిరునామాలు ఇవి జాక్ స్మోలెట్, డడ్డింగ్స్ రెంట్స్, కింగ్ జార్జిస్ రోడ్, గ్రేట్ వాల్వర్త్, రెండోవాడు థామస్ స్నెల్లింగ్, పీటర్ ఫార్లీస్ రో, గైడ్ కోర్టు, బెత్నాల్ గ్రీన్ వాళ్లిద్దరూ హారీస్ అండ్ సన్స్ కంపెనీలో ఉద్యోగస్థులు అది షిప్మెంటు కంపెనీ ఆరెంజ్ మాస్టర్స్ యార్డు, సోహోలో వుంది

ఇంకా కుతూహలమైన విషయాలు ఏమైనా వుంటే మీకు తప్పకుండా రిపోర్ట్ చేస్తాను మరీ ముఖ్యమైన విషయం అనిపిస్తే, వైర్ చేస్తాను

తమ విధేయుడు,
పాట్రిక్ హెన్నెస్సీ

## మినా హార్కర్ లూసీ వెస్టెన్రాకు రాసిన ఉత్తరం

(ఈ ఉత్తరంకూడా ఆమె తెరిచి చూడలేదు)

సెప్టెంబర్, 18

నా ప్రియమైన లూసీ,

మాకో పెద్ద దెబ్బ తగిలింది. మిస్టర్ హాకిన్స్ హఠాత్తుగా చనిపోయారు ఇది మాకు అంత విషాదం కలిగించే విషయం కాదనుకుంటారు కొంత మంది కానీ మేం ఇద్దరం ఆయనకు ఎంత దగ్గరయ్యామంటే, స్వంత తండ్రి పోయినట్టుగా బాధపడ్డాం నాకు తల్లిగానీ తండ్రిగానీ తెలియదు అందువల్లనే, తండ్రిలాంటి అతని మరణం నాకు పెద్ద దెబ్బ కొట్టింది. జోనాథన్ బాగా కృంగిపోయాడు తనని ఎంతో మంచి స్నేహితునిగానేకాక, చివరి దశలో కన్న కొడుకుగా చూసి, ఎప్పుడూ కలలోనైనా ఎరుగని సంపదనిచ్చి అతను వెళ్లిపోయినందుకు జోనాథన్ ఎంతో బాధ పడుతున్నాడు అదొక్కటే కాదు తన భుజస్కంధాలపైన ఆయ మంచివెళ్లిన బాధ్యతలు మరింత కృంగదీస్తున్నాయని అనుకుంటున్నాడు అతని సామర్థ్యంమీద అతనికి సందేహం మొదలయింది అతన్ని సంతోషపెట్టడానికి ప్రయత్నిస్తున్నాను అతనిలోని పిరికితనాన్ని పోగొట్టి అతనిమీద అతనికి నమ్మకాన్ని కలుగజేయడానికి కృషి చేస్తున్నాను ఏమైనా అతను కోలుకోలేకపోతున్నాడు ఒక స్నేహితునిగా భావించి, ఆయన ఒక చిన్న గుమాస్తాను కొద్ది సంవత్సరాలలో ఒక పెద్ద యజమానిగా తయారుచేసి వెళ్లిపోయారు అటువంటి ఆయనయొక్క అండ కోల్పోతే, జోనాథన్ ఎట్లా కోలుకోగలడు? క్షమించు లూసీ నా బాధలు వెళ్లబోసుకుంటూ నిన్ను బాధ పెడుతున్నాను బాధలో కృంగిపోతున్న జోనాథన్ హృదయంలో సంతోషాన్ని నింపటానికీ, నేనెంత ధైర్యంగా నిలబడి నవ్వుమొహంతో అతనికి కనిపించడానికి ప్రయత్నిస్తున్నానో, అదెంత అవస్థతో కూడిందో నేను ఎవరికో ఒకరికి చెప్పాలి. నేను చెప్పుకోటానికి నమ్మకమైన వాళ్ళు ఎవరూ లేరిక్కడ మిస్టర్ హాకిన్స్ తనని తనతండ్రి సమాధి



ప్రక్కనే సమాధి చెయ్యాలని తన విల్లులో కోరారు. అందువల్ల మేం లండన్ రావాలి రావటానికి చాలా భయంగా వుంది జోనాథన్ శవపేటిక వెంట మొదటివానిగా వెళతాడు, ఎందుకంటే ఆయనకు బంధువులెవరూ లేరుగనుక కొద్ది నిముషాలైనాసరే, నిన్ను ఒకసారి చూడటానికి ప్రయత్నిస్తాను ఈ ఉత్తరంలో నిన్ను బాధపెట్టాను, క్షమించు

ఆశీర్వచనాలతో,
మినాహార్కర్

## డాక్టర్ సెవార్డు డైరీ

సెప్టెంబర్, 20 · నా మనసు ఏమీ బాగోలేదు ఏమాత్రం ఉత్సాహంగా లేదు ఈ ప్రపంచం అంటే విరక్తి కలుగుతోంది అసలు జీవితం అంటేనే రోతపుడుతోంది ఇప్పటికిప్పుడు యమదూతలు వచ్చి నా కోసం తలుపు తట్టినా నేను సిద్ధంగావున్నాను యమదూతలు వస్తూనేవున్నారు—లూసీ తల్లికోసం, ఆర్థర్ తండ్రికోసం, ఇప్పుడు మరి నేను పనిలో మునిగిపోవాలి

లూసీని కనిపెట్టుకుని కూర్చున్న వాన్హెల్సింగ్కి విశ్రాంతి నిచ్చాను. ఆర్థర్ని కూడా విశ్రాంతి తీసుకోమని చెప్పాం కానీ మొదట అతను ఒప్పుకోలేదు పగలు అతని అవసరం వుంటుందని, అందరూ నిద్రకాస్తే దెబ్బతినిపోతామనీ, లూసీని కనిపెట్టుకుని వుండటానికి ఎవరూ దొరకరనీ చెప్పాక అతను ఒప్పుకుని వెళ్లాడు వాన్హెల్సింగ్ అతనిమీద ఎంతో దయ చూపాడు "నా బిడ్డలాంటివాడివి, రా! నాతో రా! నీకు ఒంట్లో బాగోలేదు బలహీనంగా వున్నావు ఎంతో దుఃఖంలో వున్నావు మానసికంగా బాధనొందావు నువ్వు ఒంటరిగా వుండవద్దు అలావుంటే, ఏదో భయాలు కలుగుతాయి తర్వాత ప్రమాదంలో పడిపోతావు. డ్రాయింగ్రూం కెళదాం. అక్కడ చలికాచుకునే పొయ్యివుంది రెండు సోఫాలున్నాయి నువ్వొక దానిమీద, నేనొక దానిమీద పడుకుందాం ఒకళ్ళకొకళ్ళు ఓదార్పు చెప్పుకుందాం మౌనంగానే అట్లాగే నిద్రపోదాం" అన్నాడు

ఆర్థర్ వాన్హెల్సింగ్తో వెళ్లిపోయాడు, ఒకసారి వెనక్కి తిరిగి లూసీవంక కన్నార్పకుండా చూసి లూసీ కదలకుండా పడుకుని వుంది గది అంతా కలయచూసాను, అన్ని ఏర్పాట్లు సరిగా వున్నాయా లేవా పరీక్షిస్తూ ఈ గదిలోకూడా వాన్హెల్సింగ్ వెల్లుల్లిపాయలను బాగా ఉపయోగించాడు కిటికీ చట్రాలకు వెల్లుల్లిపాయలు బాగా రుద్దాడు లూసీ మెడచుట్టూ సిల్కు జేబురుమాలు కట్టి,దానిమీద వెల్లుల్లిపాయల దండచుట్టాడు లూసీ వూపిరి తీయటం ఒక గురకలా వుంది ఆమె మొహం ఎంతో కళా విహీనంగా వుంది తెరచిన ఆమె నోటిలో తెల్లబడిన చిగుళ్లు కనిపిస్తున్నాయి గదిలోని మసక వెలుతురులో ఆమె పళ్లు పొడుగ్గా, పదునుగా కనిపించాయి కాస్త వెలుగు ఎక్కువయినప్పుడు, పెదాల దగ్గర చివరి పళ్లు, మిగతా వాటికన్నా, పొడుగ్గా, పదునుగా, అంటే కోరలుగా కనిపించాయి ఆమె ప్రక్కనే కూర్చున్నాను అప్పుడు ఆమె ఇబ్బందిగా కదిలింది ఆదే సమయంలో కిటికీ తలుపుల్ని రెక్కలతో టప టప కొట్టిన చప్పుడు మెల్లగా వినిపించింది నేను మెల్లగా లేచి, చప్పుడు చేయకుండా కిటికీ దగ్గరకు వెళ్లి దాని తెర చాటున నిలబడ్డాను బయట చక్కని వెన్నెల ఆ వెలుగులో ఒక పెద్ద గబ్బిలం కనపడింది అది అక్కడక్కడే తిరుగుతూ, అప్పుడప్పుడూ కిటికీ రెక్కల్ని తన రెక్కలతో టప టపమని కొడుతూ శబ్దంచేస్తోంది మళ్లీ నేను వచ్చి నా చోటులో కూర్చునేసరికి లూసీ కొద్దిగా కదిలినట్లు కనిపించింది ఆమె మెడలోని వెల్లుల్లిపాయలదండ తెగి పడిపోయివుంది నేను దానిని సరిచేసి మళ్లా ఆమె మెడలో వుంచి, ఆమెను కనిపెడుతూ కూర్చుండిపోయాను

ఆమె నిద్రలేచింది వాన్హెల్సింగ్ చెప్పినట్లుగా ఆమెకు ఆహారం ఇచ్చాను. కొద్దిగా ఎంగిలి చేసింది ఆమె కాస్త స్పృహలో వున్నట్లు గోచరించింది వుక్కిరి బిక్కిరి అవుతూ, ప్రాణంకోసం పోరాడే ఛాయలు కనిపించలేదు ఆమె స్పృహలో వుండగా, తన మెడలోని వెల్లుల్లిపాయల దండను, గట్టిగా పట్టుకొని వుండటం గమనించాను ఆమె మగతలో వుండి, గురకలాంటి శబ్దంతో వూపిరి తీస్తున్నప్పుడు మాత్రం, ఆమె వెల్లుల్లిపాయల దండను వదిలేస్తోంది మళ్లా స్పృహలోకి రాగానే దండను గట్టిగా పట్టుకొంటోంది నేను గమనించిన ఈ విషయంలో నాకు ఎటువంటి భ్రమా లేదు నేను గమనించిన కొద్దిగంటల్లో ఆమె ఎన్నోసార్లు మగతలో వుండటం స్పృహలోకి రావటం చేసింది ఆ సమయాల్లో దండను వదిలి వేయడం, మళ్లా దండను పట్టుకోవటం చేసింగి

ఆరుగంటలకు వాన్హెల్సింగ్ నాకు విడుపు నివ్వటానికి వచ్చాడు ఆర్థర్ ఇంకా నిద్రలోనే వున్నాడు వాన్హెల్సింగ్ అతన్ని బలవంతపెట్టి లేపదల్చుకోలేదు అందుకని అతన్ని వదిలేశాడు లూసీ మొహం చూసి వాన్హెల్సింగ్ గాఢంగా లోపలికి గాలి పీల్చడం విన్నాను అతను నా చెవిలో 'కిటికీతెరలు పైకెత్తు కాస్త వెలుతురు కావాలి' అన్నాడు అతను వంగి దాదాపు లూసీ మొహంలో తన మొహం పెట్టి పరీక్షగా చూసాడు ఆమె మెడలోని వెల్లుల్లి దండ తీసేసి, మెడకు చుట్టివున్న సిల్కు రుమాలును తీసేసాడు మెల్లగా తన తలను వెనక్కి తీసుకుంటూ "తెల్సింది!" అన్నాడు. నేను కూడా లుసీమీదకు వంగి చూసాను నాకు ఒళ్ళు జలదరించింది

ఆమె గొంతుకింద వుండవలసిన గాట్లు లేవు. పూర్తిగా మాయమయిపోయాయి

వాన్ హెల్సింగ్ ఒక అయిదు నిముషాలపాటు ఆమె మొహంలోకి నిశితంగా చూసాడు అప్పుడు నావంక తిరిగి నెమ్మదిగా అన్నాడు "ఆమె చనిపోతున్నది ఎక్కువసేపు పట్టకపోవచ్చు ఆమె స్పృహలో వుండి చనిపోతోందా, నిద్రలో వుండి చనిపోతోందా అన్న విషయంలో చాలా తేడా వుంది చూద్దాం! పాపం ముందు అతన్ని నిద్రలేపి తీసుకురా ఆమె చివరి క్షణాలను చూస్తాడు అతను మనల్ని నమ్ముకున్నాడు"

నేను భోజనాల గదిలోకి వెళ్ళాను అక్కడున్న ఆర్థర్ని నిద్రలేపాను. అతను బద్ధకంగాలేచాడు గదిలో

ుదుతున్న సూర్యకాంతిచూసి, తను ఆలస్యంగా నిద్ర లేచినట్టు గమనించాడు అతని మొహంలో ఆందోళన కనపడింది లూసీ ఇంకా నిద్రపోతోందని చెప్పాను వాన్ హెల్సింగ్, నేనూ కూడా, ఆమె చివరి క్షణాల్లో వుందని భయపడుతున్నట్టు చెప్పాను మోచేతులు మోకాళ్లమీద ఆనించి, చేతుల్లో మోహం దాచుకుని ఒక నిముషం వరకు సోఫాలో కూర్చుండిపోయాడు. అతను మెల్లగా రోదిస్తున్నాడు నేను అతనిమీద చేతులువేసి లేవనెత్తాను ''పద! కాస్త ధైర్యం తెచ్చుకో' అన్నాను

మేమిద్దరం గదిలోకి వచ్చేటప్పటికి వాన్ హెల్సింగ్ ఆమె అందంగా కనిపించేటట్టు చేసాడు చెదరిన ఆమె ముంగురులను సర్దాడు ఇద్దరం గదిలోకి వెళ్లగానే లూసీ కళ్ళు తెరచి ఆర్థర్ వంక చూసి మెల్లగా అంది ''ఆర్థర్! నా ప్రియతమా! నువ్వు వచ్చినందుకు నాకు చాలా సంతోషంగావుంది'' ఆమె మాటలకు ఆర్థర్ వంగి ఆమెను ముద్దు పెట్టుకోబోయాడు వెంటనే వాన్ హెల్సింగ్ అతన్ని వెనక్కి లాగాడు ''వద్దు! అప్పుడేకాదు ఆమె చెయ్యి పట్టుకో కాస్త వూరటచెందుతుంది'' లన్నాడు

ఆర్థర్ ఆమె చెయ్యి పట్టుకుని మోకాళ్లమీద వంగి కూర్చున్నాడు లూసీ లతన్ని చూసింది ఆమె కళ్లు అందంగావున్నాయి క్రమక్రమంగా ఆమె కళ్లు మూసుకుపోసాగాయి ఆమె నిద్రలోకి ఒరిగిపోయింది ఆమె రొమ్ములు కొద్దిగా ఎగిసి పడ్డాయి అలసి పోయిన పాపాయిలావుంది ఆమె వూపిరితీసి వదలటం

ఆ సమయంలో ఆమెలో ఒక వింత మార్పు కలిగినట్లు గమనించాను ఆమె వూపిరితీసి వదలటం గురకలా మార్పు చెం దిం ది ఆమె పెదాలు తెరిచింది పళ్లు చిగుళ్లు కుంచించుకుపోయాయి అందువల్ల పళ్లు పొడుగ్గా పదునుగా కనిపించాయి నిద్రలో లేచినట్టుగా స్పృహలో లేనట్టుగానే ఆమె కళ్లు తెరచింది ఆమె కళ్లల్లో కాంతి లేదు తీక్షణంగా వున్నాయి ఆమె ఎంతో సున్నితంగా, నేనెప్పుడూ ఆమె నోటివెంట విననట్టి కాముకమైన స్వరంతో అంది ''ఆర్థర్! నా ప్రియతమా! నువ్వు వచ్చినందుకు నాకు చాలా సంతోషంగావుంది నన్ను ముద్దెట్టుకో''

ఆర్థర్ ఆత్రంగా ముద్దు పెట్టుకోటానికి ఆమెమీదకు వంగాడు అప్పటికే నామాదిరిగానే వాన్ హెల్సింగ్ కూడా ఆమె వింత స్వరం విని విస్తుపోతున్నాడు వాన్ హెల్సింగ్ వెంటనే తేరుకుని ఆర్థర్ మీదకు దూకి, అతని మెడ పట్టుకుని బలంగా లాగి గది మూలకు విసిరేసాడు అతని కంత బలం వుందని నేనెప్పుడూ అనుకోలేదు

''నీ ప్రాణం కోసం చెపుతున్నాను, వద్దు. మీ ఇద్దరి ఆత్మల కోసం చెపుతున్నాను'' అన్నాడు వాళ్లిద్దరిమధ్య సింహంలా అడ్డుగా నిలబడ్డాడు

[ఇంకా వుంది]






# డాక్టర్ సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### బి. ఎస్. — వైజాగ్

నాకు 2 సం॥లుగా కుడికాలి పాదం మడమ మీద పగుళ్ళు ఉన్నాయి — పగుళ్ళు లోతుగా ఉన్నాయి లోపల చీములాంటి పదార్థం కనబడుతున్నది చాలా నెప్పిగా ఉంటున్నది

★ దీనిని ఎపిడెర్మో ఫైటోసిస్ అని అంటారు

ఈ పగుళ్ళకి పై పూతగా విట్ ఫీల్డ్ ఆయింట్‌మెంట్ కొన్నాళ్ళపాటు వాడవలసి ఉంటుంది చీములాగా కనబడేది నిజంగా చీము కాదు కాలి మడమలో ప్రకృతిసిద్ధంగా ఉండే ప్లాన్‌టార్ అపోన్యూరాసిస్

లోనికి మల్టీ విటమిన్ మాత్రలు పూటకి ఒకటి వంతున, రోజుకి రెండు పూటలుగా కొన్ని నెలలపాటు వాడండి

### పి. ఆర్. — సిద్ధిపేట

మా చెల్లెకి 3 సం॥ల వయస్సు కాని ఇప్పటికి కూడా నడవలేదు, మాట్లాడలేదు పుట్టగానే ఏడవక పోవటంవల్ల ఇలా ఆయిందని అన్నారు

★ వారు చెప్పింది నిజమే! పుట్టగానే ఏడవక పోవటంవల్ల మెదడులోని సెల్స్‌కి ఆక్సిజన్ సరఫరా సరిగా జరుగక, సెరిబ్రల్ పాల్సీ అనే రోగం ఏర్పడుతుంది ఈ రోగం ఉన్నవారికి అన్ని శైశవ దశలూ ఆలశ్యం అవుతాయి

### కె.పి.కె. — ఆర్ ఎస్. — కోడూరు

నా వయస్సు 22 సం॥లు తరచు మలబద్ధకం, అజీర్తిగా ఉంటుంది మలవిసర్జనకి ముందు, తర్వాత 2,3 గం॥లు కడుపులో విపరీతమయిన పోట్లు వస్తాయి కడుపు ఖాళీగా ఉంటే నెప్పి ఉండదు భోజనం చేసినప్పటి నుండి కడుపులో పొడుచుకున్నట్లుగా ఉంటుంది గాలి ఎక్కువగా విడుదల అవుతుంది ?

★ మీ లక్షణాలు డుయోడినల్ అల్సర్‌ని తెలియజేస్తున్నాయి మీరు ఇదివరకే వాడిన యాంటాసిడ్ మాత్రలు మూలంగా తగ్గకపోతే శస్త్రచికిత్స మాత్రమే ఈ రోగ నివారణకి చికిత్సా విధానం అవుతుంది

### ఆర్. ఆర్. — మైలవరం

ఒక కిడ్నీ లేనివారు ఆడవారయినా, మగవారయినా యోగాభ్యాసం చెయ్యటానికి, ఆసనాలు వెయ్యటానికిగాని, ప్రాణాయామం అభ్యాసం చెయ్యటానికిగాని పనికి రారా ?

★ ఒక మూత్రపిండం లేనంత మాత్రాన వ్యాయామం మానేయనవసరం లేదు కాని అతి కష్టతరమైన ఆసనాలు వేయటం అంత మంచిది కాదు

### టి. ఎస్. — పాత మంగళగిరి

ఒక స్త్రీకి రక్తపుపోటు ఉన్నది ఆ స్త్రీతో పరపురుషుడు కలిసి సంభోగం చేస్తే ఆ రక్తపుపోటు పురుషునికి వస్తుందా ?

★ అలా వచ్చే అవకాశం ఏమాత్రమూ లేదు కానీ ఏదో తప్పు చేశామే అని ఖంగారు, ఆందోళన పడి మనస్సు పాడుచేసుకోవటంవల్ల రక్తపుపోటు తాత్కాలికంగా అధికం అయ్యే అవకాశం ఉంటుంది

### బి. ఎస్ - రాజమండ్రి

గ్లాకోమా అంటే ఏమిటి ?

★ కంటిలోపల, యాంటీరియర్ చేంబర్, పోస్టీరియర్ చేంబర్ అని రెండు గదులుగా కనుపాప ముందు వెనుక ఉంటాయి ఈ గదులలో ఏక్వియస్ హ్యూమర్ అనే ద్రవం ఉంటుంది ఈ ద్రవ ఉత్పత్తి అధికం అవటంవల్ల గానీ, ఈ ద్రవ ప్రసరణలో అవరోధం ఏర్పడటంవల్లగానీ గ్లాకోమా ఏర్పడే అవకాశం ఉంటుంది

మామూలుగా మందుల వాడకం వల్ల నయమవుతు ది లేనప్పుడు శస్త్ర చికిత్స ద్వారా ఈ రోగాన్ని నయం చేయవచ్చును

### యం. వి. ఎస్ — తణుకు

మా అమ్మగారు (సవతితల్లి) నాపట్ల చిన్నప్పటినుంచీ నిరాదరణ చూపేవారు ఏ కారణం లేకుండానే "ఆడంగి వెధవా" అని మనసు గాయపడేలా తిట్టేవారు నేను ఖంగారుపడి సెక్స్—సైన్సు పుస్తకాలు చదవటం మొదలెట్టాను మానసిక దౌర్బల్యంవల్ల స్త్రీ ప్రకృతి ఏర్పడుతుందని రాసి ఉన్నది ఆడంగి వాడిలా మారిపోతానేమో అని భయపడటం వల్లనే అమ్మాయి పోలికలు వచ్చాయని నా అనుమానం

★ మానసిక ప్రవృత్తుల బట్టే ఇలా జరుగుతుంది ఈ ప్రవృత్తులకి మనుష్యుల హేళనలు దోహదం చేస్తాయి

మీరు దీనిని గురించి చదవటం వెంటనే మానవలసి ఉంటుంది

మీ ఊళ్ళోగాని, విజయవాడలోగాని ఉన్న సైకియాట్రిస్టులను కలుసుకొని వారి సలహా కూడా తీసుకోండి



# అవతారం

## పైడిపాటి సుబ్బరామశాస్త్రి




మం॥ళగిరిలో బాలాంబ గారి పేరు చాలా ప్రసిద్ధి మంగళగిరి లోనే కాక, మిగిలిన చోట్ల కూడా ఆ భక్తు రాలి పేరు అందటికి తెలుసు 'నరసింహా!' అను కుంటూ, ఆమె బయలు దేఱితే చాలు, దేవుడికి కావల సిన సంభారా లన్నీ పోఱుకుతై ఆమె యింట్లో సంభా రాలూ ఎక్కువ ఉంటాయనీ, వాటిని కాజేయా లనీ, నలుగురు దొంగ లకు బుద్ధి పుట్టింది

దొడ్డి త్రోవను ఇంట్లో ప్రవేశించారు

దొంగలు దొంగతనం చేసే ముందు, వంటింట్లో పదార్థాలు వడ్డించుకు తింటారు అల్లా తిన్న తర్వాత దొంగతనం చేస్తే లాభిస్తుందని వాళ్ల శాస్త్రం అల్లాగే, అగ్గిపుల్ల వెలిగించి, ఏదో కష్ట పడి వడ్డించు కున్నారు తినటం ప్రారంభించారు వాళ్లందటికీ ఆ పదార్థాలలో ఉప్పు తక్కువగా ఉన్న ట్లుగా కనబడటమే కాక మజ్జిగలో ఉప్పు లేనిదే వాళ్లు తినలేనట్లుగా ఉన్నాయి ఆ మజ్జిగ ·

"ఉప్పు! ఉప్పు! అది కనబడ లేదు" అను కుంటున్నారు సన్నగా వాళ్లలో వాళ్లు

బాలాంబగారు వాకిట్లో పడుకున్నది·

ఆమెకువ మెలకువ వచ్చింది

ఉప్పు కన బడ లేదనే మాట విన్నది·

వాకిలి గొళ్లెం తీసి, లాంతరుతో లోపల ప్రవే శించింది ఆమెను చూడగానే, వారికి పారిపోవా లనే బుద్ధి పుట్టలేదు కాని, తెల్ల బోయారు

ఆమె వారిని మీ రెవ రని అడుగ లేదు

"నాయనా! ఉప్పు కనబడ లేదనడం నాకు విన బడింది వేస్తాను ఉండండి" అని జాడీలో నుంచి ఉప్పు తీసి వాళ్లకు వడ్డించింది· ఆ వడ్డించేటప్పుడు దీపానికి చూపించి మరీ వడ్డించించింది·

"మీరు ఎంత ఆకలితో వచ్చారో! నన్ను పిలిస్తే, నేను అన్నం వడ్డించనా? మీరు ఇంత శ్రమ పడాలా?" అని అంది, ఆర్ద్రతతో. వారు ఆమె మంచి తనానికి ఆశ్చర్య పోయారు అందులో ఒకడు అడిగాడు —

"ఏదో! జఱిగి పోయింది మాకు వడ్డించే టప్పుడు ఉప్పును ప్రతి ఒక్కడికీ దీపానికి చూపి వడ్డించా వేమమ్మా" అని

"రాత్రిపూట లవణం వడ్డించే టప్పుడు, దీపానికి చూపించటం ఆచారం నాయనా! అల్లాచేయడంలో, ఆ ఉప్పులో ఏమయినా విష జంతువులు ఱ్ఱకితే, ఉప్పు రంగు మారుతుంది ఆ విషయం తేలిపోతుంది

ప్రధాన మైన విషయ మేమంటే, అల్లా చూపించ కుండా వడ్డిస్తే, వడ్డించు కున్న వారికి ఆయు క్షీణం" అన్నది బాలమ్మ గారు

ఎంత మంచిదానవమ్మా! మేము దొడ్డి దారిని వచ్చి అన్నం తిని పోతుంటే, మా ఆయుస్సు నువ్వు కోరు తున్నావు!" అన్నా డొకడు·

"అదేమిటి నాయనా! మీకు ఎంత ఆకలి వేసిందో! నన్ను పిలిచి వడ్డించ మని అయినా అనకుండా, మీరే వడ్డించు కున్నా రంటే, దానిని బట్టి మీ ఆకలి తెలుస్తోంది!

పెద్ద దాన్ని నిద్ర లేపడం ఎందుకని కాని, అనుకున్నా అనుకో వచ్చు మీరు భోజనం చేస్తే నాకు ఆనందం నాయనా!" దొంగలు సిగ్గు పడ్డారు

ఆమె స్వయంగా విస్తళ్లన్నీ ఎత్తి వేసింది

తలుపులు ఉతకలు ఎత్తి ఉండడం గమనించింది

లోపలకు తలుపులు లేకపోతే కుక్కలు వస్తాయి, నాయనా! ఆ తలుపులు, పెద్ద దాన్ని కనుక నేను ఎత్త లేను. మీరు సరి చేసి వెళ్లండి నాయనా!

మీ కడుపు నిండక పోతే చెప్పండి! తిరిగి వంట చేసి పెడతాను ఎవరు ఏపని చేసినా పొట్ట తిప్పలు కోసమే కదా — నాయనా! స్వామి వారి ఉత్సవాలు కొద్ది రోజులలో ఉన్నాయి మీరంతా నిలబడి స్వామి వారికి సేవ చేయాలి

దానికి కావలసిన సంభారాలన్నీ దాతలు ఇస్తారు వాళ్లు ఇస్తే అయి పోయిందా? ఎవరి పని వాళ్ల చేయాలి! భగవంతుడు ఎవరు ఏవిధంగా సేవ చేసినా సంతోషించి అనుగ్రహిస్తాడు, నాయనా!" అన్నది ఆమె

"అల్లాగే అమ్మా! అప్పుడు మీ చేతి మీదుగా పెట్టిన అన్నం తింటాము· మేము చేసిన పని తప్పని తెలుసు కున్నాము!" అన్నా డొకడు·

"తప్పు ఒప్పులు భగవంతుడు పైనుంచి కని పెడు తూనే ఉంటాడు, వెళ్లిరండి నాయనాయనా! నిద్ర పోతాను –" అన్నది· వాళ్లు తలుపులు సరి చేసి వెళ్లారు భక్తులుగా మారారు·



# ఎడ్ల పందాల్లో జాక్‌పాట్ ప్రవేశపెట్టిన శ్రీ వెంకయ్య

ఒక్కొక్కరు ఒక్కొక్క ఆశయంతో ఉంటారు. రైతు కుటుంబంలో పుట్టి పెరిగారు వెంకయ్యగారు. తమ ఏరియాలో జరిగే ఎడ్ల పరుగు, లాగుడు పోటీల్లో ఎడ్ల సైజునుబట్టి ఎడ్ల జతలను ఐదు సైజులుగా విభజించి లాగించడం జరిగేది. ఆఖరి సైజుకంటే చిన్నసైజు ఎడ్ల జతలు వస్తే ఆ ఎడ్ల జతలకు పోటీల్లో పాల్గొనే అవకాశం లేకపోయేది. ఇది వెంకయ్యగారిని నిరుత్సాహ పరిచేది.

తన తండ్రి పేరున పోటీ జరిపించాలని ! ఆరో సైజుకూడా పెట్టి, చిన్నసైజు ఎడ్ల జతలనుకూడా ప్రోత్సహించాలనీ, ఆ పోటీలో కొత్తగా జాక్‌పాట్‌ని పెట్టి, గోల్డ్‌మెడల్‌ని యిచ్చి, పోటీ దారులను ఉత్తేజపరచాలనే ఊహ ఆయనకు కలిగింది.

కృష్ణాజిల్లా, బందరు తాలూకా, మంత్రిపాలెం గ్రామ చౌదరి అయిన, చిగులూరి వెంకటరామయ్య – లలితాంబగార్లకు 1944లో జన్మించేరు వెంకయ్యగారు.

1971న స్వగ్రామంలో తండ్రిగారి పేరున వెంకటరామయ్య మెమోరియల్ రాష్ట్ర ఎడ్ల పరుగు, లాగుడు పోటీలు ప్రారంభించారు వెంకయ్యగారు.

పది ఎకరాల ఖాళీ స్థలంలో చుట్టూ దడి కట్టించి, లోపల పందిళ్ళు వేయించి, ఎడ్ల జతలను కట్టించేవారు. పోటీలు చూడటానికి వచ్చేవారు కూర్చోటానికి గేలరీ, బెంచీలు, కుర్చీలు ఏర్పాటు చేశారు. అంటే సర్కస్‌లో మాదిరిగా చుట్టూ జనం కూర్చుంటారు. మధ్యన ఎడ్లపరుగు, లాగుడు పోటీలు రెండు వారాలు జరుగుతుంటాయి. పోటీ ఖర్చుల నిమిత్తం టిక్కెట్టు పెట్టి వసూలు చేసేవారు. ఈ పోటీకి, ప్రైజులతో సహా, సుమారుగా అరవై వేల రూపాయల వరకూ ఖర్చు అయేది.

**శ్రీ చిగులూరి వెంకయ్య**
**(వెంకటేశ్వరరావు)**



60 గజాలు పొడవు– మూడున్నర గజాలు వెడల్పులో, గజం లోతు మట్టితీసి, అందులో ఇసుక పోసి, సైజులు వారిగా బండిలో బరువు వేసి, టైము ప్రకారం ఎడ్లజతలను కట్టి బండ్లు లాగించేవారు. దానిని ఇసుక లాగుడు, కావు లాగుడు అంటూంటారు.

జాక్‌పాట్ నిమిత్తం ఆరు సైజుల ఎడ్ల జతలను 3 భాగాలుగా విభజిస్తారు

ఎడ్ల సైజులను బట్టి బండ్లలో బరువులు వేసి లాగించగా, ఆ మూడింటిలో తక్కువ టైముకు లాగిన జతకు జాక్‌పాట్ బహుమతులను ఇస్తారు. యీ ఎడ్లలాగుడు పోటీలు కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో ముమ్మరంగా జరుగుతూ వుంటాయి.

వెంకయ్యగారు జరిపిన పోటీలో, ఆరోసైజు ఎడ్ల జతను కొత్తగా ప్రవేశపెట్టారు. లాగుడు పోటీల్లో కూడా జాక్‌పాట్‌ని కనిపెట్టి, వాటిలో గెలుపొందిన ఆరుగురు విజేతలకు బంగారు పతకాలను బహూకరించారు. అప్పటి నుంచి ఆరో సైజు ఎడ్లజతలకు కూడా లాగుడు పోటీలో జాక్‌పాట్ గెల్చుకునే అవకాశం కలిగింది. ఆ ఘనత వెంకయ్యగారికే లభించింది.

1971, 73, 74 సంవత్సరాల్లో రాష్ట్ర స్థాయిలో స్వగ్రామంలో తండ్రిగారి పేరున ఎడ్ల పరుగు, లాగుడు పోటీలు జరిపి, ఘనమయిన బహుమతులిచ్చి మెప్పుపొందారు వెంకయ్యగారు.

– బొజ్జా సత్యనారాయణ

ఈ సంగతి ఆ నోటా ఆ నోటా పాకి చాలామంది ఇంటి ముందు పోగయ్యేరు. మాస్టారు మరికొంత దూరం ఆలోచించి ఆ ఊళ్లో కల్లా దీర్ఘాయుష్కుడైన తొంభైయ్యేళ్ల వృద్ధుడికి కబురు పెట్టి రప్పించేడు. ఆయన వయసులో ఉన్నప్పుడు ఇలా వాళ్ళకీ వీళ్ళకీ పెళ్లి బేరాలు కుదిర్చి పావలో వరకో సంపాయించుకుంటూండేవాడు.

ఆయన వచ్చి ఆవీ ఆనవీ చూపుతోనే ఆవిడని పరీక్షగా చూసి వెంటనే గుర్తు పట్టేడు.

'నువ్వేటే అమ్మా నాగలక్ష్మి' అంటూ ఆప్యాయంగా ఆమెను దగ్గిరికి తీసుకున్నాడు. ఆ భాష అర్థం కాకపోయినా ఆ స్పర్శలోని కమ్యూనికేషన్ ఆమెకు అందింది.

ఆయన చెప్పసాగేడు.

'చిన్నప్పుడు దీన్ని ఈ చేతుల్లోనే ఎత్తుకున్నాను. ఈ చేతుల్లోనే ఒక తెలుగాయనకు నూటఅరవై రూపాయలకు అమ్మేను...' అంటూ ఏవేవో చెప్పేడు.

మాస్టారు ట్రాన్స్‌లేట్ చేయలేక నానా అవస్థా పడ్డాడు, ఆయన మాట చొరనీకుండా మాట్లాడ్తూంటే

ఆవిడ తమ్ముణ్ణి దగ్గిరికి పిల్చి 'ఇదిగోరా చూస్నా మీ అక్కయ్య నాగలక్ష్మి చిన్నప్పుడేం చూశావో నీ కసలు గుర్తుందో లేదో. నీకు జ్ఞానం తెలిసేసరికే అది ఇల్లు దాటి పోయింది ...' అంటూ ఇద్దరి చేతుల్ని కలిపేడు

రక్తస్పర్శమహిమ!!!

అంతవరకూ కేరళ దేశంలోని పరాయి మగవాడుగా కనపడ్డ ఆయన ఆమెకీ, తెలుగుదేశం నించి వచ్చిన పండు ముసలామెగా ఆమె ఆయనకీ కనబడి దూరంగా ఊడిపోయినవారల్లా ఆక్షణంలో అక్కాతమ్ముళ్ళమనే భావన పొంగి పొరలింది ఇద్దరి శరీరాల్లోనూ ఒకేసారి తోడబుట్టిన బంధం నరనరాల్లోనూ ప్రవహించి పులకరించింది.

ఇరు సంసారాల వారూ, ఇరుగు పొరుగు ప్రేక్షకులూ అందరూ ఈ అద్భుతాన్ని నిస్తబ్దోయి చూస్తున్నారు. అందరికీ వింతగానే వుంది ఈ అపూర్వ సంగమం.

ఒకరి భాష ఒకరికి రాదు అక్కా అనలేదాయన. తమ్ముడని అనలేదామె. ఇరువురి చేతులూ మాత్రం గట్టిగా బిగుసుకున్నాయి. ఆప్యాయంగా తడుము కున్నారు. కళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. ఇద్దరి కళ్ళనుండీ ఏకధార. అదే వాళ్ళభాష. ఆ మూగభాషలోనే వారు ఒకరినొకరు తెలుసుకుంటున్నారు. గతాన్ని నెమరువేసుకుంటున్నారు. అనుభూతుల్ని ఒకరితో ఒకరు పంచుకుంటున్నారు. మధ్య మధ్యలో ముసిలాయన ఏమేమో చెబుతున్నాడు. మాస్టారు, సుబ్బారావూ ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ అవస్థ పడుతున్నారు.

ఆయనొకసారి రథోత్సవంలో ఆమెని తన ఒళ్ళో కూర్చోబెట్టుకుని వూరేగించిన సంఘటన చెప్తుంటే లీలగా గుర్తుకొచ్చింది. తన పొట్టి పరికిణీ, పువ్వులజడా జ్ఞాపకం వచ్చేయి. అన్నీ మసక జ్ఞాపకాలే.

ఈ మతాలు, ఆచారాలు, విశ్వాసాలు దేశం దాటగానే ఏమయేయి ? ఈ బంధాలు; అనుబంధాలు గడప దాటగానే ఏమయేయి. అంతా మాయేనా? అంతా శూన్యమేనా?

ఇప్పుడేకళ ఉడగగలదు ? మనసే మూగవౌతే నోటంబడి మాటే మొస్తుందీ?

కంటికెదురుగా సినిమా జరుగుతున్నట్లుంది అందరికీను. ఎంతసేపని అలా బొమ్మలా వుండగలరు? ఒక్కొరుగా క్రమంగా కదిలేరు. భగవంతుణ్ణి నమ్మిన వారు వాడి లీలలు చిత్రం అనుకుని, ఇదంతా వాడి నెత్తి మీదికి తోసేరు

నీ మరదలు ఇదిగో, అంటే నీ మేనల్లుడిడిగో అంటూ ఏవేవో పరిచయాలు. పిల్లలు అమాయకంగా చూస్తుంటున్నారు పరాయిగా. అద్భుతం, విచిత్రం తప్ప అక్కడ ఏమీలేదు. వివరికీ విదుటివారి మాట తెలీదు. మాస్టారేంచెబితే దానికి తలూపి ఊర్కోడం.

ఆయన భార్య కాఫీ పెట్టి ఇచ్చింది. అక్కడి తయారీ ఎవరికీ రుచించలేదు. కానీ ఏదో ఆత్మీయత మెదిలింది. మాట్లాడ్డానికేంలేదు. అందరూ బొమ్మలా నిలబడ్డారు. దుబాసీల సాయంతో నాగలక్ష్మి అడగదల్చుకున్నవేవో అడిగింది. ఆయనచెప్పగలిగినవేమో చెప్పేడు. మాట్లాడ్డం తనివితీరా ఐపోయింది అన్న భావన కలగగానే నాటకానికి తెర పడాల్సిన సమయం ఆసన్నమయినట్టు మళ్ళీ మనసుల్లో అంతే శూన్యం ఆవరించుకుంది. మళ్ళీ లౌకికంగా పరాయివారైపోయేరు.

ఇక భవిష్యత్ కార్యక్రమమేమిటీ ? వాళ్ళ పరిస్థితి చూస్తే నాలుగు రోజులు ఉండతగ్గదిగా కన్పించలేదు ఉండి మాత్రం తర్వాత ? ఇద్దరూ నేడో రేపో రాలిపోయేట్టున్నారు. ఆ తర్వాత తరాలు వేరు: వేలమైళ్ల దూరంలో నివాసం. చీటికీ మాటికీ కదిలే వ్యవహారంకాదు. భాషలు, సాంప్రదాయాలూ వేరు. కనీసం కార్డుముక్క రాస్కోనే యోగ్యత కూడా లేదు. కాలమే బంధాన్ని కాలరాచేక ఇక చిగురించే ప్రసక్తి ఏక్కడ ? పరిచయస్తుల యింటికి చాలాకాలం తర్వాత వెళ్ళి పరామర్శించి వచ్చిన భావన మిగిలింది చివరకు.

ఇప్పుడు కలిసే బంధమూకాదు. కొనసాగే బంధమూకాదు వదల్లేక వదల్లేక ఆ యింటి చుట్టూ మూడుసార్లు తిరిగి, అయిన వాళ్లందర్నీ తనివితీరా అక్కున జేర్చుకుని కాలు బయట పెట్టిందావిడ. ఆ సంబంధం అంతటితో సరి.

బస్సు ఊరి పొలిమేర దాటేక 'మళ్ళీ జన్మంటూ ఉంటే ఆడదానిగా పుట్టించకు దేముడా' అని మొక్కుకుంది నాగలక్ష్మి.

'సంఘమంటూ పుట్టేక అందులో అసమానతలూ, మూఢాచారాలూ, వ్యక్తిగత అవసరాలూ, 'ఆర్థిక సూత్రాలూ కలగలిసి మనుషుల జీవితాల్ని నడుపుతాయి కాబట్టి 'కాలం కడుపులో ఇటువంటి నిర్దయమైన కథలెన్నో ఉండక తప్పద'న్న వివేకంతో సుబ్బారావు ఏ దేముడికీ మొక్కుకోలేదు. మానవతకే మొక్కుకున్నాడు. అది ఎప్పటికన్నా వెల్లివిరిస్తే ఇటువంటి అభాగ్య కథలుండే అవకాశం పోతుందని.

## గుర్తులు !

రాతి నేలపై గుర్తులు తాత్కాలిక చిహ్నాలు
నిమిషానికి మాయమయ్యే నశ్వరంపు
మూర్తులు !
ఇసుక మీద గుర్తులు మసక చీకటి
స్వరూపాలు
చిరుగాలి తాకిడికే చెదరిపోవు అలలు కలలు !
బురదపైన గుర్తులు అస్పష్టమైన వ్రాతలు
ఎండినపిమ్మట అగపడు అవ్యవస్థిత మండనాలు!
గుండెపైన గుర్తులు పసిడి వన్నెల విగ్గులు
కాలానికి కర్గిపోని శాశ్వత శిలాక్షరాలు !

— జి. భాను

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## ఛాయావాదీ బింబ విధాన్ - ఔర్ ప్రసాద్ :

దక్షిణాంచలీయ సాహిత్య సమితి పక్షాన ప్రచురించిన మెథడిస్ట్ బాయ్స్ హైస్కూలు ఉపాధ్యాయులు డాక్టర్ ఎస్ పి. కుట్టన్ పిళ్లే రచించిన చాయా వాదీ బింబ విధాన్ అవుర్ ప్రసాద్ (కాల్పనిక సాహిత్యంలో రూపకల్పన—జయశంకర ప్రసాద్) అనే విమర్శ గ్రంధాన్ని గవర్నర్ శ్రీ అబ్రహాం జనవరి 8 వ తేదీన ఆవిష్కరించారు. మెథడిస్ట్ బాయ్స్ హైస్కూలులో జరిగిన ఈ ఆవిష్కరణోత్సవానికి ప్రముఖ రచయిత, ఉస్మానియా విశ్వవిద్యాలయం హిందీ శాఖ రీడరు డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్ అధ్యక్షత వహించారు. హిందీ మాతృ భాష కానివారు హిందీలో చేసే రచనా వ్యాసంగానికి ప్రోత్సాహం కల్పించడం దక్షిణాంచలీయ సాహిత్య సమితి ఉద్దేశమని ఆయన అంటూ, దాని కార్యకలాపాలు వివరించారు. గవర్నర్ తమ ప్రసంగంలో ఏ భాష కూడ ఆ భాషను మాట్లాడే వారి సొమ్ము కాదని, భారత దేశంవంటి బహు భాషామయ దేశంలో వైవిధ్యంలో సౌందర్యమే కాక, సమైక్యంకూడ ఉన్నదనీ అన్నారు. హిందీ మాతృ భాషగాని డాక్టర్ కుట్టన్ పిళ్లే జయశంకర్ ప్రసాద్‌వంటి ఆధునిక కాల్పనిక హిందీకవి రచనలపై విమర్శ గ్రంథం వ్రాయడమనేది ఉదాహరణప్రాయమని గవర్నర్ అన్నారు. భాషాబేదానికి అతీతమైన ఈలాటి రచనలు భావ, జాతీయ సమైక్యానికి తోడ్పడుతాయని,అందువల్ల రచయితను, ప్రచురణకర్తను, సంస్థను అభినందిస్తున్నానని గవర్నర్ అన్నారు. మెథడిస్ట్ బాయ్స్ హైస్కూలు ప్రిన్సిపాల్ రెవరెండ్ పాల్ డాక్టర్ కుట్టన్‌పిళ్లే హిందీకి చేసిన సేవను ప్రశంసించారు డాక్టరు పిళ్లే కృతజ్ఞత తెలుపుతూ, హిందీ చాయావాద త్రిమూర్తులైన సుమిత్రానందన్‌పంత్, జయశంకర్ ప్రసాద్, సూర్యకాంత త్రిపాఠీ నిరాలాలలో మొదటి ఇద్దరి గురించి గ్రంధాలు వ్రాశానని, నిరాలాను గురించి వ్రాయనున్నానని అన్నారు. మళయాళ అధ్యాత్మిక రామాయణాన్ని హిందీలోకి అనువదించినప్పుడు తనకు కలిగిన అనుభవాలను ఆయన వివరించారు. రాష్ట్ర ప్రభుత్వం హిందీ స్పెషల్ ఆఫీసర్ డాక్టర్ బి శాయిలు ధన్యవాదాలతో ఆవిష్కరణోత్సవం సమాప్తమైంది.

## శ్రీ పీలూ మోడీ మృతికి సంతాపం :

రాజ్యసభ జనతాపార్టీ సభ్యుడు ప్రముఖ రాజకీయ నాయకుడు, వాస్తు శాస్త్రజ్ఞుడు శ్రీ పీలూ మోడీ జనవరి 2న ఢిల్లీలో హటాత్తుగా మరణించినందుకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి తక్కిన నాయకులు గాఢసంతాపం ప్రకటించారు. భారత దేశం ప్రజాసేవకు అంకితుడైన గొప్ప వ్యక్తిని, రాజకీయాలలో బహుముఖ ప్రజ్ఞావంతుని కోల్పోయిందని ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు సంతాపం తెలిపారు. జనతా నాయకుడు శ్రీ జైపాల్ రెడ్డి, లోక్‌దల్ నాయకుడు సర్దార్ గౌతులచ్చన్న మున్నగువార తమ సంతాపం తెలిపారు. శ్రీ మోడీ వయస్సు 57సంవత్సరాలు. శ్రీ మోడీ సంస్కారం, సరసత గల రాజకీయ నాయకుడు. 1926 నవంబరు 14న బొంబాయిలో సంపన్న పార్సీ కుటుంబంలో జన్మించారు. తండ్రి సర్‌హోమీ మోడీ లప్పటి వైస్రాయి కార్యనిర్వాహక వర్గ సభ్యుడు (కేంద్ర మంత్రి) శ్రీ పీలూమోడీ బొంబాయిలో వాస్తుశాస్త్ర పట్టభద్రుడైన పిదప అమెరికాకు వెళ్లి కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో వాస్తుశాస్త్రంలో ఎం ఏ. పట్టం పొంది, తిరిగివచ్చి ప్రముఖ వాస్తువేత్త,పంజాబ్ రాజధాని చండీఘర్ నిర్మాత అయిన శ్రీ ఎల్. ఇ కర్‌బూసియర్‌తో కలిసి



పీ లూ మో డి

పని చేశారు. పాకిస్తాన్ మాజీ అధ్యక్షుడు శ్రీ భుట్టో శ్రీ మోడీ అనుంగు మిత్రుడు. మోడీ 1962లో మహారాష్ట్ర విధాన సభకు పోటీచేసి వోడిపోయాడు.పిదపస్వతంత్ర పార్టీలోచేరిగుజరాత్ నుంచి పార్లమెంటుకు 1967లో ఎన్నికయ్యారు, స్వతంత్రపార్టీకి కొంతకాలం అధ్యక్షుడుగాఉన్నారు 1977 వరకు లోక్‌సభ సభ్యుడుగా ఉండి 1978 జనతాపార్టీ పక్షాన రాజ్యసభకు ఎన్నికయారు. ఆయనకు పెక్కు సాంస్కృతిక సాంఘిక, విద్యా సంస్థలతో సంబంధం వుండేది. తన సరసత హాస్య చతురతతో ప్రతిపక్షాలను కూడా నవ్వించేవాడు.

## అకాడమీలు రద్దు చేయరాదా ?

కళా సాహిత్యాలను ప్రోత్సహించడం కోసం రాష్ట్ర ప్రభుత్వం అకాడెమీలను ఏర్పాటు చేసింది. అవి రానురాను ప్రత్యేక సంస్థానాలయి పోయాయని, వాటి లక్ష్యాలు నెరవేరడంలేదని, ఆశ్రిత పక్షపాతం, దలారీ వ్యాపారం ఎక్కువయిందని, విమర్శలు బయలుదేరుతున్నాయి. ఏ సంస్థయినా సక్రమంగా పనిచేయనప్పుడు, దానిని రద్దు చేసి దాని పనులు ప్రభుత్వం నిర్వహించడం విద్యుక్త ధర్మం. కార్పొరేషన్లలాగే ఈ అకాడెమీలకు కూడా అనధికారులు నిర్వాహకులు, కార్పొరేషన్ల అనధికార నిర్వాహకులను తొలగించినపుడు ఈ అకాడెమీలలనధికార నిర్వాహకులనూ తొలగించి, అన్నిటినీ ఏకం చేయవచ్చు సాహిత్య అకాడెమీకి సాలీనా మూడు లక్షల రూపాయిలు గ్రాంటు, ప్లాన్ గ్రాంటు మూడు లక్షలు అందుతాయి ఇది పుస్తకంలో ప్రచురించి అమ్ముకుంటుంది. దీని లక్ష్యం రచయితను ప్రోత్సహించడం. కాని ఈ సంస్థ ప్రెస్సు వారికి, బ్లాకు మేకరుకు, బైండరుకు వారు అడిగిన డబ్బు ఇస్తుంది. రచయిత దగ్గరికి వచ్చేసరికి బేరం200 పుటల మవులిక గ్రంథం వ్రాయండి, వెయ్యిన్నూట పదహార్లు ఇస్తాము. మీరు సేవ చేయాలి అని. తక్కిన ప్రభుత్వ సంస్థలు పేజీకి పది రూపాయి లిచ్చేటప్పుడు అకాడెమీ పది రూపాయలివ్వడానికి ఏమి బాధ ? ప్రింటింగు ప్రభుత్వ ముద్రణ సంస్థలకు అప్పజెప్పవచ్చుగదా! ఈఅకాడెమీ సభ్యులు దాదాపు 70 మంది వారికి ఏటా రాకపోకలకు బోలెడు ఖర్చు. సంగీత నాటక అకాడెమీ మొదట నాలుగు లక్షల సాలుసరి గ్రాంటు వుండేది. దానిని సంగీత నాటక నృత్య అకాడెమీలుగా మూడు ముక్కలు చేసిన పిదప నాటక అకాడెమీకి రెండులక్షలు. తక్కిన వాటికి చెరి ఒక్క లక్షా సాలుసరి గ్రాంటు, ప్లాను గ్రాంటు చెరి ఒకలక్ష. నాటక అకాడెమీకి 65 మంది సభ్యులు, సంగీత అకాడెమీకి 46 మంది, నృత్య అకాడెమీకి 47 మంది సభ్యులు. లలితకళా అకాడెమీకి సాలుసరి గ్రాంటు రెండు లక్షలు. ప్లాను గ్రాంటు రెండు లక్షలు. సభ్యులు 45 మంది. బాలల అకాడెమీకి సాలుసరి గ్రాంటు లక్షా, ప్లాను గ్రాంటు లక్ష. సభ్యులు దాదాపు 50 మంది.

ఈ అకాడెమీల సభ్యుల సమావేశాలకు రాకపోకలకు లక్షలు ఖర్చవుతాయి. ఈ వ్యయమంతా అనవసరం. కనుక వీటన్నిటిని, సాంస్కృతిక శాఖను కలిపివేసి ఒక ఐ ఏ ఎస్ ఆఫీసర్‌ను నిర్వాహకుడుగా వేయడం ఉచితం నాటక అకాడెమీ నృత్య అకాడెమీ నిర్వహించే జానపద ప్రక్రియల కోసం వచ్చిన కళాకారులు కళాభవన్ సంచులలో పడిగాపులు కస్తుంటే చూడ ఘోరంగా వుంటుంది. ఇతర రాష్ట్రాలకు వెళ్ళే జానపద కళాకారులు రైళ్ళలో వెళ్తారు. నిర్వాహకులు విమానాలలో బయలుదేరుతారు— తెలుగు అకాడెమీ అంతర్జాతీయ తెలుగు సంస్థలనుకూడా కలిపివేయవచ్చు. ఈ అకాడెమీల నిర్వహణ సిబ్బందిని . విద్యాశాఖలోను, తక్కిన స్నాతకోత్తీర్ణులను, పి. హెచ్. డి. లను కళాశాలల్లోను నియమించవచ్చు. ఈ అకాడెమీల అనధికారుల తొలగింపు వల్ల, సమ్మేళనంవల్ల సంవత్సరానికి కోటిరూపాయలు ఆదాఅవుతుంది.ఆయా అకాడెమీల స్థానంలో గరిష్టపక్షం ఐదుగురు ప్రముఖులతో సలహా సంఘాలు నెలకొల్పి, వాటిని ఏటా ఒకమారు సమావేశపరచి, సలహాలు తీసుకొంటేచాలు ఆ సంఘాలు ఆయా రంగాలలోసన్మానించవలసిన వారిని, ఆదుకోవలసిన వారిని సూచిస్తాయి పుస్తకాలు ప్రచురణ ముద్రణకు సహాయం చేయడం మున్నగు వాటిని గురించి సలహాలిస్తాయి శ్రీ కె ఆర్ పరమహంసగారు స్పెషల్ ఆఫీసరుగా ఉన్నప్పుడు జరిగినంత కళాభివృద్ధి ఎప్పుడూ జరుగలేదని సహృదయుల అభిప్రాయం అలాటి చిత్తశుద్ధిగల ఐ. ఎ. ఎస్. ఆఫీసర్‌కు సాంస్కృతిక వ్యవహారాలు అప్పగిస్తే ఎంతో పని జరుగుతుంది ప్రభుత్వం ఈవిషయం తీవ్రంగా ఆలోచించి పొదుపు జరిగి, సాహిత్య కళావేత్తలకు నిజమైన సహాయం జరిగేట్టు చూడడం అవసరం.

**ఉపశ్రుతి :**

ఏమండీ, మద్రాసులో నన్నయ జయంతి బాగా జరిగిందా ? అనడిగాను, అంతర్జాతీయ తెలుగు సంస్థ మద్రాసులో ఏర్పాటు చేసిన నన్నయ జయంతిలో పాల్గొని వచ్చిన ఒక మిత్రుణ్ణి. చాల బాగా జరిగింది అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షులు ఆస్థానకవి విమానంలో వచ్చారు. ఆస్థానకవి నన్నయను గురించి ప్రసంగించిన 20 నిమిషాలలో 19 నిమిషాలు అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షుల ధైర్య సాహసాలను, విశేషాన్ని ప్రశంసించారు. నాతోపాటు సభకు వచ్చినవారు 40 మంది—ఉన్నారు ఆయన. చాలు చాలు. నన్నయ రాజరాజనరేంద్రుని కులబ్రాహ్మణుడు. ఆస్థాన కవి కాదుగా ఆయన మొగానికి అంత మాత్రం చాలుఅన్నారు-మా మాటలు వింటున్నమరొకరు·★



# వంటలు

## గ్రీన్ రైస్

కావలసిన వస్తువులు :— ఆకు కూరముద్ద ఒక కప్పు, [ఏదైనా ఒక ఆకు కూర తీసుకుని బాగా కడిగి, సన్నగా తరిగి రోట్లో వేసి బాగా మెత్తగా రుబ్బాలి. ఈ ముద్దను ఒక కప్పు తీసుకోవాలి], ఉల్లిపాయలు రెండు, నెయ్యి పావుకప్పు, పచ్చి మిరపకాయలు నాలుగు, దాల్చినచెక్క చిన్నముక్క, లవంగాలు రెండు, కాస్త బిరుసుగా వార్చిన అన్నం రెండు కప్పులు, తగినంత ఉప్పు.

తయారుచేయు విధము :— పచ్చిమిరపకాయలను, ఉల్లిపాయలను సన్నని ముక్కలుగా తరగాలి. ఇపుడు ఒక పాత్రలో నెయ్యి తీసుకొని పొయ్యిపై పెట్టి బాగా వేడయ్యాక ఉల్లిపాయముక్కలు, పచ్చిమిరపకాయ ముక్కలు, లవంగాలు, దాల్చినచెక్క వేసి వేయించాలి ఉల్లిపాయలు రంగుమారాక ఆకు కూర ముద్దను వేసి బాగా కలిపి, ఉప్పు వేసి ఒక్క నిమిషంపాటు మూతపెట్టాలి సన్నని మంట వుంచాలి మొత్తం బాగా వుడికి నెయ్యి పైకి తేలుతుంది అపుడు అన్నంపోసి రెండు మూడు నిమిషాలపాటు పొయ్యిపై వుంచి దించేయాలి దించేసిన తర్వాత మరో సారి మొత్తం బాగా కలియపెట్టాలి. కావాలంటే నేతిలో వేయించిన జీడిపప్పును తగినంతచేర్చి కలపవచ్చును

— గార్ల సరస్వతి





## క్యాబేజీ కట్‌లెట్స్

కావల్సిన సామానులు :

క్యాబేజీ ఆకులు 10, బంగాళాదుంపలు పెద్దవి 3, ఉల్లిపాయలు 2, పచ్చిబఠానీలు అరకప్పు, అల్లం-చిన్నముక్క, పచ్చిమిర్చి 3, లవంగాలు 10, కొత్తిమీర-కట్ట.

తయారుచేయు విధానము :

బంగాళాదుంపలు పెచ్చు తీసి ముక్కలుగా కోసుకోవాలి వుల్లిపాయ, పచ్చిమిర్చి సన్నని ముక్కలుగా కోసుకోవాలి. పచ్చిబఠానీలు ముందురోజు రాత్రి నీళ్ళల్లో నానబెట్టుకుని వుంచుకోవాలి.

మందపాటి పాత్రలో కొద్దిగా నూనెవేసి కాగాక పచ్చిమిర్చి, నూరిన అల్లం వేసి వేయించి, వుల్లిముక్కలు, బంగాళాదుంప ముక్కలు వేసి కలిపి తగిన ఉప్పు వేసి మూత పెట్టాలి ఐదు నిముషాల తర్వాత పచ్చి బఠానీలు కూడా వేసి కలిపి మూత పెట్టి సన్నని సెగగా చేసి వుంచాలి. అంతా ఉడికాక దింపి కొత్తిమీర చల్లాలి క్యాబేజీ ఆకులు విశాలంగా అరచేతిలో పరచుకుని దానిలో ఈ కూర ఓ చెమ్చాడు పెట్టి, నాలుగు వైపులా మడచి కొసలు కలిసినచోట విడిపోకుండా లవంగం గుచ్చాలి. అన్నీ యివేమాదిరిగా చేసి పెట్టుకుని, యిడ్లీ స్టాండు గుంటల్లో ఒక్కొక్కటి పేర్చి యిడ్లీలమాదిరి ఆవిరిపై ఉడికించాలి. యివి చాలా రుచిగా ఉండటమే గాక, బలవర్ధకమైనవి కూడా.

— వల్లిశ్రీనాగరాజ్ ★

# అవీ... ఇవీ... అన్నీ

### పులికంటి కృష్ణారెడ్డి కథలు

### గూడుకోసం గువ్వలు

రచయిత శ్రీ పులికంటి కృష్ణారెడ్డి. పులికంటి కృష్ణారెడ్డి కథలలో ఏడు కథలు సాహిత్య మాస పత్రిక 'భారతి'లో ప్రచురింపబడినవి. ఈ కథలు చక్కని భావంతో కూడి రచయిత అంతరంగానికి అద్దం పడుతున్నాయనిపిస్తుంది 'కర్త—కర్మ—క్రియ' కథ మలచిన తీరు ప్రశంసార్హము 163 పేజీలు వెల తొమ్మిది రూపాయలు.

గూడు కోసం గువ్వలలో 10 చిన్న కథలు ఉన్నాయి 160 పేజీలు గల ఈ పుస్తకం వెల 9 రూపాయలు కథలన్నీ కూడ సామాజిక స్పృహతో రచించారు

పై రెండు పుస్తకముల ప్రతులకు విశ్వ ప్రభ పబ్లిషింగ్ హవుస్, నెర్రగుంట, చిత్తూరు జిల్లా అన్న చిరునామాకు వ్రాయాలి

### సమతా సంగీతం

రచన శ్రీ సిద్దంసెట్టి రామ సుబ్బయ్య కొన్ని గేయాలు, కొన్ని వచన పద్యాలు వంటివి గల ఈ పుస్తకం వెల ఎనిమిది రూపాయలు 105పేజీలు. ప్రతులకు. శ్రీ ఎస్ వెంకటేశ్వర్లు, 11392, టూకువాను మిట్ట, సంతపేట, నెల్లూర్ లేదా అంబికా బుక్ సెంటర్,పినాకిని సూపర్ మార్కెట్, ట్రంకు రోడ్డు, నెల్లూరు.

### అ క్ష రా స్త్రా లు

వచన కవితా సంపుటి• రచన శ్రీ టి. గౌరీ శంకర్ వెల ఎనిమిది రూపాయలు ప్రతులకు• రచయిత పేర, ఇం నెం 1—8—78 79, చిక్కడపల్లి, హైదరాబాదు అన్న చిరునామాకు వ్రాయాలి

### తె లు గు బి డ్డ

వివిధ రచయితల కవితా సంకలనం సంకలన కర్త శ్రీ కాట్రగడ్డ లక్ష్మీ నరసింహారావు వెల మూడు రూపాయలు 23 పేజీలు ప్రతులకు: సాహితీ సుధ, డోర్ నెం 9—139, నాయుడు గూడెం రోడ్డు, పెదపాడు—534437.

### మాండూక్య సార సంగ్రహము

వేదాంతోపన్యాసములు రచన. శ్రీ నండూరు సుబ్రహ్మణ్య శర్మ వెల 12 రూపాయలు 252 పేజీలు ప్రతులకు ఆర్ష విజ్ఞాన గ్రంథమాల. ...యంవీధి, సత్యనారాయణపురం, విజయవాడ – 11.

### అవగాహన

ఆధునిక ఆలోచనా వీచిక—5 సంకలనం మానేపల్లి సత్యనారాయణ వెల మూడు రూపాయలు 32పేజీలు ప్రతులకు ఎమ్ నళినిదేవిబుక్స్ అండ్ బుక్స్, బొండాడ, విజయనగరం.

### భ క్తి మా ల

తెలుగు మాస పత్రిక సంపాదకుడు ఎమ్ కృష్ణమూర్తి 16 పేజీలు ప్రతులకు సంపాదకుని పేర శ్రీ లక్ష్మీ నరసింహ ప్రెస్, శ్రీసచ్చితానందా ఆశ్రమం, మైసూరు.

### నక్సలైట్లు ఏ దేశభక్తులు ?

రచయితలు శ్రీ నరసింహారెడ్డి, శ్రీ కృష్ణారావు వెల 2 రూపాయలు 52 పేజీలు ప్రతులకు.. సాహిత్య నికేతన్, 3—4—852, బరకత్‌పుర, హైదరాబాద్

### న్యూ ఎక్స్ రే

ఆధునిక కవితా వేదిక సాలు చందా: 6 రూపాయలు 14 పేజీలు ప్రతులకు ఎక్స్ రే, కొల్లూరి హవుస్, అమలాపురము.







గీతా పంచకం. కృతికర్త శ్రీ కృష్ణ భాగవతార్య వెల ఆరు రూపాయల ఏభై పైసలు 70పేజీలు, ప్రతులకు శ్రీకృష్ణ భాగవతార్యగూడలి (వయా) విద్యానగర్ గూడలి—బి. నెల్లూరు జిల్లా.

### నవతరానికి నాంది

సాంఘిక నాటిక. రచన శ్రీ తక్కెళ్ళబాలరాజు వెల మూడు రూపాయలు 38పేజీలు. ప్రతులకు• చైతన్య సాహితి, ఇం. నెం 3—3—158 ఏనుగుల గడ్డ హన్మకొండ లేదా ఆంధ్ర సారస్వత పరిషత్తు, బొగ్గులకుంట — తిలక్‌రోడ్డు, హైదరాబాద్

### పరమాత్ముని సాక్షాత్కారము

వెల. ఒక రూపాయి ఏభై పైసలు పేజీలు 64

### మానవ – ఈశ్వరీయ

### సిద్ధాంతములలోని భేదములు

వెల 2 రూపాయలు. 98 పేజీలు.

పై రెండు పుస్తకములు ప్రజా పిత బ్రహ్మకుమారి ఈశ్వరీయ విశ్వ విద్యాలయము, 11/185 శిపాయివీధి, మదనపల్లె-517325 చిత్తూరు జిల్లా అన్న చిరునామాకు వ్రాసి పొందవచ్చును

### ఫోనొచ్చేసింది

నాటిక, రచన . శ్రీ కాంక్ష శ్రీ.వెల: మూడు రూపాయలు 39 పేజీలు ప్రతులకు శ్రీ ఎన్ వి. వి సత్యనారాయణ మూర్తి, డి ఇ టి ఆఫీసు ఏలూరు (ప గో. జిల్లా )

### వీ ణా వా ణి

కవితా సంకలనం సంపాదకులు• శ్రీ జి. వి. యామునాచార్య సహాయ సంపాదకులు• సిద్దోజు నరసింహాచారి, శ్రీ మహమ్మద్ తహసీన్ అలి, వెల: ఏడురూపాయలు 61 పేజీలు ప్రతులకు: కార్యదర్శి, సాహితీ సాంస్కృతిక సమాఖ్య, వీణవంక — 505502, తా. హుజూరాబాద్ జిల్లా, కరీంనగర్.

### జలతారు సెలయేరు కన్నీరు

కవితా సంపుటి రచన శ్రీ ఎన్ ఎన్ నాయకర్, వెల మూడు రూపాయలు. 64 పేజీలు. ప్రతులకు రచయిత పేర, 32 మాస్క్ స్ట్రీట్, చెపాక్ మద్రాసు—5

### గుండెల్లో వాన

రచన శ్రీ ఎస్ మునిసుందరం. దీనిలో ఉన్న కవితలు భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర మాస, దిన, వార పత్రికలలో ప్రచురింపబడినవి వెల• పది, రూపాయలు ప్రతులకు. శ్రీ ఎస్ ప్రశాంత్, 3—4—58, గాండ్లవీధి, గిరింపేట, చిత్తూరు.

vanjielr

## ఉత్తరాలు

(5వ పేజీ తరువాయి)

### న్యూఢిల్లీ లేఖ

న్యూఢిల్లీ లేఖ ప్రతివారం విడువకుండా చదువుతున్నాను. రోజూ దిన పత్రికలూ చదువుతున్నా తెలియని ఎన్నో విషయాలను ప్రతీ వారం మాకు తెలియ జేస్తున్న "డాక్టర్ జయదుభాషి" గారికి నా కృతజ్ఞతలు.

జి. వి. కృష్ణారావు (రాజమండ్రి)

*    *    *

4—2—83తేదీ పత్రికలో జయదుబాషిగారి 'అబద్ధపు వాగ్దానాల ఫలితం' న్యూఢిల్లీ లేఖ చాలా బాగుంది 'కాంగ్రెసు (ఐ) ని పడగొట్టి అధికారమునకు వచ్చిన ప్రభుత్వాలు గూడా తెలుసుకోవలసింది అదే. జయదుబాషి గారి లేఖల వల్ల ఎన్నో మాకు తెలియని విషయాలు తెలుసుకుంటున్నాము.

మళ్ల వెంకట ఆదినారాయణ (హరిపాలెం)

*    *    *

4—2—83వ తేదీ సంచికలోని డా. జయదుబాషి గారు వ్రాసిన న్యూఢిల్లీ లేఖ చదివిన తరువాత ఈ ఉత్తరం రాయాలనిపించింది.

ఆ లేఖలో వారు ఇందిరాకాంగ్రెస్ మాయ, దాని నిర్మాణం, దానిలోని సభ్యులు అంతా మాయ అని రాశారు. అసలు మాయలేని జాతీయపార్టీ వారి దృష్టిలో ఏది ? ఇంతకుముందు జనతా పార్టీని ఓడించారు ప్రజలు. వారు చేసిన సేవ ప్రజలకు తెలియనిది కాదు. కానీ ఓడించిఇందిరా గాంధినే తిరిగి ఎందుకు ఎన్నుకున్నారు? ఇందిరా కాంగ్రెస్‌లో లేరా మీరు చెప్పిన గూండాలైన గుండూరావు, ఇబ్రహీంలు. అప్పుడు వారంతా ఎన్నుకోబడలేదా ? మరి ప్రజలకు అంత కంపన శక్తి ఉంటే వారు తిరిగి వారి నెందుకు ఎన్నుకుంటారు. దక్షిణాదిలోని ప్రజలంతా ఇందిరా కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ఎందుకు వేశారంటే శ్రీమతి ఇందిరాగాంధి ప్రదర్శించే కులతత్వ దోరణులకు విసుగెత్తి గానీ మరో కారణం ఏమీ కాదు. ఇప్పటికైనా శ్రీమతి గాంధి తన కులతత్వ దోరణులను మానుకుంటే తిరిగి ఎంతమంది గూండాలున్నా ఎన్నికవడం తథ్యం. ఆవిడ ప్రదర్శించే కులతత్వం కేవలం అంతాషెడ్యూల్డుకులాల వారికే మొదలగునవి. బీదవారు కేవలం షెడ్యూల్డుకులాల వారేనా ? ఇతర అగ్రవర్ణాల వారైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు వారితో పోలిస్తే రోజులు గడవడం కష్టం. మరి వారిని ఆమె పట్టించుకోక పోవడం వల్లే అది సంభవించింది.

డి.వి. ఎస్.రామకృష్ణశాస్త్రి (వెదురుపాక)

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

# హిప్నాటిజం 3 రోజుల్లో ప్రాక్టికల్‌గా నేర్చుకోండి!

విజయవాడ, విశాఖపట్నం, నెల్లూరు, తిరుపతి, కాకినాడ, వరంగల్, శ్రీకాకుళం, కర్నూలు, ఖమ్మం, రాజమండ్రి, విజయనగరం, గుంటూరు, మచిలీపట్నం,ఏలూరు 14 వూళ్ళలో ఒకేసారిగా, ఏకకాలంలో ఈ సంస్థ అవలీలగా, అతిసులువుగా ఈ హిప్నాటిజం ప్రాక్టికల్‌గా ట్రెయినింగు క్లాసులను విజయవంతంగా నిర్వహిస్తుంది.

మా విద్యార్థుల కోరికపై ఫిబ్రవరి మొదటి వారం కొక, మార్చి 18, 19, 20, తేదీలలో శుక్ర, శని, ఆదివారములలో ప్రొద్దుట పది గంటల నుండి సాయంత్రం 6 గంటలవరకు ఈ క్లాసులు నిర్వహించబడుతున్నాయి.

ప్రపంచ హిప్నాటిజం బోధనా చరిత్రలో ఇది అత్యద్భుతం, అపూర్వం!

3 రోజుల్లో అంటే 24 గంటల్లో మా విద్యార్థులు హిప్నాటిజంలో నైపుణ్యం సాధిస్తారు. మూడవరోజు సాయంత్రం అద్భుతమైన హిప్నాటిజం వైజ్ఞానిక ప్రదర్శన ఇస్తారు. అంతేకాదు కొత్త విద్యార్థులకు హిప్నాటిజం నేర్పే శక్తిని సంపాదిస్తారు.

ఈ సంస్థ హైదరాబాద్‌లో రోజూ సాయంత్రం 6 గంటలనుండి 9 గంటల వరకు ఈ క్లాసులను నిర్వహిస్తుంది. 5 రోజుల్లో అంటే 15 గంటల బోధనలో దీన్ని సాధించి చూపించింది. ప్రముఖ జర్నలిస్టులకు ఋజువు ఇస్తూంది.

ఈ క్లాసులకు సీట్లు పరిమితం. తిరిగి మీకు ఈ అవకాశం ఎప్పుడోగాని దొరకదు. ఏ కారణము చేతనైనా ఈ క్లాసులకు హాజరుకాలేనివారు హిప్నాటిజాన్ని పోస్టు ద్వారా కూడ నేర్చుకోవచ్చు. వీరికి ప్రత్యేకంగా ప్రాక్టికల్ ట్రెయినింగ్ క్లాసులు వుంటాయి. హిప్నాటిజం నేర్చుకోండి. జీవితాన్ని జయించండి. వివరములకు వెంటనే రు. 5/– M. O చేయండి. త్వరపడండి.

## ఈ క్లాసులను మేము చూశాం
## ఈ సంస్థ 15 గంటల్లో హిప్నాటిజం నేర్పుతూంది!

"5 రోజుల్లో హిప్నాటిజం-అనే డాక్టరు వాసుగారి ప్రకటన చూసి ముందు ఆశ్చర్యపోయాను. ఈ తరగతులకు అతిధిగా వెళ్ళి అక్కడి శిక్షణను చూశాను. డాక్టరుగారి విద్యార్థులు హిప్నాటిజంలో అద్భుతమైన ప్రజ్ఞ చూపిస్తున్నారు. అంతేకాదు, తమ తరువాత వచ్చే విద్యార్థులకు హిప్నాటిజం నేర్పుతున్నారు."

శ్రీ బి. వి. పట్టాభిరాం (మెజీషియన్, హిప్నటిస్ట్, జర్నలిస్ట్) 2. ఎల్లోరా (ఆంధ్రప్రభ వీక్లీ) 3. మద్దాళి రఘురాం (కిన్నెర ఆర్ట్స్) 4. చొక్కాపు వెంకటరమణ (బాలచంద్రిక) 5. తిరుమల రామచంద్ర (పత్రిక వీక్లీ) 6. N. C. లక్ష్మణాచారి (స్నేహ) 7. రాజా (సినీ హెరాల్డ్) 8. పి. సాయిబాబా (స్వర తరంగిణి) 9. జగన్నాథశర్మ (విపుల) 10. శార్వరి (ప్రభ వీక్లీ) 11. గుమ్మా శంకర్రావు (తెలుగు ఎకాడమీ) 12. బుర్రా సుబ్రహ్మణ్యం (ఈనాడు) 13. శాంతకుమారి (చతుర) 14. గౌస్ (సితార) 15. దేవదాస్ కనకాల (సినీ దర్శకుడు) 16. యన్. ఆర్. నంది 17. వి. రామారావ్, M com L. L B (ఆంధ్రా బేంక్) 18. డాక్టర్ పి. వెంకటేశ్వర్లు (ప్రిన్సిపాల్) 19. P.L.N. శర్మ (ప్రిన్సిపాల్) 20. పరిటాల ఓంకార్ (ఆంధ్రజ్యోతి వీక్లీ). ఇంకా . . ఇంకా ఎందరో....

[illegible]
H.I.G., [illegible] 500 044

# అందంగా



మృదువైన నేతలలో ప్రియ
టెరీన్* చీరలు. అందంగా
అలంకరిచే కుచ్చిళ్లు.
వ్యక్తిగత అభిరుచులకు అనువుగా
ఆకర్షణీయమైన వివిధ
డిజైనులలో లభ్యం.

*టెరీన్—కాకీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్.

దావణగేరె
ఫ్యాషన్ వస్త్రములు.

TA/DCM/C/4/TEL

షో రూమ్: కావేరి భవన్, బెంగళూరు-560 009.
దాజిబాన్‌పేట్, హుబ్లి 580 020. చిత్ర దుర్గా రోడ్, దావణగేరె 577 002.

ది దావణగేరే కాటన్ మిల్స్ లిమిటెడ్,
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగేరె-577 002